# చిగురులు వేసిన కలలు

డా|| జి.వి.పూర్ణచందు B.A.M.S.,

ప్రచురణ :



శ్రీమధులత పబ్లికేషన్స్

డోర్. నెం. 28-3-49, సంజీవయ్య కాలనీ,
అరండల్‌పేట, విజయవాడ - 520 002

# Chigurulu Vesina Kalalu (Novel)

Published with Sep-2014 Swathi Monthly

Written by :

**Dr. G.V.Purnachand,** B.A.M.S.,
Susruta Ayurvedic Speciality Hospital,
1st Floor, Satnam Towers,
Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada-2.
Mobile : 94401 72642; Ph : (O) 2577373

Published on the eve of
61st Birth Day of Dr. G.V. Purnachand

First Edition :
**June, 2017**

Price :
**80-00**

Cover Design :
**Artist Ramu**

Type Setting :
**Madhulatha Graphics**, Vijayawada.

Printer :
**Vijayasanthi Offset Printers**
Vijayawada - 2.

Published by :
**Sree Madhulatha Publications**
28-3-49, Sanjeevaiah Colony,
Arundalpet, Vijayawada - 520 002
Ph : 2434320 (O), Cell : 9032088555

# అంకితం



నాటకీయతకు నడక నేర్పిన నాటక రచయిత

ఆరు నంది బహుమతుల స్వీకర్త

కేంద్ర సంగీత నాటక అకాడమీ పురస్కార గ్రహీత

**డా. దీర్ఘాసి విజయభాస్కర్** గారికి

సగౌరవంగా ఈ

చిగురులు వేసిన కలలు

# పరుగులు తీసిన మనసు


భువనచంద్ర

కళ్ళు అక్షరాల మీద పరుగులు తీస్తే. మనసు పాత్రలతో పాటు పరుగు తీసింది. 2014లో యీ చిరునవలని రెండుసార్లు చదివాను. మొదటిసారి చదవి ఓట్రాన్స్‌లో జి.వి. పూర్ణచందుల వారితో గంటసేపు ఫోన్ మాట్లాడాను.

ఇప్పుడు మూడోసారి చదివాకా కూడా నా పరిస్థితి అదే. ఇదో త్రివేణీ సంగమం... సౌదమినీ, కుంతల, కాళీ, వీరి జీవితాల గురించిన ఓ ఇత:పూర్వం రాని అపూర్వమైన కథ. ఎవరి కథా వారే చెప్తుకుంటారు. అంతేకాదు, సుందరం, కామేశం లాయర్ సదాలు కూడా వారి వారి మనోగతాల్ని వారే చెప్పుకుంటారు. సంభాషణలు క్లుప్తంగా జరిపి. విశ్లేషణకి అంటే మనో విశ్లేషణకి అతిపెద్దపీట వెయ్యడమే కాక, ఏ మాత్రం పట్టు సడలకుండా దిగ్విజయంగా అన్ని పాత్రలనూ తీరానికి చేర్చిన అద్భుతమైన రచన ఇది.

అత్యంత సామరస్య వాదిగా కనిపించే జి.వి. పూర్ణనందు ఇందులో స్పృశించని అంశం లేదు. నిన్నటి వరకూ త్యాగరాజు, రామదాసు, అన్నమయ్యల్ని మాత్రమే 'స్వర మండపం'లోకి రానిచ్చిన సామాన్య గాయకులు - యీ పొత్తం చదివాక క్షేత్రయ్యని బంగారు పల్లకీ ఎక్కించి మరీ హృదయ మండపంలోకి ఆహ్వానిస్తారు.

అయ్యా, ఒక్కటి నిజంగా చెప్పితీరాలి. సంప్రదాయ వివాహమా, ప్రేమ వివాహమా లేక సహజీవనమా (*Live relationship* ) అనే విషయాన్ని తేల్చుకోలేక సతమతమయ్యే యువతీ యువకులకిది నిజంగా ఓ కరదీపిక.

వివాహం మీద ఇంత లోతుగా, ఇంతవైవిధ్యంగా ఇంత సునిశతంగా చర్చించిన రచన ఇప్పటి వరకూ రాలేదని ఘంటాపథంగా చెప్పగలను. ముఖ్యంగా, 'స్త్రీ' మనోభావాల్ని అద్భుతంగా ప్రతిఫలించిందీ నవల. "పెళ్ళంటే ఆడామగలను కలపడం మాత్రమే కాదు. రెండు కుటుంబాలను దగ్గర చేయడం. ఆ కుటుంబంతో "అల్లుకుపోయేవాడే అల్లుడు" అల్లుడికి ఎంత చక్కని నిర్వచన మిచ్చారూ!

"సంసార బంధాలను ఆర్థిక సంబంధాలూ, సహజీవనాన్ని స్నేహబంధాలూ నడిపిస్తాయి" (కుంతల)

"వలవేయడం కన్నా. వలపించడం కన్నా, వదిలించుకోవడం కష్టం" (కామేశం)

"ప్రియుని కాని వాడితో కులికేది మొగుడైనా అది సంసారం కానేరదు" (కాళీ)

"మహిళా ఉద్యమ లక్ష్యం స్త్రీ పురుష సమానత్వం సాధించడమే గానీ, యీ భూ విశ్వాన్నుంచి మగవాళ్ళను అంతం చేయడం కాదు. పురుష ద్వేషం వదిలేస్తేనే మహిళాభ్యుదయం సాధ్యమవుతుంది. (లాయర్ సదాశివ)

ఎంత చక్కని విశ్లేషణ...! ఫెమినిస్టు సోదరీమణులారా దయుంచి యీ మాట చదవరూ!

"దాసానుదాసుడైన పాలేరు క్కూడా దాసియైన భార్య వుంటుందిగా... భార్య అనే పదానికి పనిమనిషఅర్థ?" (కుంతల)

"ఫ్రాయిడ్ మనసుని మాత్రమే పట్టించుకుని సమాజాన్ని వదిలేశాడు. మార్క్సు సమాజాన్ని మాత్రమే పట్టించుకుని మనిషి మనసుని వదిలేశాడు. ఫ్రాయిడ్ నీ మార్క్సునీ కలిపి చదివితేనే సమాజంలో మనిషి మనసు కలిపి నిర్వహించే పాత్ర అర్థమవుతుంది" (లలితక్క)

"ఆడదెప్పుడూ 'ఆ ఒక్కటీ అడక్కు' అన్నట్టుండాలి. ఆ ఒక్కదానికీ లొంగితే, ఆడది మగాడికి లొంగిపోయినట్టే" (కుంతల)

"లైంగిక సంబంధమే లేకపోతే ఆడదానికి జవాబుదారీయేలేదు"

"లొంగిపోయే గుణం మనసుకున్నదిగానీ ఆల్కహాలులోనో అపోజిట్ సెక్స్‌లోనో లేదు" (సౌదామిని) అంటూనే "మా ముగ్గురి దారులూ వేర్వేరు కావు. భావాలూ వేర్వేరు కావు. జీవితాలే వేరుగా నడిచాయి" అంటూ సౌదమిని కథా సారాంశాల్ని ఒక్కమాటలో చెబుతుంది. ఈ మెరుపులు కొన్ని మాత్రమే!!!

ఈ చిన్ని పుస్తకాన్ని గబగబా చదివేస్తాం. ఎందుకంటే కథా గమనం అంతవేగంగా సాగుతుంది గనుక. నవల పూర్తయ్యాక ఆలోచనలో కూరుకుపోతాం! ఎందుకంటే, "ముగింపు" అంత చిత్రమైన ముగింపు. కా॥ రా॥ మేస్టారు అన్నట్టు ! ఈ ముగింపు 'సూచ్యం"గా చెప్పబడిందే గానీ 'వాచ్యం'గా కాదు. 'వాచ్యం' గా చెప్పినంత భ్రమను కలిగిస్తుంది.

జి.వి. పూర్ణచందు గారు నేలవిడిచి ఎక్కడా సాము చెయ్యలేదు. అసలు ఈ నవలంతా (చదువరికి కనిపించేది) స్త్రీ హృదయమే. మూడు వేర్వేరు వ్యక్తిత్వాలు. కానీ, అవి త్రివేణీ సంగమంలా అచ్చెరువు గొలుపుతాయి, ఆలోచింపజేస్తాయి.

ప్రేమలూ, పెళ్ళిళ్ళు ..కథలతో ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్న రచయితలు రచయిత్రులూ ఖచ్చితంగా చదవి తీరాల్సిన పుస్తకం ఇది. (నవల అనడం సరికాదు మిలార్డ్) ఊహించని మలుపులతో సాగిపోయే ప్రవాహమిది.

రచయిత ఎక్కడా చదువరిని / పాఠకుడ్ని మభ్యపెట్టరు. పెళ్ళి కాని వాళ్ళే కాదు.. పెళ్ళి అయిన వాళ్ళూ, పెళ్ళీడు కొచ్చిన పిల్లల తల్లితండ్రులూ కూడా చదివితీరాల్సిన

పుస్తకమది. ఓ పక్క విప్లవం, మరో పక్క సెక్శ్యువల్ రిలేషన్స్. ఇంకొక పక్క నేటి తరపు సాఫ్ట్‌వేర్ ఉద్యోగినీ ఉద్యోగస్తుల టార్గెట్‌లూ, యువతీయువకుల లక్ష్యాలూ అన్నింటినీ గమనిస్తూ, పాత్రలచేతే చర్చింపజేస్తూ, పాఠకుడిని. ఎడ్యుకేట్ చేసిన జి.వి.పూర్ణచందుగార్ని యీ నవల హిమాలయాల మీద నిలబెడుతుంది. వెయ్యి పుస్తకాల్లో ఇలాంటి ఒక్కటున్నా చాలు.., యువతకి ఆలోచించడం నేర్పడానికి!

సబ్జక్టులో రియలిజం, చదవించడంలో మెస్మరిజం, జీవితం మీద ఆప్టిమిజం... వెరశి యీ నవల కాని జీవితం ఓ అద్భుతం. ఇది కాలేజీల్లో 'పాఠ్యగ్రంథం'గా వుండడానికి అన్ని విధాలా తగినది. ఆలోచనలను రేకెత్తించడమే కాదు.. ఆ ఆలోచనలని సక్రమంగా, సరళంగా, సునిశితంగా మలుచుకోవడం ఎలానో కూడా యీ పుస్తకం నేర్పుతుంది.

ఈ పుస్తకాన్ని వ్రాయడానికి ఎంత సమయం పూర్ణచందు గారికి పట్టిందో తెలీదు గానీ, పాఠకుడికి మాత్రం ఇదో విధంగా 'అక్షయపాత్రే'. ఎన్నిసార్లు చదివినా ఇంకేదో కొత్తకోణం కనబడుతూనే ఉంటుంది. క్షేత్రయ్య పదాన్ని 'పర్యావరణ దృష్టి'లో చూసినట్లు.

చిన్నప్పుడు బెర్ట్రాండ్ రస్సెల్ గారి బుక్ ఆఫ్ ది అవర్ & బుక్కు ఆఫ్ ఆల్‌టైమ్'ని చదివాను.

ఇది నిజంగా 'బుక్ ఆఫ్ ఆల్‌టైమ్' కోవకి చెందుతుంది. ఓ సనాతనత్వాన్ని నూతనత్వాన్నీ సమానంగా తనలో నింపుకున్న జీవన గంగ ఇది. సమాజానికి ఉపయోగపడే రచన ఇది.

ఈ పుస్తకాన్ని అనుబంధ నవలగా ప్రచురించిన 'స్వాతి' బలరాం గారికి జేజేలు పలక్కుండా వుండలేము. ఎందుకంటే, పత్రికలు ముందుకొస్తేనే గదా ఇటువంటి విశ్లేషణాత్మక రచనలు వెలుగులోకి వచ్చేదీ!

చి॥ పూర్ణచంద్ గారి కిరీటంలో ఇదో కలికితురాయి. చి॥ జి.వి. పూర్ణచందు నిండు నూరేళ్ళు ఆయురారోగ్య ఐశ్వర్య ఆనందాలతో విలసిల్లాలనీ, 'సాహితీ షష్టిపూర్తి మహోత్సవం కూడా మన మధ్య మహదా... నందంగా జరుపుకోవాలనీ మనఃస్ఫూర్తిగా కోరుకుంటూ..

వారి 'షష్టిపూర్తి' సందర్భంగా ప్రచురింపబడుతున్న ఈ 'చిగురులు వేసిన కలలు' ఎందరి కలలకో ఊతమై చదూవరుల జీవితాలని 'సాఫల్యం' చేయాలని మరో మారు మనఃస్ఫూర్తిగా కోరుకుంటూ..

**చి॥ పూర్ణచందు గారికి ఆశీస్సులతో పాఠకులకు నమస్సులు..**

# చిగురులు వేసిన కలలు

## 1. సౌదామిని

"ఇంత తెలిసియుండి యీ గుణమేలరా" క్షేత్రయ్య పదం ఎక్కణ్ణించో దూరంగా వినవస్తోంది.

మనసు అటే పరిగెడుతోంది.

"పంతమా మువ్వగోపాల నా సామి" అనడుగుతోంది నాయిక,

"అలుక చేసి యింటికి రావైతివి" అని నిలదీస్తోంది.

నెనరైన చెలికత్తెలున్నారా? పిలువ వచ్చేరా?" అని ప్రశ్నిస్తోంది.

భార్యలకు దొరికిపోయిన పరమభర్తల్లాగానే ఆ పరమాత్ముడి దగ్గరకూడా 'చిటిక సమాధానం' లేదు ఈ ప్రశ్నకి. అక్కడికీ నాయిక అనునయంగా అంటోంది.

"చెలికత్తెలైన నీవె.. చెలువుడవైన నీవె తలచి చూడ నా పాలి దైవము నీవె" అని! అయినా పరమాత్ముడిలో కదలిక ఉంటేగా! తనవైపు తిప్పుకోవటానికి ఇంతకన్నా ఏం చెప్పి ఒప్పించుకోగలదు...?

కలలు మొగ్గతొడిగే వయసది. పెళ్ళినాటికి మొగ్గలు పూలై వికసిస్తాయి. పెళ్ళి తరువాత పూలు కాయలై, కాయలు మొక్కలై చిగురులు వేసినప్పుడు ఆ కలల్లో మాధుర్యం అనుభవంలో కొస్తుంది.

ఊళ్ళన్నీ తెగతిరిగి ఓ అబ్బాయిని తెచ్చి, "ఇంకనుండీ వీడే నీ మొగుడు" అన్నారు నాన్న.

ఆ ఊహకే మొగ్గలు పూలై సుగంధభరితం అయ్యాయి. ఊహలమొక్కలు చిగురించటం దాకా వెళ్ళిపోయింది మనసు.

నిన్ను ఒక అయ్యచేతిలో పెట్టి మా గుండెల మీద కుంపటి దింపుకుంటాం" అంది అమ్మ.

తన గుండెల మీద కుంపటిని కూతురు గుండెల మీదకు చేర్చటాన్నే పెళ్ళి అంటారని ఆ తర్వాత అనుభవపూర్వకంగా అర్థమైంది. ఊహలమొక్క చిగురించకుండానే మొగ్గలతో సహా వాడిపోయింది.

"నువ్వాడదానివి! ఒంగి, లొంగి కృంగివుండాలి" అని నాకూ, "నువ్వు మగాడివి. పైచేయిగా ఉండాలి, రెచ్చిపోవాలి" అని మొగుడికీ చెప్పి గదిలోకి నెట్టేశారు. పతిదేవుడిచ్చే రతిసౌఖ్యానికి వెంపర్లాడటమే ఆడదాని జీవిత పరమార్థం అని ఆ గదిలోకి వెళ్ళాక అర్థం అయ్యింది.

"అక్కరో! మగవారికెక్కడ వలపులే!" అని నన్ను నేను ఓదార్చుకోవాలి అంతే!

కార్యం అనేది ఒక అకార్యం కాకూడదు. కాలం కూడా 'మగాడిద' లాంటిదే! మన ఇష్టాయిష్టాలతో దానికి నిమిత్తం ఉండదు. దాని పని అది చేసుకుపోతుంది.

ఇంతలో, బండరాయి కొండమీంచి దొర్లుకుంటూ పూరిగుడిసుపైన దుబుక్కున పడ్డట్టు"సౌదామినీ" అని అరిచింది మా అత్తమ్మ. ఆవిడ పేరు సుబ్బమ్మ.

'వయసు తొందరల కోర్వని మదన వేదనతో మనసు తొందర గురించి ఆ ముసిల్దానికేం ఎరుక?

"ఏం పేరే నీదీ...? నోరు తిరక్కచస్తున్నాను. నిన్ను పేరు పెట్టి పిలవకుండా ఉండాలనే మీ నాన్న ఈ పేరు పెట్టాడా నీకు? ఒళ్ళు మండిందంటే సుద్దమ్మ అని పిలుస్తాను జాగ్రత్త..." అంది.

నలభై ఏళ్ళ క్రితం సుబ్బలక్ష్మిగా అత్తింటికొచ్చి తన అత్త గారి కారణంగా ఈ ఇంట్లో సుబ్బమ్మగా మారింది ఆమె మహా ఇల్లాలు.

సుబ్బమ్మ అందమైన పేరైతే సుద్దమ్మ మాత్రం కాదా?

చిన్నప్పుడు కుంతలా, నేనూ సైకిలేసుకుని పొరుగూరు వెళ్ళి సంగీతం నేర్చుకున్న రోజులు గుర్తుకొస్తున్నాయి.

"త్యాగరాజు, దీక్షితులు, శ్యామశాస్త్రుల్ని అందరూ నేర్పిస్తారు. మీకు క్షేత్రయ్య పదాలు బాగా వచ్చేలా నేను చెప్తాను. ఎవరూ పాడని వాటిని పాడితే గుర్తింపు వస్తుంది" అన్నది సంగీతం మేడమ్. కాదనటానికి మాకేం కారణాలు ఉంటాయి గనక!

క్షేత్రయ్య రాసిన చాలా పదాలు మాకు అర్థం అయ్యేవి కావు. ఒకసారి ధైర్యంచేసి, సంగీతం మేడమ్‌ను 'కులుకుచు నిద్దరు కొక్కోహము చూచుకోగా?' అంటే ఏంటని అడిగింది కుంతల.

"పెళ్ళయ్యాక అనుభంలోకి వస్తుందిలే" అని సమాధానం చెప్పిందావిడ పెద్దగా నవ్వుతూ! దీనికే చెప్పలేదు, 'చౌశీతిరతుల తేలించటం' గురించి ఇంకేం చెప్తుందనుకునే వాళ్ళం.

పెళ్ళి తరువాతే అనుభంలోకొచ్చేవాటిని పెళ్ళికి ముందే నేర్పి, అర్థాలు వెదకొద్దంటే ఎలా? మైసూరుపాకం తెచ్చి నోట్లో పెట్టి, పెళ్ళయ్యాక మింగమన్నట్టుంది. చివరికి క్షేత్రయ్యని తెలుసుకోవటానికి పెళ్ళికోసం ఎదురుచూడాల్సివస్తోంది.

అప్పుడే మాకో రహస్యం తెలిసింది. సంగీతం మేడమ్ గారి క్కూడా ఈ అనుభవం లేదని! పెళ్ళిచేసుకోలేదనీనూ! నా పెళ్ళి జరుగుతున్నప్పుడు కుంతల నవ్వుతూ, "క్షేత్రయ్య అనుభవ ప్రాప్తిరస్తు" అని నన్నాటపట్టించింది! కానీ, నిర్మలమైనదే అయినా దాని ఆశీర్వాదం ఏ మాత్రం ఫలించలేదు.

మా ఇద్దరికీ ఇంకో ప్రాణస్నేహితురాలుంది. "కాననం కాళి" దాని పేరు! దానికి ఈ సంగీతం అంటే గిట్టేది కాదు.

'మగాణ్ణి సుఖ పెట్టటానికే ఆడది పుట్టిందని, మగాడి కోసం వెర్రెత్తిపోతుందనీ ఈ సంగీతం బోధిస్తోంది. అలాంటి చదువులు నాకొద్దు' అనేది. అందుకని కాళీని 'ఖాళీ' అని పిలిచి ఏడిపించే వాళ్ళం!

ఒకసారి ఉన్నట్టుండి ఇంట్లోంచి మాయమై కాళీ ఒక పెద్దబాంబు పేల్చింది.

ఊళ్ళో అంతా "కాళీ ఎడితోనో లేచిపోయిందనే అన్నారు. అలాంటి పని మా కుంతల చేస్తుందంటే నమ్మొచ్చుగానీ, కాళీ చేసిందంటే నమ్మలేకపోయాను.

అలా అన్నానని కుంతల బాధపడిందనుకున్నాను. కానీ, అది గర్వంగానే భావించింది. ఈడుగత్తెల్లో తన పలుకుబడి పెరిగిందని మెరిసినదాని కళ్ళు సాక్ష్యం చెప్పాయి.

అడవిలో అన్నలపక్కన తుపాకీ పుచ్చుకొని ఉన్న ఒక అమ్మాయి ఫోటో పేపర్లో పడింది. అచ్చం కాళీలానే ఉందని అనుకున్నాం!

మా వాళ్ళంతా కాదన్నారుగానీ, నాకుమాత్రం అది తప్పకుండా 'కాననం కాళీ' యేనని గట్టిగా అనిపించింది. దాని మనస్తత్వం నాకు బాగా తెలుసు. దానికి విప్లవసంఘాల వాళ్ళతో పరిచయాలున్నాయి. కాబట్టి చేరదలచినచోటికే చేరింది. ఆ విధంగా అది అదృష్టవంతురాలు.

కొన్నాళ్ళకు అంతా ఆ విషయాన్ని మర్చిపోయారు. నేనూ, కుంతల మా సంగీతసాధన కొనసాగించాం. సంగీతంతోపాటు మధ్యలో అప్పుడప్పుడూ కాలేజీ చదువు చదువుతూ ఎలాగైతేనేం డిగ్రీలు పూర్తి చేసుకున్నాం. ఆ తర్వాత నేను 'ఎమ్మే తెలుగు' చేశాను. కుంతల కంప్యూటర్లు చదివింది. కాళీ ఏమయ్యిందో తెలీదు.

ఆ రోజుల్లోనే, నిద్రమాత్రలు మింగి మా ఊళ్ళో ఓ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంది. కారణం ఎవరికీ తెలీదు.

"ఆ అమ్మాయి తన అసమ్మతిని ఆ విధంగా తెలియజేసి ఉండవచ్చు" అన్నాన్నేను. కానీ, ఆమెకు ఫలానా వ్యక్తితో సంబంధం ఉందంటూ ఒక పత్రికలో అసహ్యంగా కథనాలు రాసి, వాడికి ఉచితంగా బోలెడంత పబ్లిసిటీ ఇచ్చారు.

ఆ మర్నాటి నుండీ వాడు మా ఊళ్ళో పెద్ద హీరో అయిపోయాడు. కాలరు ఎగరేసుకుతిరగటం మొదలుపెట్టాడు.

సదాశివ అనీ, మా క్లాస్‌మేటు ఒకతను ఉండేవాడు. మా కుటుంబానికి బాగా సన్నిహితుడు వాళ్ళమ్మని అత్తయ్యా అని, అతన్ని 'సదా' అని పిలిచేదాన్ని! అప్పుడప్పుడూ బావ అని కూడా అనేదాన్ని. అతను మాత్రం నన్ను మరదలుపిల్లా అనేవాడు. అతను డిగ్రీ అయ్యాక విజయవాడ వెళ్ళి 'లా' చదివాడు. మహిళాభ్యుదయ కార్యకర్తగా మంచి పేరు తెచ్చుకున్నడని పేపర్లో చదివి గ్రహించాను.

ఆ సమయంలో పత్రికల వ్యాపారధోరణిని ఖండిస్తూ మా ఊళ్ళో ఒక మీటింగు పెట్టాడు సదాశివ. ఆ సభలో కాళీ చాలా ఆవేశంగా మాట్లాడింది. ఆడవాళ్ళని రతిసుఖం కోసం వెంపర్లాడుతూ, కుతి తీరక ఆత్మహత్యకి పాల్పడేవారిగా చిత్రిస్తారా? ఇది మానవహక్కుల మీద దాడి చేయటమే అంటూ విరుచుకుపడింది కాళీ.

"ఆత్మహత్య వలన కదా ఒక ఆడది ఇంత మాట పడవలసివచ్చింది. అంతకన్నా లేచి పోవటమే ఉత్తమం" అని కుంతల అంది.

"లేదు! తుపాకీ పట్టుకొని వీళ్ళందరినీ కాల్చేయటం ఉత్తమం" అంది కోపంగా కాళీ.

మా కాళీ సామన్యురాలేం కాదు. శివాలయం పూజారిగారమ్మాయి. అన్ని కట్టుబాట్లలోనూ పెరిగింది.! కానీ, దానికి దైవభక్తి అబ్బలేదు. మడీ ఆచారాలంటే ఏవగింపు. మగాళ్ళంటే దానికి పురుగుల్లా కనిపిస్తారు.

"రాముడు కుక్కని కొట్టెను" అనే వాక్యంలాంటివాడు మగాడు. "రాముని చేత కుక్క కొట్టబడెను" అనే వాక్యంలాంటిది ఆడది. దాని బతుకెప్పుడూ పాసివ్ వాయిస్సే. ఆడది చేయబదుతుందట. అసలీ బతుకే ఒక బూతనిపిస్తోంది! ముందు ఇలాంటి మగాళ్ళని కాల్చేస్తేగాని ఆడదాని బతుకు బాగుపడదు" అనేది కాళీ! అలాంటి కాళీ అదృశ్యం అయితే, ఎవడితోనో లేచిపోయిందానిగా ముద్ర వేయటం నాకు బాధనిపించింది.

"మనిషికొచ్చే ఆలోచనల్లో సెక్స్ కూడా ఒకటి. అంతేగానీ, సెక్స్ ఒక్కటే ఏకైక

కార్యంకాదు. హృదయాన్ని తాకి, సేదతీర్చే తోడుకోసం వెంపర్లాడుతుంది మనసు. దానికి మలిన శృంగారాన్ని అంటగడ్తారేం?" అన్నాన్నేను.

"మనసు పడే ఆరాటం 'అమలిన శృంగారం' శరీరం పడే ఆరాటం మలిన శృంగారం...!" అంటావా అంది కుంతల. అది ప్రతి విషయాన్నీ చాల తేలికగా తీసుకుంటుంది.

నేను బుర్రలో కూరి దాచిపెడతాను. కాళీ అక్కడికక్కడే ఫటాఫట్ అని తేల్చిపారేస్తుంది. ఇంతకీ క్షేత్రయ్య అనుభవం మలినశృంగారమా... అమలిన శృంగారమా...? నాకూ తెలీదు.

నేను కాపురానికి వెళ్ళిన కొత్తల్లో ఒకరోజు పెద్దబజారు కారణంగారి కోడలు లేచిపోయిన సంగతి పనిమనిషి రత్నం వచ్చి చెప్పింది. నాలో ఉడుకు కలిగించాలని, "ఓ సౌదానమ్మోయ్! ఆ అసల్ది లేని బతుకు దండగ" అని సూటిగా నాతోనే అంది. నాకు భర్త సుఖం లేదని తనకు తెలిసిపోయినట్లు ఆ వ్యంగ్యం నన్ను పొడిచింది.

దాన్నెందుకు మాట్లాడనిచ్చానా అనిపించింది.

లేచిపోయినవాళ్ళ కథలు రోజుకొకటి ఇలా తెచ్చి అది చెప్తుంటే అసహనం అనిపించి, మర్నాటినుండి రావద్దని పని మాన్పించేశాను.

లేకపోతే, అది నన్ను ఇంట్లోంచి లేపుకుపోయి, ఎవడికో అమ్మేస్తుందేమోనని భయం వేసింది. కానీ, అది తెచ్చి వినిపించిన కథలు బుర్రలోంచి పోలేదు.

"మనసులోని ఆలోచనా స్రవంతిలోకి బుర్ర ప్రవేశించినప్పుడు ఆ క్షణాన అక్కడ ఏ ఆలోచనయితే ఉందో అదే చిలవలుపలవలై ఒక నిర్ణయంగా బయటకొస్తుంది..." అని కాళీ ఒకసారి చెప్పింది. దాని ప్రతి మాట శాస్త్రీయంగా ఉండేది.

"మనకొచ్చే ఆలోచనలకు మనం కారణం కాదా.....?" అని రెట్టించింది కుంతల.

కానే కాదని వాదించింది కాళీ!

"నదిలో బిందెని ముంచితే, ఆ ముంచేప్పుడు అక్కడున్న నీళ్ళు బిందెలోకి చేరినట్టే మనసులోని చైతన్యప్రవాహంలోంచి బుర్రలోకి ఆలోచనలు చేరతాయి" అని వివరించి చెప్పింది.

ఈ మధ్యకాలంలో ఎప్పుడు చూసినా 'లేచిపోయే' ఆలోచనలు మాత్రమే బుర్రలోకి దూసుకొస్తున్నాయి. అంటే నా మనసు నాకు తెలీకుండానే అలాంటి ఆలోచన చేస్తోందన్నమాట.

నేను మనసుకు లొంగి లేచిపోవాలా...?

లేచిపోతే ఎవరితో లేచిపోవాలి...?

అసలెందుకు లేచిపోవాలి...?

ఒక ఆడది తన మనోభావాల్నీ, తన ఆర్తినీ, తన ఉద్వేగాల్నీ, తన ఆదర్శాల్నీ, తన లక్ష్యాల్నీ నెరవేర్చుకోవటానికి అడ్డుగా ఉన్న ఈ వ్యవస్థనీ, అవస్థనీ ఒక తన్ను తన్ని దూరంగా వెళ్ళిపోతే అది లేచిపోవటం కాదు, లేచి వెళ్ళటం! కాళీ లేచి వెళ్ళిందేగాని లేచిపోయింది కాదు. నాకు వేచేంత ధైర్యం లేదా?

"నువ్వు ఎన్నయినా చెప్పవే! సానిలాగా సంసారి చెడుతిరుగుళ్ళు తిరగలేదు. సంసారిలాగా సాని ఒక్కడితో ముడిపడి జీవించనూ లేదు. సృష్టి నియతి ప్రకారమే జరుగుతుంది..." అంది ఒకసారి కుంతల.

"అంటే, ఆడవాళ్ళని సంసారులు, సానులు అని రెండు రకాలుగా వర్గీకరిస్తున్నావా? ఆడవాళ్ళలో ఈ దుష్టసమాజం అంతు చూసే స్వేచ్ఛాజీవులు కూడా ఉంటారు. వాళ్ళు ఈ వర్గీకరణలో మూడోరకం" అంది కాళీ! అలా సాగుతుండేవి మా కాలేజీలో చర్చలు చదువు సాగే రోజుల్లో! ఆ తరువాత నాకు పెళ్ళిచేశారు అమ్మానాన్న!

"రతిలాహిరిలోనే ఇల్లాలైననూ నడవదా మువ్వగోపాలా...?" అని పెళ్ళయిన కొత్తలో అనిపించేది, అంతే!

"ఉంది నువ్వూ .... లేక నేనూ సమానమేకదా" అని ఏ వితంతువైనా నా గురించి అంటుందేమో...

మాసిన గెడ్డం, మరకల చొక్కా, రేగిన జుత్తూ, చుట్టపీకల కంపెత్తే నోరూ, పులిసి చద్దికంపు కొట్టే శరీరం చేతిలో సగం ఖాళీ అయిన సీసా... ఇలాంటి మనిషి ఎక్కడయినా తాగిపడుంటే, వాడు నా మొగుడే... దయచేసి అతన్ని అక్కడే వదిలేసి మీ దారిన మీరు వెళ్ళిపోండి. నా మనసు అతని కోసం ఆరాటపడటం ఎప్పుడో మానేసింది! వీలైతే ఆ సంగతి అతనికి చెప్పండి! ఆలోచనలు వరదప్రవాహంలా సాగిపోతున్నాయి. నా ప్రమేయం లేకుండానే ముంచుకొస్తున్నాయి. వాటిలోంచి తప్పించుకుంటుండగా ఒక ఉత్తరం వచ్చింది.

ఆశ్చర్యం ...! అది కుంతల నుంచి!

ఆత్రంగా చదువుకున్నాను. మళ్ళీ మళ్ళీ చదువుకున్నాను.

-- XXX --

## 2. కుంతల

మగాడు గుచ్చి గుచ్చి ఆడదాని శరీరంలో ఏయే భాగాలు చూస్తాడో ఆయా భాగాలను కప్పుకొని, సిగ్గుపడిపోతూ.... వాడు ఇంకా చూస్తున్నాడో లేదో దొంగచూపులు చూస్తూ...

తన చూపులు బయటపడకుండా జాగ్రత్త పడుతూ...

వాడి చూపులకు చిక్కకుండా తప్పించుకుంటూ... మనసుతోనే కవ్విస్తూ... అలా సరదాగా తిరిగిన కుర్రరోజులన్నీ కళ్ళలో మెదిలాయి.

ఇన్నాళ్ళకు సౌదామినికి ఉత్తరం రాసే అవకాశం కుదిరింది. దానికి పెళ్ళయి కాపురానికి వెళ్ళాక ఉత్తరమో, ఫోనో వస్తుందని ఎదురుచూసి ఆ విషయమే ఇంక మర్చిపోయాను. 'ఎలా ఉన్నావు సఖీ...' అంటూ ఆ ఉత్తరంలో పలకరించాను. ఈ సారి తన సెల్ నెంబర్ ఇవ్వమని రాశాను.

కొన్నాళ్ళు సౌదామినీ నేనూ కలసి స్పెషల్ తెలుగు చదూకొన్నప్పుడు అల్లసాని పెద్దన గారి "అతడా వాతపరంపరా పరిమళ వ్యాపారలీలన్..." పద్యం గుర్తుకొచ్చింది.

ఆకాశాన్ని తాకుతున్న హిమశిఖరాలపైన పరవళ్ళు తొక్కుతున్న జలపాతాల దగ్గరున్నప్పుడు ప్రవరుడికి అకస్మాత్తుగా ఏదో మంచి గంధం వాసనొచ్చిందట! ఆ వాసన పట్టి ఇక్కడెవరో మనుషులున్నారని ఊహించి అటుగా వెళ్ళాడట.

వెళ్ళిచూస్తే ఒక విద్యుల్లతావిగ్రహం కనిపించింది.

ఆమె శతపత్రేక్షణ – అంటే కలువపువ్వులవంటి కన్నులు కలది!

చంచరీక చికుర – తుమ్మెదల దండులాంటి కన్నులు కలది!

చంద్రాస్య – చంద్రబింబంలాంటి మోము కలదీ.

చక్రస్తనీ – చక్రవాక పక్షుల ఆకారంలో ఉండే రొమ్ములు కలది.

నతనాభి అంటే బాగా లోతైన బొడ్డు కలదిట.... అలాంటి మరున్నారీ శిరోరత్నం దేవతా స్త్రీ ప్రవరుడికి కన్పించిందట.... ప్రవరుడొచ్చి ఈ ఏలూరులో సౌదామినిని చూస్తే ఇప్పుడు కూడా అలానే అనుకుంటాడా... ? సౌదామిని ఇంకా వరూధిని మూర్తి మతతో అలానే ప్రకాశిస్తోందా...? సుఖంగా ఉందా?

సౌదామిని ఎప్పుడు గుర్తుకొచ్చినా ఈ పద్యం నా బుర్రలోకొస్తుంది.

సౌదామినిని చూసే పెద్దనగారు రాశాదని నాకనిపించేది.

చదువుకునే రోజుల్లో పువ్వుచుట్టూ తేనెటీగల్లా కుర్రాళ్ళు ఎందుకలా సౌదామిని కోసం వెంపర్లాడిపోయే వాళ్ళో అప్పట్లో నాకు అర్థం అయ్యేది కాదు.

ఇప్పుడైతే నాకే అనిపిస్తోంది.... త్వరగా వెళ్ళి సౌదామినిని ఒకసారి చూసిరావాలని!

కాలేజీలో చదువుకునే రోజుల్లో రోడ్డుమీదకు వెడితే, కుర్రాళ్ళ గోల.

సంగీతం క్లాసుకు వెడితే, "ఇద్దరి సందున పవళించివున్న ఇంతి పేరెవరురా...?" అంటూ క్షేత్రయ్య పాటల గోల!

తెలుగు మేడమ్ దగ్గరకెడితే, ప్రవరుడి పొందుకోసం వెంపర్లాడే వరూధిని గోల! ఇన్ని గోలల్లోంచి ఏ ఒక్క గోలయినా తప్పించుకోవచ్చని, నేను తెలుగు లిటరేచర్ వదిలేసి కంప్యూటర్ కోర్సులో చేరిపోయాను.

బహుశా, ఆ వయసులో ఒక మంచిపని చేశానని ఇప్పటికీ అనుకుంటాను. క్షేత్రయ్యగారి "కులుకు గుబ్బలు గుచ్చి కౌగిలించు" పదాన్ని ఎంత హుషారుగా పాడేవాళ్ళమో!

సౌదామిని పాడితే, ఇంకా గుండెలోతుల్లోంచి ఆ పాట రావాలనేది సంగీతం మేడమ్, నేను పాడితే మాత్రం, 'అమ్మానాన్నలు పెళ్ళిచేసేదాకా ఆగేలా లేదు' అనేది. అలా నా మీద ఒక ముద్ర పడిపోయింది. మా బృందంలో అందరికీ పెళ్ళిళ్ళయ్యాయి నాకే ఆ అవకాశం రాలేదు. అందులో నా బాధ్యత కూడా ఉంది. అదే సౌదామినికి ఉత్తరంలో చెప్పాలనుకున్నాను.

ఒకసారి మా మధ్య సంభాషణ అమలినశృంగారం మీదకు మళ్ళింది. సౌదామిని ఒక నిర్వచనం చెప్పింది. మొగుడితో కలిస్తే 'అమలినశృంగారం' అనీ, మొగుడు కాని వాడితో జరిగేది 'మలినశృంగారం' అనీ!

"మొగుడు ఎప్పటికీ ప్రియుడు కాలేడనే నీ అభిప్రాయమా" అని అడిగాన్నేను.

"ప్రియుడు కానివాడితో కులికేది మొగుడైనా అది సంసారం కానేరదు." అంది కాళీ.

'దుస్సహ వియోగభరమే మధురము సకియా' అంటూ ప్రేయసికి కావాలని దూరంగా వెళ్ళి, విరహం ఏడుపులు ఏడిస్తే, అది అమలినశృంగారం అవుతుందా?

ఎంత గొప్ప లాజిక్కండీ మీ భావకవులది...!

పార్వతిని కొట్టి పారిపోయిన దేవదాసు ఏడుపుని అమలినశృంగారం అంటారా? అని నేను ఎద్దేవా చేశాను.

అమలిన శృంగారభావనలోంచే భావకవిత్వం పుట్టింది అంది సౌదామిని, 'గగనసుందరి రాత్రంతా చంద్రుడితో కులికినప్పుడు ఆవిడ మెడలో తెగి వ్రేలాడుతున్న రత్నాలహారంలా, ఆకాశంలో పక్షులగుంపు సాగిపోతోం'దంటూ ఒక భావకవిత రాసి చదివి వినిపించింది.

"చంద్రుడిమీద, నీళ్ళు మరిగేంత వేడిపగళ్ళూ, రక్తం గడ్డకట్టేంత చలిరాత్రిళ్ళూ ఉంటాయి. చంద్రుడేం శాంతుడు?" అనడిగాను.

సౌదామిని నవ్వి, చంద్రుడికి పదిహేనురోజులు పగలు, పదిహేను రోజులు రాత్రీ ఉంటుంది. ఆ పదిహేను రోజుల చలిని తట్టుకోటానికి చంద్రుడికి గగనసుందరి కౌగిలింత అవసరం కాదా...?" అనడిగింది. దానిదెంతయినా కవితాహృదయం.

"మరి, వేసవిలో రతికార్యానికి చంద్రుడు సెలవిస్తాడా?" అని నేను దాన్ని రెట్టించాను.

ఇంత నిర్మలంగా మాట్లాడుకోగలిగిన చక్కని రోజులవి.

మన బాల్యం మళ్ళీ మనకు రమ్మంటే వస్తుందా? బాల్యం సంగతి తెలీదుగానీ యవ్వనం మాత్రం రమ్మన్నారాదు.

పెళ్ళై సౌదామిని వెళ్ళిపోయాక సంగీతం నేర్చుకోవటానికి నాకు మనసొప్పలేదు.

సాఫ్ట్‌వేర్ రంగంలో అనుక్షణం కెరీరు కోసం పాకులాటే ఉంటుంది. 'అలరు విల్తుని కేళి' గురించిన ధ్యాసే ఉండదు. డబ్బుర౦ధిలో పడితే అన్ని రుచులూ ఆవ్[illegible]యి.

అన్నీ వదిలేసి, కంప్యూటర్లను కావులించుకొని లాప్‌టాపు మీదే తల వాల్చుకుని పడుకోవటం అలవాటయిపోయింది నాకు!

ఏ అర్ధరాత్రికో సుందరం వచ్చి నిద్రలేపి, "వెళ్ళి మంచం మీద పడుకోవచ్చుగా!" అంటాడు. "ఫేసుబుక్కంటే ఫేసుని బుక్కుమీద పెట్టి నిద్రపోవటం కాదు" అని నవ్వుతాడు.

సుందరం నవ్వంటే నాకెంతో ఇష్టం.

ఎదుటి మనిషిలో నచ్చే విషయం ఒక్కటైనా ఉంటుంది. దాన్నొక్కదాన్నే తీసుకుంటే ఆ వ్యక్తి నచ్చినవాడవుతాడు. అతనిలో నచ్చనివాటి గురించి ఆలోచిస్తే, నచ్చని వాడైపోతాడు. ఇది తెలిస్తేనే నిజజీవితంలో సహజీవనం చేయగలుగుతారు.

ఇంతకీ సుందరం ఎవరో చెప్పనే లేదు కదూ..? సుందరం నా సహజీవి!

పెళ్ళిళ్ళతో నిమిత్తం లేకుండా, పరస్పరం నచ్చిన ఆడా, మగా ఏకాంతంగా కలిసి సహజీవనం సాగిస్తారని, చదువుకునే రోజుల్లో మాకు తెలీదు. మగాడి చెయ్యి తగిలితే చాలు ఆడదానికి పాణిగ్రహణం జరిగిపోయినట్టేనని అనుకునేవాళ్ళం.

ఇప్పటి రోజులతో పోలిస్తే మాకవే సత్తెకాలపు రోజుల్లా కనిపిస్తున్నాయి.

నాగరికసమాజంలో సహజీవనం అనేది ఒక ఫ్యాషన్. ఈ ముంబయి నగరంలో ఎవరూ దాన్ని తప్పుపట్టరు. లేచిరావటం, లేచిపోవటం అనేవి నాగరికమే! ఇక్కడ సహజీవనం గురించి తప్పుపట్టేంత తీరిక ఎవ్వరికీ లేదు. ఈ నగరంలో మనుషులు తమంత తాము నడవరు. అది జనప్రవాహం. వెనకాలవాళ్ళు ముందువాళ్ళని తోసుకుంటూ పోతారంతే!

"ఒంటరిగా ఉన్నావా? ఎవరైనా మగాణ్ణి సహజీవనానికి ఉంచుకో....?" అని అమ్మలక్కలంతా చాలామంది అన్నారు. సహజీవనానిక్కూడా నచ్చిన మగాడు దొరకాలి... అంతగా నచ్చిన మగాడే దొరికితే, పెళ్ళే చేసుకోవచ్చుకదా...? ఒకవేళ ఆ సహజీవి నచ్చకపోతే ఇల్లు మారినంత తేలిగ్గా మగాణ్ణి మార్చుకోవచ్చు. పెళ్ళి చేసుకుంటే ఇది సాధ్యంకాదు కదా! కాబట్టి సహజీవనమే బెస్టు! సుందరం కూడా అందుకు ఒప్పుకున్నాడు.

సుందరం గురించి చెప్పేందుకు చాలా విషయాలు ఉన్నాయి.

"ఆటకు మేటి కావలె, తంబుర గోటమీట రాగమనవలె. వాటిపై సొగసుపాటలు వినిపించవలె. వాని మనసు తెలిసి మాటలాడనేరవలె... ఓ చెలియరో" అనే మాటలు అక్షరాలా సుందరానికి సరిపోతాయి. అతను పేరుకు తగ్గ మనసున్నవాడు.

సుందరం కూడా సాఫ్ట్‌వేరే! అంటే, నాలాగే కంప్యూటర్ని కావులించుకొని బతికే ఉద్యోగంలో ఉన్నాడు. అందుకే, మా ఇద్దరికీ సహజీవనం కుదిరిందేమో!

మాకు డ్యూటీల్లో రాత్రీ పగలూ అనేవి ఉండవు. మేం పనిచేసే అమెరికన్ కంపెనీలు పగలు పనిచేస్తాయి. వాళ్ళకోసం మేం రాత్రిళ్ళు పనిచేస్తాం.

మన దేశం 'రిసీవింగ్ ఎండ్' లో ఉంది కాబట్టి ఇలా జరుగుతోంది. మనం కమాండ్ చేసే స్థితిలో ఉంటే అమెరికావాడు రాత్రిళ్ళు మేల్కొని మన ద్వారా వ్యాపారం చేసుకునేవాడు.

సాఫ్ట్‌వేర్ రంగంలో రాణించాలంటే మానసిక శాంతి కావాలి. నిప్పులపక్క మీద పడుకుని కెరీర్ పెరగాలంటే కుదరదు. అలాంటప్పుడు కష్టసుఖాలను సహజీవి పంచుకున్నట్టు భర్త పంచుకుంటాడనుకోను. ఈ రంగంలో పెళ్ళి ఒక ప్రతిబంధకం. 'ముప్పయేళ్ళొచ్చేస్తున్నాయే నీకు' అని అమ్మ గోలపెడుతూనే పోయింది. నాన్న నా చిన్నప్పుడే పోయాడు.

నిజం చెప్పనా? నా వ్యక్తిగత జీవితం గురించి సుందరం ఏనాడూ అడగలేదు. నేనూ అతన్ని ప్రశ్నించలేదు. అతనూ నేనూ ఒక వయసువాళ్ళమే! అంతకుమించి అతని వివరాలు నాకు తెలీవు. నేనడగలేదు. అతను చెప్పేవాడేమో గానీ, నేనే వినేందుకు ఉత్సాహం చూపించేదాన్ని కాదు. నాకు చరిత్ర అంటే మహామంట! మేం ఇద్దరం భార్యాభర్తలం కాదు, జస్ట్ స్నేహితులం! మాలో ఒకరిమీద ఇంకొకరి పెత్తనం ఉండదు. ఎవరి జీవితం వాళ్ళది. ఖర్చు చెరిసగం భరిస్తాం. మిగతా సంపాదన గురించి అడగం. మా మధ్య ఆర్థిక సంబంధాల్లేవు. స్నేహబంధాలే!

మా ఇద్దరిమధ్యా అన్నీ ఒప్పందం ప్రకారమే జరుగుతాయి.

ఉంటున్నది ఒకే ఇంట్లోనే అయినా, పడుకునేది వేర్వేరు గదుల్లో! మేం లోకం కోసం కలిసి బతకట్లేదు. మా కోసం... మా సంతృప్తికోసం, ఒకరి కొకళ్ళం ఆసరాగా లతలాగా పెనవేసుకొని సాగిపోవటం కోసం... అంతే! ఇద్దరం కలిసే వంట చేసుకుంటాం. కలిసే షాపింగ్ చేసుకుంటాం. ఎవరి బట్టలు వాళ్ళమే ఉతుక్కుంటాం. ఎవరి గది వాళ్ళమే ఊడ్చుకుంటాం.

సంసారజీవితంలో అయితే, ఇవన్నీ ఆడది మాత్రమే చెయ్యాలి, అదీ తేడా!

పెళ్ళి శాశ్వతబంధం అంటారుగానీ, అది శాశ్వత ప్రతిబంధకం! జీవితం అనేది మార్చుకునేందుకు వీలుగా ఉండాలి. అది సహజీవనంలోనే సాధ్యం, మార్చుకోవటం అనేది ఒక ఆప్షనే గానీ, మార్చుకొనితీరాలని కాదు.

సంసారబంధాలను ఆర్థికసంబంధాలూ, సహజీవనాన్ని స్నేహబంధాలు నడిపిస్తాయి. ఈ విషయాన్ని గుర్తిస్తే, సహజీవనం పట్ల ప్రజల్లో ఉన్న అపోహ తొలగిపోతుంది.

జంట కట్టేవాళ్ళు స్నేహితులో, ప్రేమికులో అయితే, అది అమలినశృంగారం!

పంచాంగం చూసి ముహూర్తం పెట్టింది పవిత్రశృంగారం, కుతికొద్దీ జరిపేది మలిన శృంగారం సుందరానికీ నాకూ మధ్య ఇలాంటి శృంగారాల ప్రసక్తే లేదు. ఒకవేళ దానిక్కూడా పేరేదైనా పెట్టాలంటే 'స్నేహశృంగారం' అని పిలవొచ్చనుకుంటాను.

మనసుకూడా మా కంప్యూటరు ఉద్యోగిలాంటిదే! రేయనకా పగలనకా పనిచేస్తుంది.

విరహం రాత్రిపూట మాత్రమే కలుగుతుందని కవులు రాస్తారుకానీ, ఆసక్తి ఉంటే, ఏ ఆలోచనైనా ఏ సమయంలోనైనా రావచ్చు. ఆసక్తి లేకపోతే ఏ సమయంలోనూ రాదు.

స్వచ్ఛమైన విరహం కలిగేవరకూ సెక్స్ జోలికి పోకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాను. ఒకసారి విరహం కలిగితే ఆ తర్వాత నా మాట నేనే వినను!

సుందరం మీద నమ్మకం కలిగాక, సహజీవనానికి ఓకె చెప్పటానికి చాలా సమయం తీసుకున్నా! ఈ 'ఓకె'లో పెళ్ళి ప్రస్తావన లేదు. సూదిబెజ్జంలో రోకళ్ని దూర్చాలనుకునే లోకం కోసం కాదు, నా కోసమే! మా ఇద్దరికోసమే! సుందరం పేరుకు తగ్గవాడే కాదు, నాకు తగ్గవాడు కూడా! ప్రస్తుతానికి అంతే! అలా... నా గదిలో నేను!

-- xxx --

# 3. కామేశం

"ఏమివాయ్! మైడియర్ కామేశం, ఓ శృంగార కథ ఇటువదులు" అన్నాడు మా మిత్రుడు.

"పేకాటలో శృంగారకథలు రసభంగం చేస్తాయి" అని వారించోయాను.

"చిన్న కథ చెప్పు! రంజుగుండాలా!" అన్నాడు మిత్రుడు.

పేకముక్కలు షేక్ చేస్తూ కథ మొదలెట్టాను. ముగ్గురం కూర్చుని ఆడ్తున్నాం.

"ఓ వెర్రివెంగళప్ప ఉన్నాడు. వాడు నిద్రపట్టక పడకమీద పడి దొర్లుతూ 'ఏమేవ్... ఒసేవ్' అని పెళ్ళాన్ని తెగ పిలుస్తున్నాడు..." అంటూ కథ చెప్తూనే పేకముక్కలు మా ముగ్గురికీ పంచటం మొదలుపెట్టాను.

"మరి మగాడికి మూడొచ్చినప్పుడు ఆడది రాకపోతే ఏవుందీ...? మూడౌట్! ఆ తర్వాత ఈడు ఇటూ, అది అటూ తిరిగి తొంగుంటారు" అన్నాడు మిత్రుడు. వాళ్ళిద్దరూ ఆసక్తిగా కథ వింటూనే పేకముక్కల మీద ఓ కన్నేసి ఆడ్తున్నారు. కథ అడిగిన మిత్రుడు లైఫు రాలేదని 'ఛా! ఏం ఛండాలం ముక్కలేశావయ్యా...!' అంటూ ముక్కలు మూసేశాడు.

"ఏం అప్పుడే డౌనా?" అన్నాడు లైఫొచ్చిన మిత్రుడు.

"ఎవరాటని ఆళ్ళే ఆడుకోవాలి, ఎవడి పెళ్ళాన్ని ఆడే ఏలుకున్నట్టు! ఎదురోడికి బొక్కెదదా మంటే ఎదురుబొక్కవుద్ది!" అని మా మూడోవాడు లైఫుని ఎకసెక్కాలాడాడు.

నేనుమాత్రం, నాకు ఉపయోగపడని రాజుల్నీ, రాణుల్నీ, విడిముక్కల్ని ఒక్కొక్కటే వదిలించుకుంటున్నాను.

ువేయటం కన్నా వలపించటంకన్నా, వదిలించుకోవటం కష్టం. వదిలించుకోవటంలో నా అంతవాడులేదు.

లైఫు రాని మిత్రుడు ఆట దింపేశాడు! లైఫొచ్చిన మిత్రుడు ఆడ్తున్నాడు. వాణ్ణి నేనెప్పుడూ లైఫూ అనే పిలుస్తాను. అప్పుడప్పుడూ కాపర్స్ సర్దుతుంటాడు కాబట్టి!

నేను వాళ్ళని మళ్ళీ కథలోకి లాగాను. "పక్కమీద దొర్లుతూ ఆ భర్త ఎంత పిలుస్తున్నా భార్య వంటింట్లోంచి బయటకు రాలేదు. బదులూ పలకలేదు. వంటింట్లో గుడ్డిదీపం మినుకు మినుకుమంటోంది. గదిలోపల ఇంకెవరో ఉన్న అలికిడైతే లేదు" అని అక్కడదాకా చెప్పి ఆగాను.

"ఆవిడొక్కతే ఆ వంటింట్లో ఏం చేస్తున్నట్టో?" ఆత్రంగా అడిగాడు లైఫు.

"కథల్లో కూడా ఆడాళ్ళని అనుమానిస్తావేందయ్యా!" అని అసహనంగా అన్నాడు మా మూడోవాడు.

"లైఫూ! నీకొచ్చినట్టే దాని మొగుడిక్కూడా డౌటొచ్చిందయ్యా! వంటింటిదాకా నక్కినక్కి వెళ్ళి తొంగిచూశాడు. ఆ ఇల్లాలు వంటిల్లు కడుక్కొంటోంది. హమ్మయ్య అనుకుని వెనక్కి వచ్చేసి మంచం ఎక్కి పడుకున్నాడు" అని చెప్పాను. ఇంతలో లైఫు తన ఆటవంక ఒకసారి చూసి "అమ్మో! నా కళావరిమణేలా ఏదీ...? కన్పించట్లేదు" అని అరిచాడు.

"ఆ కళావరిమణేలానే నీ దగ్గరనుండి లేచిపోయి ఆడిముక్కల్లో దూరింది. ఇందాక నువ్వు వేసేసింది ఆ ముక్కనే! మన కామేశం వెర్రిబాగుల మొగుడేంటీ... తురుఫాస్తే ఎత్తి దూర్చకుండా ఉండటానికి?" అని నవ్వాడు మా మూడో మిత్రుడు.

"వచ్చి దూరుద్దిలే... నీ బతుకులోకి ఓ కళావరిమణేలా...! అయినా నాకు తెలీక అడుగుతా... వెళ్ళిపెటాకుల్లేవు కదా ఇన్ని శృంగారకథలెలా పుట్టిస్తావు కామేశం" అడిగాడు లైఫు.

విరాగిలా ఓ నవ్వు నవ్వాను. నవ్వుల్లో రకాలు తెలియటానికి వాడు తిక్కన భారతం చదివినోడు కాదని నాకు తెలుసు.

వీడికి నా గతం అవగతం అవ్వాలంటే చానా టైం పడుతుంది. అందుకని అదంతా చెప్పే ప్రయత్నం చెయ్యలేదు. అందుకనే విరాగినవ్వు నవ్వి మళ్ళీ కథలో కెళ్ళాను.

"ఒసే! చెవిటిమాలోకమా! రానురానూ నేనంటే లెక్కలేకుండాపోతోందేం? ఇప్పపూలు ఉంటే పట్రమ్మని ఎన్నిసార్లు చెప్పాలి? నాలుగుపూలు తింటే నిద్ర పడుతుంది" అనరిచాడు భర్త. నిద్రపోయే ఉద్దేశ్యంలో భర్త ఉన్నాడని గ్రహించిన ఆ భార్య, ఇంట్లో ఇప్పపూలు అయిపోయాయి. గ్రామాధికారి పెరట్లో ఇప్పచెట్టుందిగా! కాసిని పూలు ఏరుకొస్తా అని బయల్దేరబోయింది...." అంటూ నేను కథ కొనసాగిస్తున్నాను.

అబ్బ ఛా! ఆశ, దోసె, అప్పడం ... ఈ వంకపెట్టి గ్రామాధికారి ఇంటికెళ్ళి అర్ధరాత్రి దాకా ఆడితో కులికిరావచ్చని ఎత్తు ఎత్తింది... అని కిసుక్కున నవ్వాడు లైఫు.

"నీదేం పాడుబుద్ధయ్యా! ఆడాళ్ళంతా పరాయిమగాళ్ళతో కులికేవాళ్ళంటావు?" మళ్ళీ అరిచాడు మూడోమిత్రుడు.

"అక్కడికి మగాళ్ళేదో తేరగా ఉన్నట్టు" అని నేనూ నవ్వాను.

"నువ్వు తేరగా లేవులే! నీ కథ సరే!" అన్నాడు లైఫు.

మా లైఫు నాకేదో కితాబిచ్చాడనిపించింది. వాడికి నా గురించి ఏం తెలుసు?

"మొత్తానికి ఈ చిన్నకథలో ఇది నీ కథేనన్నంతగా లీనం అయిపోయావు. కథ చెప్పేవాడికి నీలాంటి శ్రోతే కావాలి" అని లైఫుని అభినందించి కథ కొనసాగించాను.

"ఈ కథలో నాయిక ఇప్పుడే ఇప్పపూలకోసం వెళ్తాననేసరికి సదురు భర్తకి గుండె ఆగినంత పనయ్యింది. అనుమానం మొగుడుకదా... తన మీద తనకు నమ్మకం లేనివాడే భార్యని అనుమానిస్తాడు.

'నువ్వెళ్ళద్దు! నేనే వెళ్ళి ఇప్పపూలు తెస్తా' అని చెప్పులేసుకొని ఉత్తరీయం కప్పుకొని బయల్దేరాడు భర్త' అన్నాను.

లైపు మళ్ళీ కిసుక్కున నవ్వి, అన్నాడు.

"అద్గదీ! మగాడంటే అలా ఉండాలి! చీకట్లో పెళ్ళాన్ని పరాయింటికి పంపొచ్చా? నా దగ్గరకు రమ్మను, పెళ్ళాన్ని అదుపులో పెట్టటం నేర్పిస్తా! నోరెత్తనివ్వకూడదు, కన్ను పక్కకు తిప్పనివ్వకూడదు" అన్నాడు.

వాడి మాటలకు నవ్వి, "నువ్విసిరిన ముక్కతో నా ఆటైపోయింది. ఇంక నువ్వెళ్ళి పూలేరుకో" అన్నాడు.

మా మూడోవాడు రెండొందలు ఫుల్ కౌంటిచ్చుకున్నాడు. పెద్దముక్కల్ని అట్టేపెట్టుకుని, మా లైపు మూడొందలు చెల్లించాడు నా దగ్గరున్న రెండొందలూ తీసుకుని, ఐదు వందలు నోటిచ్చాడు. దాన్ని జేబులో పెట్టుకున్నాను. ఇది పదిరోజుల గ్రాసం .... నాకు! కానీ ఈ ఐదొందల నోటు నా బతుకుతో చెలగాటం ఆద్తుందనీ అప్పుడు నాకు తెలీదు.

ఈ మధ్యకాలంలో ఇంత పెద్ద మొత్తం రావటం ఇదే మొదటిసారి.

మా మూడోవాడు ముక్కలు కలుపుతుంటే, 'ఇంక నేను ఆడన్లే' అంటూ లేచాను.

"అదేవిటీ... అప్పుడే లేచావు" అని నన్ను ఆపాలని చూశాడు లైపు.

"ఆట ఎప్పుడు ఆపాలో తెలీటమే పేకాటలో అసలు చాకచక్యం" అన్నాన్నేను.

"సరేగానీ, ఇప్పపూలకెళ్ళినవాడు ఏవయ్యాడు?" అని ఆత్రంకొద్దీ అడిగాడు లైపు.

నేను నవ్వి, ఆ కథని ఇలా ముగించాను.

"తన భర్త ఇప్పట్లో తిరిగిరాడని భావించి, అతని భార్య, వంటింట్లో దాచిన ప్రియుణ్ణి పడగ్గదిలోకి లాక్కుంది" అంతే! ఏదో ప్రమాదం ముంచుకురాబోతోందన్నట్టు ఖంగారుగా ఇంటికి పరిగెత్తాడు లైపు.

లైపుగాడి పొలాల్లో మోటారుకోసం కట్టిన చిన్న షెడ్లో రహస్యంగా కూచుని మేం ముగ్గురం అప్పుడప్పుడూ పేకాడుకుంటూ వుంటాం. ఆట ముగించాక నెమ్మదిగా ఇంటిదారి పట్టాను.

ఊరిపొలిమేరల్లోంచి ఊళ్ళోదాకా నడిచి ఇంటికెళ్ళేసరికి ఉన్న ఓపికంతా అయిపోతుంది. దాంతో కాసిని మంచినీళ్ళుతాగి ఆ పూటకు పస్తుపథ్యం చేసేందుకు ఒక గొప్ప అవకాశం కుదురుతుంది. అలా ఆ పూటకి ఓ పాతిక కలిసొచ్చినట్టే కదా!

ఇవ్వాళ అయాచితంగా గెలుచుకున్న ఐదొందలు ఉన్నాయిగా! హోటలుకెళ్ళి ఫుల్‌మీల్సు లాగించేయాలనుకున్నా! కానీ, ఆ ఫుల్‌మీల్సుని రేపు మధ్యాహ్నం తింటే తిండికి న్యాయం చేయొచ్చు కదా... అని ఆగిపోయాను.

జేబులు వెదికితే ఐదురూపాయల నాణాలు రెండు దొరికాయి. పై సెంటర్లో ఐదురూపాయలకే ఉల్లిఅట్టు ఇస్తాడు. పెద్ద అట్టే వేస్తాడు.

అటువైపు నడక సాగించాను. అట్లబండీదాకా వెళ్ళి, నాణాలకోసం లాల్చీ జేబులో చెయ్యిపెట్టాను. నాణాలు ఉన్నాయి.

కానీ, అయిదొందలనోటు చేతికి తగల్లేదు. అది మధ్యలో ఎక్కడో జారిపోయింది. కాళ్ళూ చేతులూ ఆడలేదు నాకు. చేతికంది, నోటికందకుండా పోయిందనిపించి మనసు వలవలా ఏడ్చేసింది. ఆకలికూడా చచ్చిపోయింది.

ఇందాక నాణాలకోసం వెదుక్కున్నచోటే పడిపోయుంటుంది.

జనసంచారం లేదు కాబట్టి, దొరుకుతుందని ఆశ వెనకటికి నాలాంటి ఒక దాసరికి ఇలా వెళ్తుంటేనే 'మరుల తీగ' కాలికి తగిలిందట. దారితప్పి వెళ్ళి, ఒక బ్రహ్మరాక్షసుడి నోట్లో పడ్డాడట.

ఈ సమయంలో ఈ కథ గుర్తుకొచ్చిందేవిటో... మనసు ఐదొందలనోటు గురించి మాత్రమే కాదు... మరులతీగ తగుటల్తుందేమోనని కూడా వెదకసాగింది.

-- XXX --

# 4. సుందరం

"లలనామణిరో ఈ భావము తెలుపవే లలితముగానిపుడు" అంటూ కమ్మగా గీతాలాపన చేస్తోంది కుంతల. తనకు అంత సంగీతం వచ్చినా, సాధారణంగా పాడేది కాదు. ఇవ్వాళ ఇంత హుషారుగా ఉందెందుకో మరి...?

వ్యక్తిగత విషయాలు ఒకరికొకళ్ళం అడగరాదని మామధ్య ఒప్పందం. అందుకని అడగటానికి సంకోచించాను. ఇంతలో నేను వచ్చిన సంగతి గమనించింది కుంతల.

"భలే సమయానికి వచ్చావు... రా! ఓ గమ్మత్తైన క్షేత్రయ్య పదం పాడతాను. మాజీ జర్నలిస్టువుకదా... దీని గురించి పరిశోధన చేయాల్సిన విషయం చాలా ఉంది" అంటూ ఆ పాట పాడటం మొదలెట్టింది.

లలనామణిరో ఈ భావము తెలుపవే లలితముగానిపుడు... వెలదిరో మా మువ్వగోపాలుని దయచేత వేడుకగా దెలుపవే ఓ బాల" నాకు వెంటనే అర్థం అయిపోయింది. "మీ క్షేత్రయ్య గారు పొడుపుకథల మీద కూడా పాటలు రాశాడా?" అనడిగాను.

"క్షేత్రయ్యే ఒక రహస్యం. వేమనపద్యాల్లో బంగారం తయారుచేసే యోగం ఉన్నట్టు, "కాళ్ళాగజ్జీ కంకాళమ్మా..." పాటలో ఒక చర్మవ్యాధికి ఫార్ములా ఉన్నట్టు అతిలోకరహస్యం ఏదైనా ఇందులో ఉందేమో...!

"అర్థంలేని చదువు వ్యర్థం కదా..." అనడిగాను.

"భలేవాడివి! కొన్ని అర్థం కాకుండా ఉంటేనే చదువు అబ్బుతుంది..." అంటూ మళ్ళీ గల గలా నవ్వింది.

"సరే! ఇప్పుడా సంగతులు ఎందుకులే... వంటింట్లోకి వెళ్ళి వంటసంగతులు చూద్దాం పదా!" అంది. "టాపిక్ మార్చకు. భోజనానికేం తొందర, హోటలుకి పోదాం. పాట పూర్తిచెయ్యి... నువ్వు పాడుతూంటే వినాలి" అన్నాను.

ప : లలనామణిరో ఈ భావము తెలుపవే లలితముగా నిపుడు

అ.ప. వెలదిరో మా మువ్వ గోపాలుని దయచేత వేడుకగా దెలుపవే ఓ బాల

చ : అలివేణి నీ దేశమేమంటేను అపుడు చెట్టు చూపెను

చెలి నీ యూరి పేరేమని యడిగితే చెట్లు రెండు చూపెను

చిలుకల కొలికి నీ చెలుల పేరేమంటేను చెట్లు రెండు చూపెను

పలుమారు నీ జాతిపేరేమని యడిగితే వదరి చెట్టే చూపెనే ఓ బాల ॥లలనా॥

చ : నక్షత్ర నఖ నీకు హితమేమని అడిగితే పక్షిహితవని అనెను

లక్షణపతి నీదు చెక్కటనేమంటే పక్షియున్నదనెను

వక్షస్థలాన ఉన్నది యేమంటే పక్షి యున్నదనెను

సూక్ష్మముగ నీ పేరేమని యడిగితే పక్షి పేరే చెప్పెనే ఓ బాల .... ॥లలనా॥

చ : వారిజానన నీకు యెన్నేండ్లాయెనంటే ఊరిపేరే చూపెను

చేరి నీ తోడబుట్టువు లెవరంటే ఊరి పేరే చెప్పెను

తీరుగా మెరసెడు మేలుంగర మేమంటే ఊరి పేరే చూపెను

ఓ రమణి నీ మోముందున్నది యేమంటే ఊరిపేరే చెప్పెనే ఓ బాల..." ॥లలనా॥

ఆ పాట విన్నాక ఒక్కక్షణం మతిపోయింది నాకు. పెన్నూ కాయితం తెచ్చుకొని రాసుకుంటానన్నాను. తను పాడ్తుంటే షార్టుహ్యాండులో రాసుకున్నాను.

ఉద్యోగంలోకి రాకమునుపు కొన్నాళ్ళు ప్రెస్సు రిపోర్టరుగా పనిచేసిన అనుభవం ఉంది కాబట్టి, చకచకా రాయగలిగాను. పదేపదే చదివాను.

ఒక జానపదసినిమాలో కాంతారావు గారు చెప్పిన డైలాగు గుర్తుకొచ్చింది "పేరేమంటే సున్నా చుట్టి మధ్యలో చుక్క పెట్టింది. అంటే పద్మావతన్నమాట..." అని!

సరిగ్గా ఇవే మాటలు అన్నాడో లేదో గానీ, ఈ పొడుపు కథ కూడా అలాంటిదే అనిపించింది. ఎంత ప్రయత్నించినా బుర్ర ముందుకు పోలేదు. దాన్ని విప్పటం నా వల్లకాలేదు.

"సరే! కాసేపు అలానే బుర్ర చించు. ఏవన్నా తడుతుందేమో... ఈలోగా మంచి కాఫీ పట్టుకొస్తా! మహామేధావులే దీనికి సరైన బాష్యం రాయలేదు" అంటూ వంటింట్లోకి వెళ్ళింది.

ఆ పాటలో దాగిన రహస్యం వెదికే పనిలోపడ్డాను. అంతలో వంటింట్లోంచి పెద్దగా అరుపు వినిపించింది. నేను ఖంగారుగా లేచేసరికి, 'యురేకా' అంటూ బయటకొచ్చింది కుంతల.

"హమ్మయ్య! ఏం కాలేదుగా! ఖంగారుపడ్డాను" కుంతలకు ఎదురెళ్ళి చేతిలో కాఫీకప్పు అందుకున్నాను.

"నాకేమైనా అయితే, నీకు అంత బాధగా ఉంటుందా...?" అంది గోముగా! నాకు ఏం సమాధానం చెప్పాలో తెలీలేదు. "నీకేమైనా అయితే నేను తట్టుకోగలనా?" అన్నాను.

"మా మువ్వగోపాలుడి దయవలన ఏమీ కాదులే, నాకే కాదు, మా క్షేత్రయ్యకు కూడా జన్మభూమంటే అంత ప్రేమ! మాది దివిసీమ. నాట్యశాస్త్రకర్త జాయపసేనాని పుట్టిన గడ్డ" అంది గర్వంగా!

"ఇంతకీ నీ యురేకా ఏవిటీ? ఈ పాటలో రహస్యమా! అయితే త్వరగా చెప్పు" అన్నాను, ఆమెని పాటలోకి లాక్కొస్తూ.

"అబ్బా! అంత తేలిగ్గా చెప్తానా? 'నేను చెప్పేశాక అదే చెప్పాలనుకున్నాను' అంటానికా?" అంది, బుంగమూతి పెట్టి.

"నిజంగా చెప్తున్నాను. నా బుర్రకు ఏమీ తట్టలేదు" అని ఒప్పేసుకున్నాను.

అప్పుడు క్షేత్రయ్య గురించి చెప్తుంటే ధీరగంభీరంగా కనిపించింది కుంతల.

"ఇన్నాళ్ళూ మా మువ్వగోపాలుని నాయిక ఒక మామూలు డ్యాన్సింగ్ గార్ల్ అని అపోహపడ్డాను.

ఇప్పుడు అర్థం అవుతోంది. ఆమె రతిమతి కాదు, ప్రకృతికాంత....

తన దేశం చెట్టు, తన ఊరు చెట్టు, తన ఊపిరి చెట్టు, తన మనుషులు చెట్టు, అసలు తన జాతే చెట్టు అని గర్వంగా చెప్పుకుంటోంది ఆ మువ్వగోపాలుడి నాయిక...

తన ఇష్టం, తన కష్టం, తన మనసు అన్నీ ఆ పక్షిలాంటివంటోంది.

తన ఊరు తనలా యవ్వనంతో కళకళలాడుతుందనీ, తన ఊళ్ళో అంతా అక్కచెల్లెళ్ళలా కలిసిమెలిసి వుంటారని, తన ఊరు తన మోమంత అందమైందనీ, మెరిసే మేలుంగరం లాంటిదనీ చెప్పుకుంటోంది. ఇది గొప్ప పర్యావరణ కవిత... " అంది.

"క్షేత్రయ్యని సరిగా అర్థం చేసుకోలేక చాలామంది అవాకులు రాశారనుకుంటాను" అన్నాను ఆమెకు వంతపాడుతూ.

ఈ పదకవితని కుంతల పర్యావరణకోణంలోంచి చూడటం అద్భుతమే అనిపించింది.

తన ఊరులో మనుషులు, చెట్టూచేమలు పశుపక్ష్యాదులన్నింటినీ మేలిమి బంగారం అనగలిగిన దేశభక్తి క్షేత్రయ్యది. మనసులోనే ఆ క్షేత్రయ్య మహాకవికి నమస్కరించుకున్నాను.

"నిజమే సుమీ! నువ్వు చెప్పేవరకూ ఈ ఆలోచనే నాకు తట్టలేదు..." అంటూ ఓటమి నంగీకరించాను.

నువ్వు గెలిచినందుకు పార్టీ ఇవ్వాల్సిందే! ఓడిన నేనే ఆ పార్టీ ఇస్తాను..." అన్నాను చప్పట్లు కొడుతూ. కుంతల నాలో ఏ మంచితనం చూసిందో తెలీదు. బహుశా ఆమెతో అశ్లీలంగానూ, అసభ్యంగానూ ప్రవర్తించకపోవటమే కావచ్చు.

మంచితనం ఏమోగానీ, మేధావితనంలో మాత్రం ఆమెకన్నా నేను చాలా తక్కువ.

మా సహజీవనానికి ప్రేమ అనే ట్యాగ్ పెట్టుకోవటం ఆమెకు ఇష్టంలేదు. ప్రేమలు నిలకడలేనివని, అనుబంధాలు అశాశ్వతమైనవనీ ఆవిడ నమ్మకం.

"అమ్మానాన్నలు చేసే పెళ్ళిళ్ళలోనే విడాకుల కేసులు ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఇందుకు బాధ్యత ఎవరిది? పెళ్ళయి ఏడాది తిరక్కమునుపే ఒళ్ళో బిడ్డని, చేతుల్లో విడాకులు కాయితాన్ని పుచ్చుకొస్తున్న కూతుళ్ళెందరో ఉన్నారు. వాళ్ళు మగవాణ్ణి, వీళ్ళు ఆడదాన్నీ నిందిస్తారు. సమస్య ఎన్నటికీ తెగదు. తెగాక అతకదు" అంటుంది కుంతల.

హోటల్లో కూర్చున్నాం.

మా ఇద్దరి తొలికలయిక ఈ హోటల్లోనే జరిగిన సంగతి గుర్తుకు వచ్చింది. బొంబాయి మహానగరంలో కాస్త నీటుగా ఉండేదిక్కడే! తెలుగువాళ్ళం తరచూ ఇక్కడ కలుస్తుంటాం. ఇదే హోటల్లో తింటూ వుండగా కుంతలను చాలాసార్లు చూశాను. కానీ, ఎప్పుడూ పరిచయం కాలేదు. ఆ రోజు తను పిజ్జా ఆర్డరు చేసింది.

వెయిటర్ లోపలికెళ్ళి చూసొచ్చి ఆ ఐటం లేదన్నాడు.

"చివరి ఆర్డరు ఆ కష్టమర్‌ది మేడమ్" అంటూ నన్ను చూపించాడు.

"అయితే సరే" అంటూ లేచి వెళ్ళిపోవటానికి సిద్ధపడిందావిడ!

నా ఎదురు టేబుల్ మీదే జరుగుతున్నదంతా నేను గమనిస్తూనే వున్నాను.

కాంప్రమైజ్ కాని, ఆ వ్యక్తిత్వం నాకు ముచ్చటేసింది. నేను వెంటనే అతన్ని పిలిచి, 'పిజ్జాని వారికే ఇవ్వు! నేను ఇంకో ఐటమ్ అర్డరు చేస్తాను!' అన్నాను.

ఆవిడ నా వంకొకసారి చూసి ముఖం పక్కకు తిప్పుకుంది. "ఓకె. మేడమ్! మీకు ఐదు నిమిషాల్లో 'పిజ్జా టూ స్లైసెస్ విత్ చీజ్' తెచ్చిస్తాను. సారీ ఫర్ ది ఇన్కన్వీయన్స్" అన్నాడు. ఆవిడేమీ సమాధానం చెప్పకుండా కూర్చుండిపోయింది.

ఆ సంగతి సరదాగా కుంతలకు గుర్తుచేశాను. ఇన్నాళ్ళ తర్వాత మళ్ళీ ఇదే హోటలు కొచ్చామన్నమాట. అప్పటి స్టాఫంతా మారిపోయారు. అప్పుడు నేను పనిచేసిన కంపెనీ ఈ దగ్గర్లోనే ఉండేది. ఇక్కడే తినేసి రూముకెళ్ళేదాన్ని" అంది.

"ఆ రోజు చేతికి గ్లౌవ్స్ అలానే ఉంచుకొని షేక్ హ్యాండిచ్చావు గుర్తుందా...?"

"మరి, దారిన పోయేవాడిక్కూడా గ్లౌవ్స్ తీసి షేక్‌హ్యాండిస్తారా ఎవరైనా?"

"దారినపోయేవాణ్ణేగా ఇంట్లోకి రానిచ్చావు?"

"దారికొచ్చావన్నాకే రానిచ్చాను".... ఇలా సాగింది సరదాగా మా సంభాషణ.

ఆ తొలిరోజు కలయికకు గుర్తుగా నేను మళ్ళీ పిజ్జాయే తిందామని ప్రపోజ్‌చేశాను. ఆవిడ సరేనంది. కుంతల చిత్రమైన మనిషి. నేను చెప్పేదాన్ని కాదనదు. కానీ, కాదనేందుకు ఒక ఆప్షను మాత్రం అట్టేపెట్టుకుంటుంది.

ఆవిడకు చెప్పకుండా ఏదైనా నిర్ణయం తీసుకుంటే మాత్రం సహించేది కాదు. ఒకసారి మా ఫ్రెండ్ ఒకాయన బర్త్‌డే పార్టీ అంటూ మా ఇద్దరినీ ఇంటికి రమ్మని బలవంతం చేశాడు. నేను మొహమాటానికి సరే అన్నాను. ఆ సంగతి చెప్తే కుంతల కయ్యిమంది. తన తరపున ఓకె చెప్పానని నిలేసింది. నేను రాగలనో, లేదో నాకేమైనా ఇబ్బందులున్నాయేమో తెలుసుకోనవసరం లేదా అంది. బహుశా ఆ రోజు నేనొక సహజీవిగా కాక, భర్తలా ప్రవర్తించానేమో!

ఎప్పుడో యాభై ఏళ్ళ క్రితమే 'సహజీవనం' మీద మిస్సమ్మ అనే సినిమాని గొప్పగా తీశారు విజయావాళ్ళు. ఆ సినిమాలో యన్.టి.ఆర్‌లాంటివాణ్ణి నేను. అప్పటికప్పుడు ఆ గండం గడిస్తే చాలనుకుంటాను. అందులో కనిపించే సావిత్రికన్నా కుంతల చాలా ఎక్కువ! ఆ పాత్రని భానుమతి చేసివుంటే కుంతలకు సరిగ్గా సరిపోతుంది! సావిత్రి కాబట్టి, ఆకురాయిలా సున్నితంగా రామారావుని కట్ చేసింది. భానుమతి అయితే కుంతలలాగా రంపంతో కోసిపారేసేది.

సహజీవనం కుదిరి ఇద్దరం ఒకే ఇంట్లో చేరినా మా ఇద్దరి పడగ్గదులూ వేర్వేరే. నా గదిలోకి తనో, తన గదిలోకి నేనో రావటం జరగలేదు. నేనుకూడా గదుల హద్దులు చెరిపేయాలని ఉత్సాహం చూపించలేదు. ఒకసారి తనే ఆ ప్రస్తావన తెచ్చింది. "మనిద్దరిమధ్యా లైంగిక సంబంధం ఉండాలనుకుంటున్నావా?"

"ముందు నీ అభిప్రాయం చెప్పు.... జీవితాన్ని ఇలా వృథా చేసుకోవాలనుకుంటున్నావా?" అని నేను ఎదురడిగాను.

"మనిద్దరం ఇలా జీవితాన్ని వేస్ట్ చేసుకుంటున్నాం అని నీ అభిప్రాయం అన్నమాట!" అని నవ్వింది కుంతల. వేలికేస్తే మెడకేయటం, తన అభిప్రాయం చెప్పకుండా తప్పుకోవటం కుంతల ప్రత్యేకతలు. నాకు ఆవిడముందు ఆగగలగటం కష్టమే! కానీ, కుంతలంటే అమితమైన ఆరాధనాభావం ఆమెతో నన్ను కట్టిపడేస్తోంది.

"సాధారణంగా లోకంలో భర్తలు 'ఆవిడ అహంకారి, తనమాటే చెల్లాలంటుంది, మనమాట వినదు, తను అనుకున్నదే చేస్తుంది అంటుంటారు. ఇలాంటి భర్తలు సహజీవనానికే కాదు, సంసారానిక్కూడా పనికిరారు" అనేది కుంతల.

అందుకే ఆవిడముందు నేను మగాణ్ణనే సంగతే మరిచిపోతుంటాను.

అలా ఉంటేనే సహజీవనం సమజీవనం అవుతుంది. లేకపోతే మనసులోకి నరకం ప్రవేశించి, కెరీరుని దెబ్బతీస్తుంది. కుంతలకు మగద్వేషంలేదు. అలాగని ఆమెలో కాముకత్వమూ కనిపించదు. పెళ్ళొద్దంటుంది. సెక్స్ ఊసెత్తదు. కలిసుందామంటుంది. కలిసి ఉంటానికి మగాడే కావాలా?

"ఆడతోడు లేకుండా సన్యాసిలా జీవించటంలో గొప్పతనం ఏముంది? సన్యాసం పిరికి వాళ్ళు మాత్రమే చేయగలిగేది. ఒక రైతు ఏనాడైనా సన్యాసం తీసుకోగా చూశామా? కష్టాలకు అలవాటుపడ్డ రైతుకి, వాటిని తట్టుకోగలిగే మనోధైర్యం కూడా ఉంటుంది. ఒక కష్టజీవి, ఒక సంస్కారి, ఒక యోధుడూ ఎప్పటికీ ఆ సన్యాసిపనిచేయడు" అంది ఒకసారి కోపంగా!

కుంతలంటే నాకు ఆరాధనాభావం అందుకే! నాలో ఉండే పురుషుడు కుంతలతో ఇబ్బంది పడినా, ఆమెలో ఉన్న సహజీవి నన్ను సమాధానపరుస్తుంటాడు.

అందుకే, కల్మషం లేకుండా బతికేస్తున్నాం. మా మధ్య లైంగిక సంబంధం ప్రవేశిస్తే మళ్ళీ భార్యాభర్తలబంధం కూడా ప్రవేశిస్తుందేమో! తనెప్పుడూ కవ్వింతగా మాట్లాడలేదు. తన లిమిట్స్‌లో తనుంటుంది. ఆమెకు లేని తొందర నాకుమాత్రం దేనికీ?

తొందరపడినందువలనే గతంలో నా బతుకు చిత్రం మీద చాలా మరకలుపడ్డాయి... అవి గుర్తుకొచ్చినప్పుడల్లా ఏడుపొస్తుంది. ఎన్నోసార్లు నా గదిలో తలుపేసుకొని ఏడ్చిన సందర్భాలు వున్నాయి. ఆలోచిస్తుంటే. అకస్మాత్తుగా నాకు భద్రకాళి గుర్తుకొచ్చింది.

భద్రకాళి నాకు ధర్మపత్ని. పెళ్ళిచూపుల్లో భద్రకాళీ నన్ను సరిగా చూసిందో లేదో తెలీదు. పెళ్ళికూతుర్ని చూడటాన్ని ఒక తూతూమంత్రం తంతులాగా జరిపించాడు మా మామగారు అలా ఎందుకు చేశాడో నాకు ఇప్పటికీ అర్థం కాదు.

పెళ్ళి గుళ్ళో జరగాలని మా నాన్న కోరాడు. అదికూడా మూడంటే మూడు నిమిషాల ముచ్చటలా జరిగిపోయింది. కార్యం రోజు ఉన్నట్టుండి నా భార్య భద్రకాళి అదృశ్యం అయిపోయింది. ఈ మొత్తంలో ఏదీ నా ప్రమేయంతో జరిగింది కాదు. అందరూ ఎవరిమానాన వాళ్ళు బతికేస్తున్నారు. భద్రకాళి కూడా ఎక్కడో ఒకచోట తనకు నచ్చినట్టు బతుకుతూనే ఉంటుంది.

మధ్యలో నేను... ఎవరికీ పనికిరాను! భద్రకాళి సంగతి నేను కుంతలకు చెప్పలేదు. చెప్తే లేచిపోయినదాని మొగుడినని ఆట పట్టిస్తుందేమో...

భద్రకాళి, ఎందుకలా చేసింది? కాముకత్వంతో చేసిందని నాకు అనిపించటంలేదు.

పనిమంతురాలు, బుద్ధిమంతురాలు, తెలివి తేటలు కలిగిందని నమ్మకం కుదిరాకే గదా పెళ్ళికి నేను ఒప్పుకున్నాను! ఆమె ఎవరినో ప్రేమించి వాడితో లేచిపోయిందని అందరూ అనుకున్నారు. నాకైతే నమ్మబుద్ధికాలేదు. జరగకూడనిది జరిగిపోవటానికి నా నమ్మకాలతో పనేం ఉంది...? నేను భద్రకాళిని నమ్మినట్టు, భద్రకాళికి నా మీద నమ్మకం కుదిరే అవకాశాన్ని ఆమె తల్లిదండ్రులు ఆమెకు ఇవ్వలేదేమో!

భద్రకాళి తల్లిదండ్రులు మా పెళ్ళిని మిస్ హ్యాండిల్ చేశారనుకుంటాను.

ఒక గిల్టీకాన్షస్ నన్నెప్పుడూ పీడిస్తూవుంటుంది... నేను కూడా మనసు విప్పి ఆమెతో మాట్లాడేందుకు ప్రయత్నించలేదు. కదా... అని!

మగవాడు తప్పనిసరిగా తన పెళ్ళికూతురితో మాట్లాడి తాను అన్నివిధాలా ఆమెకు అండగా ఉంటాననే నమ్మకం కలిగించాలి. పెళ్ళి జరిగేప్పుడు నాతి చరామి అని మూడుసార్లు అనిపించినంతమాత్రాన పెళ్ళికూతురికి నమ్మకం వచ్చేస్తుందా?

నమ్మకం లేకుండా అపనమ్మకంతో కాపురానికి వస్తే, ఆమె ప్రతి ఆలోచననీ ఈ అభద్రతా భావం చుట్టుకొని వుంటుంది! కాబోయే దంపతులకు మనసు విప్పి ముందే ఓపెన్‌గా తమ భవిష్యత్తు గురించి, తమ అలవాట్ల గురించి చర్చించుకోవాలి! ఒకరికి తగ్గట్టుగా మరొకరు తమను మలచుకునేందుకు సిద్దపడాలి. స్వేచ్ఛగా చర్చించుకుని నమ్మకం కుదిరాకే పెళ్ళికి ఓకె చెప్పటం ఒక విధానం కావాలి. అన్ని విధాలా ఇద్దరికీ నచ్చిన తరువాతే తల్లిదండ్రులు తాంబూలాలు పుచ్చుకొని ముహూర్తాలు పెట్టుకోవాలి.

ఇక్కడిదాకా వచ్చాక ఇప్పుడా ఆ మాట చెప్పేది, నా పరువేం కావాలి...? లాంటిమాటల్తో పిల్లల్ని అణచిపెట్టకూడదు. తల్లిదండ్రులే మొదట మారాలి. నా విషయంలో ఇవేవీ జరగలేదు. అంత విశాలమైన ఆలోచన ఆ రోజుల్లో నాక్కూడా లేదు.

కెరీర్ బిగినింగ్‌లో ఉన్న రోజులవి. ధ్యాసంతా ఉద్యోగం మీదే ఉండేది! రాత్రనకా పగలనకా కష్టపడి పనిచేసేవాణ్ణి!

మా ఉద్యోగాల్లో రేటింగ్ ఉంటుంది. కెరీర్ పెరగాలంటే స్కోరింగ్ పెరగాలి. ఆ ఒత్తిడిలో ఉండిపోయి భద్రకాళికి నా మీద నమ్మకం కలిగించే ప్రయత్నం చేయలేకపోయాను. ఇంత చిన్న పనిని చేయవలసిన సమయాన చేయకపోవటం నా తప్పు, నా మనసులో భద్రకాళి స్థానం ఖాళీకాలేదు. కాబట్టే, కుంతలతో కలిసి ఒకే ఇంట్లో ఉంటున్నా వేరే గదిలో జీవిస్తున్నాను.

కుంతలతో సహజీవనానికి నా కారణాలు నాకున్నాయి. కానీ, కుంతల కారణాలేవిటో నాకు తెలీదు. మళ్ళీ పెళ్ళి చేసుకోమంటూ మా అమ్మ నన్ను ఒత్తిడి చేసింది.

"భద్రకాళి సంగతి తేలకుండా ఇంకో పెళ్ళి ఎలా చేసుకుంటానమ్మా?" అన్నాను.

"పెళ్ళై అప్పుడే ఐదేళ్ళైంది. ఆ లేచిపోయిందానికోసం ఇంకా ఎంతకాలం ఎదురుచూస్తావురా...? అయినా పోయింది వస్తానంటే తెచ్చుకుంటావా... ఏంటి?" అని నన్ను నిలేసింది అమ్మ! అవసరం అయితే తప్పదేమో... అన్నాను.

అమ్మకు సహజంగా అది నచ్చలేదు. దాంతో ఆలిగి, కాశీకి వెళ్ళిపోయింది. విజయవాడలో వంటరిగా ఉండటంకన్నా ఈ వయసులో ఆవిడ కాశీలో ఉండటమే ఉత్తమం అనుకున్నాను. తెచ్చి, నా దగ్గరా పెట్టుకోలేను. నేనే వచ్చి ఈవిడదగ్గర ఉండలేను.

ఒకసారి విజయవాడ వెళ్ళి ఇల్లెలా ఉందో చూసిరావాలనిపించింది!

అయినను పోయిరావలయు పుట్టినింటికి!

-- XXX --

# 5. కామేశం

ఐదొందలనోటు దొరక్కపోతే నిజంగా నేను చాలా నష్టపోతాను.

చాలా రోజులు కూడబెట్టుకున్న డబ్బు ఈ రోజు పణంగా పెట్టి ఆడాను. పోయింది పోగా, ఐదొందలు వచ్చాయి. నా బతుక్కి అది జాక్‌పాట్ కొట్టినట్టే!

చేతికందింది నోటికందే లోగానే చేజారిపోయింది. నోటుకోసం నేలమీదే చూపులు పెట్టి వెదుక్కుంటున్నాను. అంతలో– "భలే వచ్చావే..." అంటూ పలకరించిందో మెరుపు తీగ!

ఆమె కమ్మగా నవ్వింది. నాకు ఒక్కసారి గుండె ఝల్లుమంది.

"ఏంటి వెదుకుతున్నావు?"

"డబ్బులు పోయాయి... ఐదొందలనోటు... పదిరోజుల గ్రాసం"

ఆవిడ ఐదొందల నోటుచూపించి "ఇదేనా?" అంది.

"అవును ఇదే!" అన్నాను ఆత్రంగా! కానీ, ఆమె కళ్ళలోకి సూటిగా చూడలేకపోయాను.

"నీదని దీనిమీద రాసి లేదే?"

"కరెన్సీ మీద ఎవరైనా పేర్లు రాసుకుంటారా?"

"ఖచ్చితంగా నీదైతే రాసుకోవాలి మరి!

"ఈ సారి దైవవశాత్తూ మళ్ళీ ఇంత పెద్ద నోటు వస్తే తప్పకుండా రాసుకుంటా"

"అయితే ఈ నోటు నీదేనని దీనిమీద రాసి సంతకం పెట్టు" అని ఆమె నన్ను ఆదేశించింది. ఎందుకూ, ఏమిటీ అని అడక్కుండా నోటు పైన తెల్లగా ఉండే భాగంలో గాంధీగారి వాటర్‌మార్క్ సాక్షిగా అలానే రాసి సంతకం పెట్టాను.

అప్పుడావిడ ఆ నోటు చేత్తో పుచ్చుకుని, అసలు రహస్యం చెప్పింది.

"ఈ నోటు నాకే దొరికింది. ఆ కూల్ డ్రింక్ షాపుకి వెళ్ళి డ్రింకు తాగి దీన్నిచ్చాను. "ఇది దొంగనోటు చెల్లదు" అన్నారు.

దీనికోసం వెదుక్కుంటూ వస్తావుకదా అని నీ కోసం ఎదురుచూస్తున్నాను.... అంది.

నా తక్షణ కర్తవ్యం ఏమిటో నాకు బోధపడింది.

నా జేబులో ఉన్న రెండు ఐదు రూపాయల నాణాల్లో ఒకదాన్ని కూల్ డ్రింక్ షాపులో కట్టి ఆమెకు ఋణవిముక్తి కలిగించాను. ఇంక నా ఆస్తి అయిదురూపాయిలే!

"ముందిక్కడి నుండి బైటపడాలి, పద... పోదాం" అంటూ నా చెయ్యి పట్టుకుని ముందుకు లాక్కుపోవడం మొదలుపెట్టిందామె!

బడికి వెళ్ళనని మొరాయించే పిల్లాణ్ణి పిర్రమీద ఒకటి తగిలించి లాక్కుపోయినట్టు నన్ను లాక్కుపోతోందావిడ! నేనుయాంత్రికంగా ఆవిడ ఆదేశాలు పాటించక తప్పలేదు. ఇదేం మెస్మరిజమో నాకు తెలీదు.

నేను నేనేనా? నన్నేనా ఈవిడ శాసిస్తోంది? ఈ భూ నభోంతరాళాలలో నా అంత బ్రహ్మచారి లేదని అంతా చెప్పుకునే కామేశాన్ని ఒక అపరిచిత, శాసించి కొంగుపట్టుకు నడిపిస్తోంది. అదీ, నేను పుట్టి, పెరిగి, రోజూ తిరిగే ఈ విజయవాడ వీధుల్లో!

చెట్టుమీద, పక్షిగూట్లో పిల్లి దూరిందనుకుంటాను, పక్షులన్నీ హాహాకారాలు చేస్తూ ఒక్కసారి గాల్లోకెగిరి రెక్కలు అల్లారుస్తున్నాయి.

నా మనసు గూట్లోకి పిల్లికాదు... ఈ పిల్ల దూరింది... గుండెలు దడదడా కొట్టుకుంటున్నాయి.

భార్య లేని అమాయకుణ్ణి! పరువం వేడిమీద ఉంది. చుట్టూ తాగుబోతులూ, కామబోతులు, రంకులాడులున్నూ! అయినా శీలవంతుడిగానే ఉన్న ఈ కామేశాన్ని ఒక ఆడది, రాత్రిపదిగంటలవేళ ఇలా అగ్ని పరీక్ష పెడ్తోంది.

అర్జంటుగా రూముకెళ్ళి యూనివర్సిటీ ఇచ్చిన కాండక్ట్ సర్టిఫికెట్ తీసి చూపించి నన్ను నేను కాపాడుకోవాల్సివచ్చేలా ఉంది.

"భగవంతుడా! ఈ ఆగంతుక బారినుండి నన్నూ, నా శీలాన్నీ కాపాడు..."

ఆవిడ బడబడా నన్ను ఈడ్చుకుపోతూ వుండగా, దారిలో రైల్వేస్టేషనొచ్చింది. పదో నెంబరు ప్లాటుపారం మీద జనం తక్కువ, ఖాళీగా ఉన్న బెంచీ మీద తను కూలబడి, నన్ను తన పక్కన ఈడ్చి కూర్చోబెట్టింది. ఆవిడ ఎదుట పిల్లిలా అయిపోతున్నానేవిటో...? నా ప్రశ్నకి ఆమె సమాధానం చెప్పకుండా నావంక చూసి సన్నగా నవ్వి మళ్ళీ ముఖం అటు తిప్పుకుంది.

"ఏవండీ! అసలు మీరెవరూ, మీపేరేంటీ..." అని ఎంతో వినయం ఉట్టిపడేలా అడిగాను. "నా పేరు కామేశం" అన్నాను.

ఆవిడ వేవ్ లెంగ్త్ నన్ను డామినేట్ చేసేస్తోంది. కుక్కినపేనులా, చెప్పుకింద తేలులా క్షణక్షణానికీ మారిపోతున్నాను.

"మీ పేరేవిటీ?" అని మళ్ళీ అడిగాను. ఆ మాత్రం గట్టిగా అడగటానికి చాలా ధైర్యం చేయాల్సివచ్చింది.

"అదిప్పుడు అంత అవసరమా...?" అన్నదావిడ, ప్రశ్నకు ప్రశ్నని జవాబుగా చెప్పే జాణతనం ఆడవాళ్ళ సొత్తు.

ఇంక చేసేది లేక "దయచేసి నా చెయ్యి వదిలితే కాసేపు అరచేతిలోకి రక్తప్రసారం జరిగి తిమ్మిరి తగ్గుతుంది. కాస్త పట్టు సడలించినా చాలు" అని వేడుకున్నాను.

ఆమె చెయ్యి వదల్లేదు. పట్టుకూడా వదల్లేదు. ఇదెక్కడి పట్టండీబాబు, ఉడుంపట్టు!

ఆ సీను చూసిన ప్లాటుఫారం మీద జనం పెద్దగా అరచుకుంటూ పట్టాలమీదకు దూకి, వస్తున్నరైలుని ఆపి, "అదుగో, అక్కడ బెంచీమీద అతని చెయ్యి పట్టుకుని ఆమె కూర్చుంది. అతను పారిపోవాలని చూస్తున్నాడు. మేమంతా కాపు కాయాలి. అందుకని ఇంకాసేపు ఆపండి" అంటున్నారనిపిస్తోంది. లోకం స్త్రీపక్షపాతిగా మాట్లాడుతుంది కదా!

"పోనీ, మీరెక్కడికి వెళ్ళాలో చెప్పండి... అక్కడికి తీసుకెళ్ళి దిగబెడతాను" అన్నాను బతిమాలుతూ!

"వచ్చిన దారిన వెళ్ళటం తెలీదా నాకు?" అన్నదామె కోపంగా

"ఎక్కడినుండి వచ్చారో అదైనా చెప్పండి"

"ఎక్కడి నుండి అక్కడకు వచ్చానో కూడా చెప్పనా?"

ఇంకాసేపు ఏదైనా అడిగితే, "పునరపి జననం, పునరపి మరణం ... [illegible] వెళ్తుందనిపించింది, చేసేది లేక, "మీకో దణ్ణం, నన్నొదిలేయండి! నాలుగిళ్ళకెళ్ళి పిల్లలకు ట్యూషన్లు చెప్పుకొని బతికే బడుగు పంతుల్ని, ఒంటరిజీవిని" అన్నాను.

నేను ఒంటరిగా ఒక్కణ్ణే ఉంటానని ఆవిడకు చెప్పుకోవాలని నాకు అనిపించటం ఏవిటో... ఇది మాయే! నా ప్రతిమాటనీ ఆవిడ తూకానికి వేసి తూస్తోంది.

"ఆ వెళ్ళేది ట్యూషన్ల కోసమా... లేక ఆ ఇళ్ళలో అమ్మాయిల కోసమా?" అని ఎదురు ప్రశ్నించింది. "ఈవిడేమన్నా కర్ణపిశాచా? మనసులో విషయాలు తెలిసినట్టే చెప్తోంది...?"

"అవును! నీ మనసులో విషయాలన్నీ నాకు తెలుసు" అంది.

వల వేయటం, వలపించటం, వదిలించుకోవటాల్లో నైపుణ్యం గురించి చాలా లెక్చర్లిచ్చానన్న సంగతి నాకు గుర్తొచ్చింది. ఉపన్యాసాలిచ్చినంత తేలిక్కాదు గదా...ఆచరణ! తాడిని తన్నే వాడి తలను తన్నేది దొరికింది. కథ అడ్డంగా తిరిగింది!

"రాత్రి పన్నెండవుతోంది మేడమ్...."

"ఇంకో ఐదారు గంటల్లో తెల్లవారుతుంది కూడా!"

"ఆ మాటకు అర్థం ఏవిటీ... తెల్లవార్లూ ఇదే శవజాగారమా?"

"ఈ రాత్రికి కడుపు నిండేందుకు నీదగ్గర కాసుల్లేవు! తెల్లవారాక ఆకలి సంగతి చూసుకోవచ్చు. అందాకా రైల్వేస్టేషనే రక్షణ. నోరుమూసుకు కూర్చోవటమే నువ్వు చెయ్యగలిగింది"

గుండు ఠా ఠా అని కొట్టినట్టు రెండు చెంపలూవాయించి - 'ఎవణ్ననుకున్నావో... ఖబడ్దార్!' అనేసి నా దారిన పోకుండా ఈ 'సహజాగారం' ఎందుకు చేస్తున్నానో నాకు నేనే సమాధానం చెప్పుకోలేకపోతున్నాను.

"నా దగ్గర అయిదు రూపాయల బిళ్ళుంది" అన్నాను.

రాసిపెట్టి వుంటే నాలుక తగ్గట్టుగానే తిరుగుతుంది!

"మంచిది! ఆ టీ వాణ్ణి పిలిచి వన్ బై టూ టీ ఇవ్వమను" ఆదేశించిందామె.

టీ అందుకొని నా చేతిని వదిలేసింది.

అమ్మయ్య! లాకులెత్తి, కాలవలో నీళ్ళొదిలినంత వేగంగా అరచేతిలోకి రక్తప్రసారం అయ్యింది. ఎంత హాయిగా ఉందో ఆ అనుభూతి. ఒక ఆడపిల్ల నా చెయ్యి పట్టుకున్నప్పటికన్నా చెయ్యి వదిలినప్పుడు ఆనందం కలగటమే వింత!

నల్లగా కమిలిన మణికట్టు క్రమేణా మామూలు రంగులోకి రాసాగింది. చెయ్యి వదలగానే నేను పారిపోవాలనుకున్నా!

"నువ్వు పోలేవులే! సరిగా కూచొని టీ తాగు" అదిల్చిందావిడ.

ముళ్ళమీద కూచున్నట్టుంది నాకు. పారిపోయేంత ధైర్యం లేనివాణ్ణని తేలిపోయింది. హ్యాండ్ బ్యాగ్‌లోంచి ఓ పుస్తకం తీసి చదువుతూ కూచుంది. తొంగి చూశాను. అది విశ్వనాథ వారి ఏకవీర! ఆ పుస్తకం పైన సౌదామిని అని సంతకం కన్పించింది.

"మీ పేరు 'సౌదామిని?"

"ఏం ... బావుందా?"

"పేర్లలోకెల్లా పేరున్న పేరు మీది..." అన్నాను. చెప్పానుగా నాలుక కర్మానుసారం తిరుగుతుంది! సౌదామిని గలగలా నవ్వింది!

అప్పుడే వచ్చిన రైల్లోంచి ఎవరో ఒకామె దిగింది. జనం బాగా ఉన్నారు.

వచ్చినావిడ చకచకా అడుగులు వేస్తూ బయట గేటువైపు పోసాగింది.

సౌదామిని ఆత్రంగా ఆమెవైపు పరిగెత్తింది. కానీ అప్పటికే, ఆవిడ గేటు దాటి బయటికి వెళ్ళిపోయింది. సౌదామిని వెంటే నేనూ వెళ్ళాను.

తను వెదుకుతున్న వ్యక్తి ఆ చీకట్లో మాయమైపోయింది. వెదికీ వెదికీ విసిగిపోయింది సౌదామిని. నిరాశగామెట్లపైన కూర్చుండిపోయింది.

"ఎవరావిడ?"

"నా చిన్ననాటి స్నేహితురాలు, కాళి"

ఆవిడెవరో, ఈవిడెవరో, ఈ ఇద్దరి కథేవిటో నాకేమీ బోధపళ్ళేదు.

-- XXX --

# 6. సౌదామిని

మాయాజాలానికి కట్టుబడ్డవాడిలా ఈ కామేశం నాతో ఉండిపోయాడు.

నేనతన్ని పోనీయని మాట నిజం, పోవాలని అతనికీ లేకపోవటం కూడా నిజమే!

"ఈ రైల్వేస్టేషన్లో దోమలచేత కుట్టించుకుంటూ, ప్రయాణీకుల సంచులతోనూ, సూట్‌కేసులతోనూ తొక్కించుకుంటూ రైల్లో ఎంతమంది ఎక్కారో, ఎంతమంది దిగారో లెక్కించుకుంటూ ఈ జాగారం చాలాబావుందండీ!" అన్నాడు కామేశం.

"నీకు అంత బావుంటే, ఈ సణుగుడు దేనికీ? ఎంజాయ్ చెయ్యి" అన్నాను కటువుగా

"కొన్ని గంటపాటు మీరు నా చెయ్యి పట్టుకుంటే విడిపించుకోలేక గిలగిల్లాడిన బడుగు ప్రాణిని... నాకు ఎంజాయ్‌మెంటా?" అన్నాడు కామేశం నిర్వేదంగా!

"నా చిన్నప్పుడు ఓ తాతగారుండేవాడు. దగ్గరకు పిలిచి, ఆయనే నా చెయ్యి పట్టుకుని, చెయ్యి వదలవే... నొప్పి పుడుతోందే అని అరిచేవాడు. చుట్టు పక్కలవాళ్ళు అదే నిజం అనుకొని ఆ ముసలాణ్ణి అలా ఏడిపిస్తావు దేనికే? అని నన్నరిచేవాళ్ళు. అలా ఉంది నీ తంతు అన్నాడు.

"మరీ మరబొమ్మలా ఆడించకండీ. ఈపాటికి ఏ హోటల్ రూముకో తీసుకెళ్ళి ఎంజాయ్ చేస్తే, ఇలా మాట్లాడివుండేవారా?" కొంచెం స్వరం పెంచి మాట్లాడాడు కామేశం.

"అబ్బ ఛా! అంత ధైర్యమా? టాపిక్ ట్రాఫిక్ తప్పుతోందేం?" అన్నాను కోపంగా!

"అసలు మీరు నా గురించి ఏమనుకుంటున్నారు? పోకిరీలా కనిపిస్తున్నానా?"

"అంతనుకోలేదులే!"

"ఇంకాసేపు ఇలానే ఈ బెంచీనంటుకొని కూచుంటే, రైల్వే పోలీసాళ్ళు మాత్రం అనుకునేది ఖాయం" అన్నాడు. అతని మాటలకు నాకు నవ్వాగలేదు.

"నీతిగా ఉండాలనుకునేవాడే నీతిమంతుడా? ఎవరేమనుకుంటారో అని భయంతో బతికేవాడు నీతిమంతుడా?"

"తప్పుచేసే ధైర్యం లేనందువలన లోకం అంతా ఒప్పుగా జీవిస్తున్నారంటారా?"

"తప్పుచేసే అవకాశం వచ్చినప్పుడుగదా నీతిమంతుడి రంగు బయటపడేది..."

"మీతో వాదించటం కష్టం, మంచిగా ఉండటాన్ని చెడుచేసే ధైర్యం లేకపోవటం అంటే నేనేం మాట్లాడేది?"

"మాటలు కాదు, చేతలు కావాలి"

"అయితే చెప్తున్నాను వినండి! మా ఇంటికి పోదాం రాండి!... ఇల్లంటే ఇల్లూ కాదు, పొదరిల్లూ కాదు, ఒక్కరుమాత్రమే పట్టేంత చిన్నగది. అయినా ఎలాగొలా

సర్దుకుందాం. తెల్లారేసరికి మీరు కోరుకున్నచోటికి వెళ్ళిపోవచ్చు. ఇలా ఎక్కువసేపు ఇక్కడుండటం మంచిది కాదు..." అన్నాడు కామేశం.

"ఈ మాట చెప్పటానికే నీకు రాత్రి ఎనిమిదిగంటల నుండి ఒంటిగంటవరకూ ఐదు గంటల సమయం పట్టింది! ఇంక నువ్వేదో తప్పుచేసేటంత ధైర్యవంతుడివని నేను ఎలా అనుకుంటానూ...." అన్నాను అతన్ని రెచ్చగొడుతూ.

ఆ సమయంలో బుంగమూతిపెట్టుకుని, కామేశం చాలా అందంగా కనిపించాడు. నన్ననుసరించి నడుస్తూ 'కుడిపక్కకు తిరగండి, తిన్నగా పదండి' అంటూ నాకు డైరెక్షన్ ఇస్తున్నాడు.

"బ్యాక్ సీట్ డ్రైవింగా? ముందన్నా నడు, లేదా పక్కనైనా నడు, వెనకాల నక్కినక్కి నడుస్తావేంటీ" అని కసిరాను. ఉలిక్కిపడి వచ్చి, పక్కనే నడవసాగాడు.

ఇందాక రైలు దిగిన మనిషి నిస్సందేహంగా కాళీయేనని నాకు గట్టిగా అనిపించింది. దాని గురించే ఆలోచిస్తూ కామేశంతో కలిసి సాగిపోతున్నాను.

అగమ్యగోచరమైన నా భవిష్యత్తుకు ఈ కామేశం ఒక పట్టుకొమ్మ. అతని రూములాగానే అతని బ్రెయిన్ కూడా ఇరుకే! శుభ్రం చేయాల్సిన పని చాలా ఉంది.

గదిలోకి రాగానే కామేశం తడుముకుంటూ వెళ్ళి కిటికీ తెరిచాడు. స్ట్రీట్‌లైట్ వెల్తురు కిటికీలోంచి గదిలోకి పడింది.

"మీ ఇంటికి కరెంటు లేదా?" ఆశ్చర్యంగా అడిగాను.

"బిల్లు కడితే ఉంటుంది" అన్నాడు.

"పోనీ అద్దైనా కడ్తున్నావా?"

"అద్దె కట్టేట్టయితే అర్ధరాత్రి ఇలా రహస్యంగా రావటం దేనికీ? రాజాలాగానే వచ్చివుండే వాణ్ణి" అన్నాడు. ఇంటాయన అద్దె అడుగుతాడని అర్ధరాత్రి వచ్చి తెల్లారేసరికి పారిపోతున్నాడన్నమాట! నీతి గురించి ఎంత లెక్చరిచ్చాడూ...!

ఆ గదికి మంచం పట్టేటంత సీను లేదు. ఒకప్పుడు అది స్కూటరు పెట్టుకునే గదిట. తలమాసినవాడెవడైనా దొరక్కపోతాడా అని ఆ ఇంటి ఓనరుడు 'అద్దెకివ్వబడును' అని బోర్డు పెడితే ఈ కామేశం దొరికినట్టున్నాడు. నేలమీదే నాలుగు పాత లుంగీలు కలిపి కుట్టిన బొంత పరిచుంది. అదృష్టవశాత్తూ ఒక దుప్పటికూడా ఉంది.

"మీరు, ఆ బొంత మీద పడుకోండి. దుప్పటి పరుచుకుని ఈ పక్కగా నేను పడుకుంటాను" అన్నాడు కామేశం!

బిగ్గరగా మాట్లాడితే అందరికీ తెలిసిపోతుందని నెమ్మదిగా మాట్లాడుతున్నాడు!

"నిద్రలో గురకపెడ్తావా?" సందేహంగా అడిగాను.

"నాకు తెలీదు. ఈ గదిలో ఇంతవరకూ రెండోమనిషి ఎవరూ రాలేదు. అందుకని

నేను గురకపెట్టేదీ లేనిదీ ఎవరూ చెప్పలేదు. అలాగే, నిద్దట్లో పక్కవాళ్ళమీద కాళ్ళువేసే అలవాటు కూడా లేదు. నాతో కలిసి ఇంతవరకూ ఎవరూ పడుకోలేదు"

"నీ శీలనిరూపణ ఏడ్చినట్టుంది నిద్రలో నడిచే అలవాటుంటే బయట గొళ్ళెం పెట్టి వెళ్ళు. కుక్కలు దూరగలవు" విసుగ్గా అన్నాను.

ఆ తర్వాత కామేశం మాట్లాడలేదు. బహుశా నిద్రలోకి జారుకునుంటాడు. దోమల్ని బాదుకునే పనిలో నాకు నిద్రరాలేదు. దోమ కుట్టినా తెలియట్లేదు కామేశానికి.

గాలి చాలక చిరాకనిపించి లేచి కూచుని జుట్టు ముడేసుకున్నాను. కిటికీలోంచి వెల్తురు నా మీద కన్నా కామేశంపైన ఎక్కువ పడుతోంది.

అతను గోడవైపుకు తిరిగి పడుకున్నాడు. చీరకొంగుతో ముఖం అంతా కప్పుకొని గోడకానుకుని ఆవిష్కరించబడని శిలావిగ్రహంలా కూచున్నాను.

పాతపత్రికేదో చేతికి తగిలింది. తీసి విసురుకున్నాను. నా ఆలోచనలన్నీ కాళీ గురించే! కనిపించినట్టే కనిపించి మాయమయ్యింది.

నా అనుమానమే నిజమైతే అది విప్లవసంఘాల్లో చేరిపోయుండాలి. ఆ పని మీదే వచ్చుంటుంది. అందుకే అంత వేగంగా కదిలింది.

ఇంతకీ అసలు నా భవిష్యత్తేవిటీ...?

ఈ సత్రకాయని ఎందుకు తగిలించుకుంటున్నాను...? అనుకున్నపని పూర్తి కావాలి కదా...! అందాకా చేతిలో ఒక మనిషుండాలి.

బంగారుపళ్ళానికైనా గోడ చేర్పు కావాలి అనే ప్రకటన గుర్తొచ్చింది. ఆ గోడవైపుకే తిరిగి పడుకున్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు.

మెలకువ వచ్చేసరికి కామేశం రెడీగా కూచున్నాడు. గుడ్మార్నింగ్ చెప్పాను.

"ఎవ్వరూ లేవకముందే మీ స్నానాదికాలు పూర్తిచేసుకురండి. అందాకా నేను రోడ్డు మీద నిలబడి వుంటాను.

వచ్చేప్పుడు ఈ తాళం వేయండి...." అంటూ తాళం ఎదురుగా పెట్టి చకచకా వెళ్ళిపోయాడు. నేను తలుపులేసుకున్నాను.

ఆ పనికిరాని గదిలోనే ఓ మూల టాయిలెట్ కట్టి, తడిక తలుపు పెట్టి దాన్ని 'ఎటాచ్డ్ బాత్' అన్నాడట ఇంటాయన.

ఆ ఇంటి 'ఓవర్' కు తగ్గవాడే ఈ కామేశం కూడా!

ప్రొద్దున్నే లాయరుగారిని కలిశాకగానీ నా ప్రయాణం ఎటో తేలదు.

లాయరు సదాశివ రాసిన ఉత్తరం నా అదృష్టంకొద్దీ నా చేతుల్లోనే పడింది.

అది అదృష్టం అవునో కాదో కాలం చెప్తుంది.

-- XXX --

# 7. కాళీ

ఎందుకీ బెజవాడొచ్చానో.... ఎలా చెప్పాలో తెలీటంలేదు. ఇది నగరమూ కాదు, పల్లెకాదు, పెద్ద గ్రామం. ఇక్కడ బతికేందుకు అవకాశాలున్నాయిగానీ, బాగా బతకాలంటే కుదరదు. అడవి బతుకుకన్నా మెరుగేనా? నా పేరే 'కాననం కాళి', 'అడవి' ఇంటి పేరుని మా పూర్వీకులు కాననం అని సంస్కృతీకరించుకున్నారేమో తెలీదు. అడవి నా శాశ్వతచిరునామా! ఈపాటికి చత్తీస్‌గడ్ అడవిలో ఉండవలసినదాన్ని అక్కడ మా తుపాకీకి పనెక్కువ.

కానీ, నన్ను మా నాయకత్వం బెజవాడ పంపింది. సామాన్యగృహిణిగా మారిపోయి మధ్య తరగతి ఆడవాళ్ళలో చైతన్యం కలిగించే కార్యక్రమాల కోసం నన్ను ఎంపికచేసి, ఇక్కడకు పంపారు. ఉన్నట్టుండి జనంలో కలిసిపోయే ఈ మార్పు ఎలాంటి పరిణామాలకు దారితీస్తుందో నేనిప్పుడే చెప్పలేను. నాలో విప్లవచైతన్యం ఉన్నంతవరకూ నేను జనంలో ఉన్నా అడవిలో ఉన్నట్టే!

చిన్ననాటి నేస్తాలు 'సౌదా' మినీ, కుంతల గుర్తుకొచ్చారు. వాళ్ళిద్దరూ ఎక్కడున్నారో...?

ఎవరికీ చెప్పకుండా ఇల్లొదిలేసి వచ్చేశాను. అలా వెళ్ళిపోవటం తప్పే! తప్పుచేయక తప్పలేదు. చెప్పి వెళ్ళిపోయివున్నట్లైతే వాళ్ళు నా రహస్యాన్ని కాయలేరు కాబట్టి!

సౌదామిని నా ప్రాణస్నేహితురాలు. దాని ఆలోచనలూ, నా ఆలోచనలూ బాగా కలుస్తాయి. నావి విప్లవభావాలనీ, దానివి అభ్యుదయభావాలనీ అనేదాన్ని.

"ఈ రెంటికీ పెద్ద తేడాలేదు. సుఖాన్ని సాధించటానికి విప్లవమూ, సుఖాన్ని నిలబెట్టేందుకు అభ్యుదయమూ ఉపయోగపడాలి" అనేది కుంతల.

"సుఖం గురించిన ఆలోచన తప్ప నీకు ఇంకొకటి పట్టదా...? విప్లవం జనసామాన్యం కోసం. కుతి తీర్చుకోవటం కోసంకాదు" అని కుంతలను కేకలేసేదాన్ని.

"నీవన్నీ సెంట్రిస్టు భావాలు. నువ్వో బూర్జువా వ్యవస్థకు ప్రతినిధివి. భూస్వామ్యవ్యవస్థ అవశేషానివి అంటూ ఒకరోజు కుంతలను పట్టుకుని చడామడా కడిగేశాను. అది అలిగి, బుంగమూతి పెట్టుకుని అంది "ఎరుపు రంగు చూసి ఉదయించే సూర్యుడంటావు నువ్వు." ఆ 'సౌదా' మినైతే "కలకత్తా కాళిక నాలిక, జనజ్వాలిక" అని పాడుతుంది.

నాకైతే ఎరుపురంగు. రతీదేవి పాపట సింధూరంలా కనిపిస్తుంది అంది.

"నీకెప్పుడూ పెళ్ళిధ్యాసేనా?" అన్నాను కోపంగా!

"అజ్ఞానతిమిరాంధకారంలో పడి కొట్టుకుపోతున్నావే! నిన్ను బాగు చేయటం ఎవరివల్లా కాదే!" అని బాధపడేదాన్ని! బూజుపట్టిన బూర్జువా, భూస్వామ్యవ్యవస్థలకు

సంబంధించిన భావజాలాన్ని పట్టుకు వేలాడే మనస్తత్వంలోంచి బయటకు లాగి, లోకం వైపు కుంతలను మళ్ళించాలని అనుకునేదాన్ని. ఇలాంటి విషయాల్లో సౌదామిని నాకు మద్దతుగా ఉండేది. అందుకే, అదంటే నాకు ప్రాణం.

“నే చెప్తున్నానుకదా! చివరికి మీ ఇద్దరూ నేనే మెరుగంటారు.... చూస్తుండండి” అనేది కుంతల.

రైలు దిగినప్పుడు ఆ చీకట్లో ఎవరో ఒకావిడ నావైపే ఆత్రంగా రావటం గమనించాను. కొంచెం ఆగి చూస్తే బావుండేది! ఆ సమయంలో అక్కడికి నన్ను వెదుకుతూ వచ్చేది శత్రువే గానీ మిత్రులని ఎలా భావిస్తాను...? అందుకే, వేగంగా వచ్చేసి, ఈ దుర్గగుడిదగ్గర సత్రంలో దిగాను.

నా కదలికల మీద డేగకన్ను కొనసాగుతూనే వుండొచ్చుకదా...అని!

విజయవాడకి రావటం నాకు డ్యూటీ, వ్యక్తిగతంగా ఇంతకన్నా సురక్షితమైన ఊరు ఇంకొకటి లేదు కూడా!

వ్యక్తిగతవిషయాలైనా చెప్పవలసిన సమయం వచ్చినప్పుడు చెప్పదగినవి తప్పక చెప్పాలి. ఒకరోజు “బెజవాడ కనకదుర్గమ్మ గుడికి వెళ్ళొద్దామండీ” మా నాన్నను అనడిగింది అమ్మ!

సాధారణంగా మా అమ్మ ఏదైనా అడిగితే మా నాన్న కాదనటం రివాజు, కానీ ఆ రోజున అమ్మ అడగంగానే నాన్న సరే అనేసినప్పుడు ఇందులో తిరకాసుందేమోనని నేను ఆలోచించలేదు.

“అమ్మాయీ! కారు మాట్లాడుకుని సరదాగా విజయవాడ దుర్గగుడి క్కూడా వెళ్ళొద్దాం, రేపొద్దునే ప్రయాణం. నువ్వింకే పనులూ పెట్టుకోకు....” అని నచ్చచెప్పి వెళ్ళాడు మా నాన్న.

నాన్నంటే భయమేగానీ, పెద్దపులిని చూస్తే కలిగే భయంలాంటిది కాదు, అది భక్తితో కూడిన భయం! కొండపైన దుర్గగుడిలో బలిదానానికి అన్నీ సిద్ధం చేసివుంచారు. గుళ్ళోకి వస్తూనే నా చేత బట్టలు మార్పించి, ఏవేవో అలకారాలు చేసి తీసుకెళ్ళి పీటలమీద కూర్చోబెట్టారు.

కూర్చున్నాక చూశా, నా పక్కన ఎవడో ఒకబ్బాయి పెళ్ళికొడుకు వేషంలో కూర్చున్నాడు. అంటే ఇప్పుడు నేను పెళ్ళికూతురినా? ఇంత అమాయకంగా ఎలా దొరికిపోయాను...?! అరిచి అల్లరిచేస్తే అమ్మానాన్నల పరువుపోవటం తప్ప ప్రయోజనం లేదని అర్థం అయిపోయింది. ఇంతకింత పరాభావం చెయ్యాలి....

అయినా ఈ పెళ్ళికొడుక్కయినా సిగ్గుండొద్దూ...

కనీసం నా ఇష్టాయిష్టాలైనా తెలుసుకోవద్దా?

పెళ్ళికొడకా... కాచుకో! కాళీ సత్తా ఏవిటో చవిచూస్తావ్!!

అంతకు మునుపు ఒకరోజు ఇంటికొచ్చిన చుట్టాలకు కాఫీలు నాతో ఇప్పించారు. అతిథిమర్యాదలంటే నాకు చాలా ఇష్టం కదా! బహుశా అవే పెళ్ళిచూపులై వుంటాయి. అప్పట్లో ఆ సంగతి నాకు తెలీదు. తర్వాత రీప్లే చేసుకుని ఆలోచిస్తే, నా పెళ్ళి వెనుక ఎంత కుట్ర దాగివుందో అర్థం అయ్యింది.

హుషారుగా నేను కాఫీలందించటం చూసి, మావాళ్ళు ఈ పెళ్ళి నాకు ఇష్టమేనని పొరబడ్డారేమో...!

'పరీక్షలయ్యాకే కార్యం' అన్నాడు నాన్న! వాళ్ళు కూడా ఒప్పుకున్నారు. నేను కూడా అందుకు సరేనన్నట్టే లెక్కల్లో రాసుకున్నారు! ఎందుకంటే ఎదురుతిరగట్లేదు కాబట్టి! ఎదురు తిరగటమా? తలవంచుకోటమా? మనసు చెప్పినట్టు చెయ్యాలి!

నిజం చెప్పొద్దూ, ఆ పెళ్ళి కొడుకుని నేను చూణ్ణేలేదు. నేనే నీ మెడలో తాళి కట్టినవాణ్ణంటూ రేపు అతను వస్తే, గుర్తుపట్టగలనా..?

నాకు పెళ్ళయిన సంగతి మా మిత్రబృందానికి తెలిస్తే పరువు నష్టమే! ఊళ్ళో ఎవ్వరికైనా చెప్పావంటే ఊరుకోనని అమ్మని బెదిరించాను. మంగళసూత్రాలు తీసి చిలక్కొయ్యకి తగిల్చాను. మామూలుగానే కాలేజీకి వెళ్ళసాగాను.

వేసవి సెలవుల్లో కార్యానికి ముహూర్తం పెట్టేశారు. ఆ రోజువరకూ ఆ సంగతి నాకు తెలియకుండా జాగ్రత్తపడ్డారు. అత్తారింటివైపు చుట్టాలు, పెళ్ళికొడుకూ అందరూ వచ్చాక నాకు అర్థం అయ్యింది. అప్పుడు నేను చెయ్యగలిగిందేవిటీ...?

ముందు ఈ గండం తప్పిస్తే తరువాత సంగతి తరువాత... అనుకున్నాను. నా చీర, నా దుప్పటి, నా చెంబూ, నా చాప పక్కన పెట్టుకుని, ఇంట్లోకి రాకూడదని ఎత్తు ఎత్తాను.

అంతే! సకుటుంబసపరివార సమేతంగా అత్తారు ఇంటిదారిపట్టారు. నిజానికి ఇది బ్రహ్మాస్త్రమే! కానీ, ప్రయోగించేశాను. ఇంకోసారి పనిచేయదు! కాబట్టి, ఈసారి పాశుపతమే ప్రయోగించాలి! దాని గురించే తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

స్టూడెంట్ యూనియన్ ఎన్నికల కోసం విప్లవసంఘాల పక్షాన లలితక్క ఒకసారి మా కాలేజీకొచ్చింది. ఆమెతో నాకు బాగా సాన్నిహిత్యం ఏర్పడింది కూడా.

నా ఆలోచనలన్నీ లలితక్క వలన పదునెక్కినవే! ఆ స్నేహం కొద్దీ తిన్నగా వెళ్ళి లలి తక్కని కలిశాను. జరిగిందంతా చెప్పి మార్గాంతరం చెప్పమన్నాను. సంసార ఝంఝులో కొట్టుకుపోకుండా వుండాలంటే, విప్లవపంథాలోకి రావటమే మంచిదని నాకు నచ్చచెప్పింది లలితక్క! విప్లవ కార్యక్రమాలలో భాగం పొందటంకన్నా పుణ్యకార్యక్రమం లేదంది.

వర్గ శత్రు నిర్మూలన జరగందే విముక్తి రాదండి. నిజమైన మోక్షం శత్రుశేషం లేకుండా చేయటమేనంది! లలితక్కతో కలిసి అట్నుంచి అటే వెళ్ళిపోయాను. మళ్ళీ మా ఇంటిముఖం చూడలేదు.

కార్యంరోజునే పెళ్ళికూతురు ఎవడితోనో లేచిపోయిందని అనుకుని వుంటారు. మా నాన్న నాకు ఘటశ్రాద్ధం పెట్టుంటాడు.

ఒకసారి లలితక్కతో అన్నాను....

"అక్కా! ఇలా ఇవ్వు ఆ తుపాకి, తీర్చుకుంటాను నా తరతరాల బాకీ...." అని!

నా కోపం ఆడదాన్ని అణగదొక్కే వ్యవస్థమీదే! స్త్రీ జాతిని అణగ్గొట్టేవాళ్ళందరినీ వరసగా నిలబెట్టి కాల్చేయాలి! మగాడొచ్చి ఏదో చేస్తాడని, దానివల్ల కుతి తీర్తుందని ఆడపిల్లలు కలలు కంటారు. వాడు అణగ్గొడుతున్నాడన్న సంగతి అనుభవం మీద గానీ వాళ్ళకు తెలిసిరాదు.

స్త్రీ దోపిడీని అరికట్టే నూతన వ్యవస్థ తేవాలి. అదీ నా కల!

చైతన్యం కోసమే పుట్టాను. చైతన్యంతోనే తుపాకీ పట్టాను. చైతన్యం నింపాలనే మనుషుల్లో కొస్తున్నాను. వస్తున్నానొస్తున్నానొస్తున్నాను.

ఇన్నేళ్ళ తరువాత ఇప్పుడు కొద్దిగా విరామం వచ్చింది. మాలోంచి కొందరిని జనంలోకి పంపించి మహిళాచైతన్య కార్యక్రమాలు విస్తృతం చెయ్యాలని మా హైకమాండ్ నిర్ణయించింది. నాకు విజయవాడ అప్పగించారు.

మహిళా చైతన్యం కలగాలంటే నినాదాలు చాలవు. క్షేత్రస్థాయిలో పనిచేయాలి. అందుకోసం సంసారపక్ష స్త్రీలాగా పనిచేయాలని నేను భావించాను. అర్జెంటుగా నేనిప్పుడు బ్రాహ్మణ ముత్తైదువుగా మారిపోవాలి. అదీ నా తక్షణ కర్తవ్యం.

ఈ బెజవాడలో మా అత్తారిల్లు ఎక్కడో తెలీదు. అత్తారింటి సంగతులు కూడా తెలీవు. రంగంలోకి దిగితే అన్నీ తెలుస్తాయి. ఎర్రపట్టుచీర తీసి కట్టుకున్నాను. ఆరుగజాల చీర అది! నా సన్నని పర్సనాలిటీకి అందులో సగం చీర చాలు! కాసేపు ప్రయాసపడి కాశీగోచీ పెట్టుకున్నాను.

చిన్నప్పుడే అలాంటివన్నీ బలవంతంగా నేర్పిస్తారుకదా పెద్దవాళ్ళు. అవన్నీ గుర్తుచేసుకున్నాను. ముఖానికి పసుపు రాసుకొని, నుదుట పెద్ద కుంకుమబొట్టు, పాపిట సింధూరం పెట్టుకున్నాను. తిన్నగా దుర్గగుడికెళ్ళి, అర్చకులుగా పనిచేసే మా మామగారు శాస్త్రిగారి కోసం ఆరా తీశాను. మామగారు కాలం చేశారని, కొడుకు సాఫ్ట్‌వేర్ ఉద్యోగం చేస్తూ, ముంబయిలో ఉన్నాడనీ, అత్తగారు శ్రీనగర్ కాలనీలో స్వంత ఇంట్లోనే ఉంటోందనీ వివరాలు తెలిశాయి.

మొత్తానికి గుడితోనే నా కార్యక్రమం ప్రారంభం అయ్యింది.

గుడికి వచ్చినందుకు అమ్మవారు ప్రత్యక్షమై, "కాళీ! నీకు ఏ వరం కావాలో కోరుకో...." అని నన్నడిగితే, సంకోచించకుండా 'ఈ ఆడవాళ్ళలో హేతువాదం వర్ధిల్లాలి' అనే కోరుకుంటాను. అలాంటి ఆలోచన వచ్చినందుకు నాకే నవ్వొచ్చింది.

గుడికొస్తే విప్లవకారులక్కూడా భక్తిస్పందనలు కలుగుతాయా? ఎట్లాగైతేనేం, మా అత్తగారి ఇంటిని కనుక్కోగలిగాను. ఇంటికి తాళం పెట్టివుంది. చుట్టుపక్కలవాళ్ళను

అడిగితే, అత్తమ్మ కాశీయాత్రకెళ్ళిందని చెప్పారు. ఒక ఆశ్రయం దొరికినట్టే దొరికి చేజారిపోయింది.

ఒకవేళ అత్తమ్మ ఇంట్లోనే ఉన్నప్పటికీ "నేను లేచిపోయిన మీ కోడల్ని" అంటే నన్ను ఇంట్లోకి రానిస్తుందా...? వాళ్ళకూ మాకూ కామన్ బంధువులుంటారుకదా.... వాళ్ళలో ఎవరో ఒకరి పేరు చెప్పి ఆ ఇంట్లో చేరాలనుకున్నాను. కానీ అనుకున్నట్టు జరగకపోవటంతో నిరాశ ఏర్పడింది. దారిలో ఓ అందమైన ఆడపిల్లని పైట లాగి ఒకడు జడ లాగి ఇంకొకడు రకరకాలుగా ఏడ్పిస్తూన్న దృశ్యం కళ్ళలో పడింది. ఈ కుర్రముఠా దిగిందనేసరికి చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళంతా లోపలికిపోయి తలుపులు వేసుకున్నారు.

ఆ పిల్ల కుందనపు బొమ్మలా ఉంది. తెలుగింటిపిల్లలాగా లంగా ఓణీ వేసుకుంది. నుదుట భానుమతిలా దోసగింజ ఆకారంలో పెద్ద బొట్టు పెట్టుకుంది. ఆ కుర్రాళ్ళు అల్లరిపెడ్తుంటే చూసి నిశ్చేష్టురాలై నిలబడి పెద్దగా ఏడ్చేయసాగింది.

నేను చకచకా ఆ పిల్లదగ్గరికి వెళ్ళి భయంలేదని ఓదార్చి, దాని ఓణీని సరిచేసి దగ్గరగా హత్తుకొని నిలబడ్డాను.

ఓణీ పీకినవాడు నా మీదకు దూసుకొచ్చి "ఓయ్! ఎవత్తెవే నువ్వు...?" అన్నాడు. చాచి గూబమీద ఒక్కటిచ్చాను. ఆ దెబ్బకు వాడు కళ్ళు తిరిగి ఒక్కసారిగా విరుచుకుపడ్డాడు. వాడి చెవుల్లోంచి రైలుకూతలు, జలపాతపు హోరు వినవస్తూ వుండాలి. కానీ, వాడు స్పృహలో లేడు. కారడవుల్లో కఠోరమైన దీక్షతో నేర్చుకున్న యుద్ధ విద్య అది! దాన్ని మొదటిరోజే ప్రయోగించాల్సి వచ్చింది! వాడితో పాటు వచ్చిన రౌడీని దగ్గరకు పిలిచాను.

"వీణ్ణి తీసుకుపోయి ఆస్పత్రిలో చేర్పించు. చెవి డాక్టరుకి చూపించు..." అన్నాను.

బుద్ధిగా వాళ్ళు ఈ కిందపడ్డవాణ్ణి మోసుకుపోయారు.

"ఇంకోసారి ఇటువైపు వచ్చారో ఖబడ్దార్" అన్నాను.

దాంతో ధైర్యం వచ్చిన చుట్టుపక్కల ఇళ్ళవాళ్ళు తలుపులు తెరుచుకొని బయటకు వచ్చారు. అందరూ నన్ను చుట్టుముట్టి ధన్యవాదాలు చెప్పుకున్నారు.

ఇంటిపక్కనావిడ వచ్చి "నువ్వు మా సత్యవతికి ఏమవుతావమా...?" అనడిగింది.

'ఆవిడ మా అత్తమ్మ' అన్నాను.

ఇంటిపక్కనావిడ వెంటనే ఇంట్లోకి పరిగెత్తుకెళ్ళి తాళం చెవి తెచ్చి ఇచ్చింది.

మీ అత్తమ్మ ఇంటి తాళం చెవి ఇచ్చి కాశీ వెళ్ళింది. తమ వాళ్ళెవరైనా వస్తే దీన్ని ఇవ్వమంది" అంటూ తాళంచెవి ఇచ్చింది. నా పథకాన్ని ఆచరణలో పెట్టటానికి అనువైన స్థలం ఇదేనని తాళం సంతోషంగా అందుకున్నాను. ఇంట్లోకి వెళ్ళి చూస్తే తెలిసింది. మా అత్తమ్మ కొడుకు అంటే నా భర్తపేరు సుందరం అని!

సుందరం... పేరు బాగానే ఉంది...!

మనిషి ఎలాంటివాడైతే నాకెందుకు...?

నేనేమైనా అతనితో కాపురం చేయబోతున్నానా...?

# 8. లాయర్ సదాశివ

"నా బాధ నన్ను పడనివ్వడు. నా మనవి నన్ను చేసుకోనివ్వడు. ప్రియుడి పంజరంలోనే బందీగా ఉండాలట చనిపోయేదాకా" సంసారపంజరంలో చిక్కుకున్న ఓ ప్రేయసి మనోవేదన ఇది.

అలా చిక్కుకున్న ఒక బుల్ బుల్‌పిట్ట ఆవేదనని ఇలా వర్ణించాడా ఉర్దూకవి!

తన పెళ్ళాం సంసారపంజరంలో చిలకలా ఉండాలనుకుంటాడు పురుషుడు. స్త్రీ కూడా పంజరం లేకపోతే తనకు మనుగడే లేదనుకుంటుంది.

పంజరంలో చేరాక కలిగే దురవస్థకు విరుగుడేం ఉంటుందీ...? మహిళా ఉద్యమాలెన్నో నడుపుతూ, 'లా' చదివినంతకాలం కాలేజీలో కన్నా పోలీసుస్టేషన్లోనే ఎక్కువ గడిపాను.

పోలీసుల దేవతా పులుసు ఆ రోజుల్లో నేనే ఎక్కువ తినివుంటాను.

నా చదువేదో నేను చూసుకొని వుంటే ఈ పాటికి జడ్జిని అయివుండేవాణ్ణి. ఇలా లాయర్ సదాశివంలా మిగిలిపోతానా? గాంధీగారి రోజుల్లో ప్రజా ఉద్యమాలు నడిపినవాళ్ళకి తామ్రపత్రాలిచ్చి గౌరవించే ఈ ప్రభుత్వం తమ పాలనలో ఉద్యమకారుల్ని ఇలా హింసించటం వివక్ష కదా...?

ప్రజా ఉద్యమాలతో సంబంధంలేదని పోలీసు సర్టిఫికెటు ఉంటేనే ఐఎఎస్‌లు గానూ, జడ్జీలుగానూ నియమిస్తారు. ఏ మాత్రం ప్రజాచైతన్యం లేనివాళ్ళు చైతన్యవంతమయిన నిర్ణయాలు ఎలా చేయగలరూ...?

ఈ ప్రభుత్వ విధానం మార్చాలని కోరుతూ ఒకసారి నేను ప్రజాప్రయోజనవ్యాజ్యం వేశాను. ఇంకెప్పుడూ ఇలాంటి పిచ్చివ్యాజ్యాలు వేసి కోర్టువారి అమూల్యసమయాన్ని వృధా చెయ్యవద్దని ఆఖరి వార్నింగిచ్చింది కోర్టు.

ప్రజల గురించి అవగాహన లేని వ్యక్తులు ప్రజల భావాల్ని సరిగా అర్థం చేసుకోలేరనేకదా నా బాధ, అదే జరిగింది.

చదువులైపోయాక ఈ ఐదేళ్ళలో మొదటిసారిగా ఒక అపురూపవ్యక్తి నా దగ్గరకొస్తోంది. ఆమె సౌదామిని!

ఆమెకు నేను ఒక లాయర్ని మాత్రమేగానీ. నాకావిడ అత్యంత ముఖ్య అతిథి.

ఆమె నా చిన్ననాటి స్నేహితురాలు! మా ఊళ్ళో యువకుల కలల పంట.... యువతులకు ఆత్మబంధువు ... వృద్ధులకు చేదోడు... మహిళలకు పెద్ద అండ...

ఆమె లేని మా ఊరు వెలవెలబోతోంది.

అలాంటి సౌదామిని ఇన్నేళ్ళ తర్వాత మొదటిసారిగా మా ఆఫీసుకొస్తోంది.

ఆవిడ కేసు నేనే వకాల్తా పుచ్చుకున్నాను. దాని గురించి వివరించటం అంటే ఒక జేమ్సుబాండ్ సినిమా కథలా సాగుతుంది.

సౌదామిని కోసం నేను చాలాసార్లు రోగర్ మూరెలాగా నటించాల్సి వచ్చింది కూడా! ఇంకో లాయరైతే అంత రిస్కు తీసుకొనివుండేవాడు కాదు.

నేనంటే, సౌదామిని ఆరాధకుల్లో ఒకణ్ణి కాబట్టి, ఎంతో ఇష్టపడి పనిచేశాను.

ఆ కేసుని నేనే డీల్ చేస్తున్నానన్న సంగతి ఆమెకు ఏమాత్రం తెలీకుండా పనిచేశాను.

అవును! ప్రొఫెషనల్‌గా చూస్తే ఇలా పనిచేయటం గొప్ప!

ఈ కేసు ఎలా నడుస్తోందో, అసలు నడుస్తోందో లేదో ఆమెకు ఏమీ తెలీదు... తెలిసి వుంటే ఆమెకు అనుకూలంగా పరిష్కరించటం సాధ్యం కాకపోవచ్చని భయపడ్డాను. అందుకే రహస్యంగా కథ నడిపాను.

కేసు గెలిచామన్న సంగతి ఆమెకు ఉత్తరం రాశాను. అధికారికంగా ఒక వకాల్తా దారుడైన లాయరులా రాశాను.

ఈ లాయర్ సదాశివం ఎవరో అనుకుని వుంటుంది...! నేనేనని తనకు తెలీదు. ఇప్పుడు వస్తోందిగా... తెలుసుకుంటుంది.

నిజానికి ఈ కేసు మా సీనియర్‌ది. దీన్ని నడిపించే బాధ్యతని నాకు అప్పగించారాయన. కేసు తేలకముందే మా సీనియర్ కాలం చేయటంతో పూర్తి, వకాల్తా పుచ్చుకొని గత ఐదేళ్ళగా వాదిస్తూవచ్చాను.

ఇన్నాళ్ళకు తీర్పు సౌదామినికి అనుకూలంగా వచ్చింది. సౌదామిని గురించి ఇతరులకు తెల్సింది వేరు, నాకు తెల్సిన సౌదామిని గురించి నేను చెప్పాల్సింది చాలాఉంది.

వెనకటికి ఓ వేటగాడి భార్య పుట్టింటికెళ్ళి తిరిగొస్తూ ఇలా అనుకున్నదట!

“నా భర్త ఉంటే ఈ చుట్టుపక్కల అడవి నుండి మదగజాలు ఇటువైపే చూడటానికి జంకేవి ఇదేవిటి...? దారిలో ఇన్ని మదగజాలు, అవి సృష్టించిన అరాచకమే కనిపిస్తోంది. అంటే, నా భర్త రోగం వచ్చి మూలపడ్డాడా లేక జీవించిలేడా...?” అని

సౌదామిని ఈ కథలో వేటగాడిలాంటిది.

కాలేజీ రోజుల్లో ఆవిడ ఉండగా, ఆడపిల్లలజోలికి ఎవ్వడూ పోయేవాడు కాదు. సౌదామిని వెళ్ళిపోయిం తర్వాత అది కాలేజీ కాదు నవరసాలు పండించే నాటకశాలైపోయింది.

సౌదామినికి వాళ్ళ నాన్న చిన్నప్పుడే కరాటే నేర్పించాడు. ఆవిడ ఎప్పుడూ ఎవరినీ కొట్టినట్టు రికార్డు లేదు.

కానీ, సౌదామిని పేరు చెప్తే హడలే వాళ్ళు కుర్రాళ్ళంతా!

బర్మాలో పెద్ద కలప వ్యాపారం చేసిన కుటుంబం వాళ్ళది. తెలుగువాళ్ళు బర్మాలో కనీసం నలభైశాతంమంది ఉండేవాళ్ళు.

బర్మాలో సైనిక నియంతృత్వ ప్రభుత్వం వచ్చింది. ఆ సమయంలో పండిట్ నెహ్రూ భారత ప్రధానమంత్రిగా ఉన్నాడు.

అక్కడ స్థిరపడిన భారతీయుల్ని తట్టా, బుట్టా సర్దుకుని వెళ్ళిపోవాలని ఆదేశించింది. సైనిక ప్రభుత్వం ఈ భారతీయుల్లో తెలుగువారైన కలప వ్యాపారులూ, కూలీలూ ఎక్కువ.

నెహ్రూ రాయబారాలు ఫలించలేదు.

"మీ దేశం తలుపులు మీకోసం ఎప్పుడూ తెరిచే వుంటాయి. నిర్భయంగా రండి..." అని ఆహ్వానించాడు పండిట్‌జీ .... తిరిగొచ్చిన తెలుగు బర్మీయులు విజయవాడ నుండి విశాఖపట్టణం దాకా అనుకూలమైన చోట్ల స్థిరపడి కాందిశీకుల్లా జీవించారు.

మాది కూడా అలా వచ్చిన కాందిశీకుల కుటుంబమే! సౌదామిని తండ్రి విజయవాడలో వ్యాపార స్పర్ధల కారణంగా తన కుటుంబాన్ని మాఊరుకు తరలించాడు.

మా ఇంటిపక్కనే ఓ మంచి ఇంటిని కట్టుకుని వుండేవాళ్ళు వాళ్ళ కుటుంబం మంచిచెడ్డలు మావాళ్ళు చూస్తారని ఆయన నమ్మేవాడు. మా నాన్న.

సౌదామినీ వాళ్ళ నాన్న 'బావా' అని పిలుచుకునేవాళ్ళు సౌదామినీ నేనూ బావా, వదినా అని పిలుచుకునేవాళ్ళం.

అప్పటివరకూ ఆంధ్రప్రాంతంలో కట్టిన ప్రతి ఇల్లూ రంగూను టేకుతో కట్టిందే! ఇనుముకన్నా గట్టిగా నిలబడేది.

రంగం వెళ్ళటం అంటే, రంగూను వెళ్ళటమే! మా చిన్నప్పుడు 'రంగూను రౌడీ' నాటిక చాలా ఫేమస్. అందులో నేను రౌడీ వేషం వేశాను.

సౌదామిని మనసులో నా రౌడీ పాత్ర అలాగే నాటుకుపోయి, నన్ను కూడ రౌడీ అనుకుందేమో తెలీదు.

క్లాసుమేటు కాబట్టి సన్నిహితంగా ఉంటూనే, మనసులో మాత్రం నన్ను దూరంగా ఉంచింది. అది నా దురదృష్టం.

మా తెలుగుమేష్టారు సరదాగా ఓ సంగతి చెప్పేవాడు.

"పల్లెటూళ్ళలో నెయ్యి దొరుకుతుంది. ఉప్పు దొరకదు. పట్టణాల్లో ఉప్పు దొరుకుతుంది. నెయ్యి దొరకదు. అందుకే పల్లెల్లో స్నేహం (నెయ్యి) ఎక్కువ, లావణ్యం (లవణం) తక్కువ అని! కానీ, స్నేహ, లావణ్యాలతో పాటు అపురూపమైన వ్యక్తిత్వం సౌదామిని సొత్తు, ఆమె వ్యక్తిత్వాన్ని సన్నిహితంగా ఎరిగినవాణ్ణి నేనే!

నేను టెంత్ చదివేరోజుల్లో 'సౌదా' వాళ్ళ కుటుంబం విజయవాడ నుండి మా ఊరు తరలివచ్చింది. ఇద్దరికీ ఒకే క్లాసు.

సౌదామిని తండ్రి బహుగుంభనం మనిషి, సౌదామిని ఆయన ముక్కులోంచి ఊడిపడ్డట్టే ఉంటుంది.

పోలికలూ, వ్యక్తిత్వం కూడా! బర్మాలోకన్నా ఆయన ఇక్కడ ఎక్కువ సంపాదించాడంటే ఆయన సమర్థత ఎంతటిదో ఊహించుకోవచ్చు.

అవటానికి కోటీశ్వరులేగానీ వాళ్ళ కుటుంబం అతినిరాడంబరంగా జీవిస్తారని, వాళ్ళంటే అందరికీ గౌరవం.

పశువుల ఆసుపత్రికట్టాలని మా ఊరివాళ్ళడిగితే 'మనుషుల ఆసుపత్రి కూడా కట్టించండి' అంటూ రెండురెట్లు కలప ఉచితంగా ఇచ్చాడాయన!

సౌదామినిని నాలాగే మా ఊళ్ళో చాలామంది ప్రేమించేవుంటారు. అది ఆవిడ ప్రత్యేకత. ఐతే, ఆ కుటుంబానికి దగ్గరగా ఉండటాన, నాకున్నంత సౌలభ్యం మిగతావాళ్ళకి లేదు.

కాబట్టి, మనసిచ్చేసే అవకాశం నాకు దక్కింది. మనసు ఇచ్చేప్పుడే ఆలోచించుకోవాలి. ఒకసారి మనసిచ్చేస్తే, ఆవిణ్ణుంచి నీకు పొరపాటున కూడా అది తిరిగిరాదు. ఆ తరువాత జీవితం అంతా మనసు లేకుండానే బతకాల్సివస్తుంది.... అని!

ఆ మనసనేది లేకుండానే మామూలు సదాశివని 'లాయర్ సదాశివ అయ్యాను.

నా మనసు తనదగ్గరే అట్టేపెట్టుకున్న సౌదామిని మొదటిసారి ఈ రోజున నా ఆఫీసుకొస్తోంది....ఒక మామూలు క్లైంట్ లాగా వస్తోంది.... తన కేసు గురించి వస్తోంది...

సౌదామిని కేసుల్లాంటివి క్రిమినల్ లాయరుగా నాకు ఎక్కువ పేరు తెచ్చిపెట్టాయి.

మహిళా ఉద్యమంలో పనిచేయటాన నా దగ్గరకొచ్చే కేసుల్లో వైవాహికజీవిత వైఫల్యానికి సంబంధించినవే ఎక్కువ.

వీటిని కోర్టుబయటే పరిష్కరిస్తే ఇరుపక్షాలకూ మేలు జరుగుతోంది.

"పెళ్ళంటే ఆడామగలను కలపటం మాత్రమే కాదు. రెండు కుటుంబాలను దగ్గర చేయటం. ఆ కుటుంబంతో అల్లుకుపోయేవాడు అల్లుడు.

వివాహ వ్యవస్థలో అయితే రెండు కుటుంబాల నుంచీ, సమాజంలోని ఇతరులనుంచీ ఆర్థిక, సామాజిక సహకారాలు అందుతాయి. దాన్ని నాశనం చేసుకోకండీ..." అని చెప్తుంటాను.

ఒకసారి ముంబయిలో సాఫ్ట్‌వేర్ ఉద్యోగం చేస్తున్న సుందరం అనే ఓ క్లయింట్ నా దగ్గర కొచ్చాడు.

వాళ్ళది ఈ ఊరేననీ, కార్యం రోజే పెళ్ళాం లేచివెళ్ళిపోయిందనీ చెప్పాడు. ఇప్పుడు తను ఇంకో అమ్మాయితో లైంగిక సంబంధం లేకుండానే మామూలు స్నేహితుడిలా సహజీవనం చేస్తున్నాడట.

ఇలా జీవించటంలో చట్టబద్ధత గురించి నన్ను సంప్రదించాడు.

"చట్టాల సంగతి అలా ఉంచండి. మీ ఇద్దరూ అలా కలిసి జీవించటాన్ని మీ మనసే ఆమోదిస్తోందా...?" అనడిగాను.

"నేను ఒక స్త్రీతో 'సహజీవనం' చేస్తున్నాను. అది లేచివచ్చినన బాపతు సహజీవనం కాదు. స్నేహబంధం మాత్రమే!"

"నిజమే, నేను కాదనటంలేదు. వివాదం వచ్చినప్పుడు మీరు వివాహం నిరూపించుకోవాల్సిన అవసరం రావచ్చు.

వివాదం లేనంతవరకూ సహజీవనమా, సమజీవనమా, సంసారజీవనమా అనే మీమాంస ఎవరికీ ఉండదు.

ఎందుకైనా మంచిది, మ్యారేజీ అఫిడవిట్‌మీద మీఇద్దరూ కలిసున్న ఫొటో అంటించి సంతకాలు చేసి నోటరీ చేయించండి. మీది సహజీవనం అని, అనవసరంగా చాటుకోవాలని చూడకండి. ఎప్పటికైనా ప్రమాదం..." అనివివరించాను.

"చట్టం ఏం చెప్తోందో అది చెప్పండి" అనడిగాడు సుందరం.

"లైంగిక అవసరాలకోసం ఒక మగా, ఒక ఆడా కలిసిజీవించటం వివాహబంధంతో సమానం కాదని, సుప్రీంకోర్టు స్పష్టం చేసింది.

యాన్ ఇల్లీగల్ కాంటాక్ట్ ఈజ్‌యాన్ ఇల్లీగల్ కాంటాక్ట్" అన్నాను.

"అనేక విధాలుగా నష్టపోయిన నా జీవితానికి నా సహజీవి ఒక ఊరట. ఆమెని మీరు చెప్పినట్టే పెళ్ళి చేసుకోవచ్చు.

కానీ, నేను విడాకులు పొందని వివాహితుణ్ణి. నా అసలు భార్యమీద నాకు విరక్తి లేదు. అనురక్తి కూడా లేదు.

"నా సహజీవితో వివాహ ప్రస్తావన చేయలేకపోవటానికి కారణం ఇదే! నాది ఒక ప్రత్యేకమైన.కేసుగా భావించి మార్గాంతరం చెప్పండి" అని ప్రాధేయపడ్డాడు సుందరం.

అప్పుడునాకో ఆలోచన తట్టింది.

జస్టిస్ మార్కండేయ కట్జు, జస్టిస్ టి.ఎస్. ఠాకూర్‌లతో కూడిన ధర్మాసనం, కొన్ని సడలింపులిచ్చింది.... దాని ప్రకారం మీ ఇద్దరూ కలిసి జీవిస్తున్నా, సహజీవనం చేస్తున్నా లోకం దృష్టిలో మాత్రం మీ జంట భార్యభర్తలే అన్నట్లుండాలి.

మీ చుట్టుపక్కలవాళ్ళూ, మీ కొలీగులూ, మీకు తెలిసినవాళ్ళూ, మిమ్మల్ని తెలిసినవాళ్ళూ మీరు భార్యాభర్తలుగానే ఉన్నట్టు సాక్ష్యం చెప్పాలి.

లైంగిక జీవితానికి చట్టబద్ధంగా ఉండవలసిన సమవయసు మీ ఇద్దరికీ ఉండాలి.

మీ ఇద్దరూ సహజీవనానికి ఇష్టపడిన ఋజువుకూడా కావాలి. ఉదాహరణకు డబ్బు సాయం చేస్తూ ఒక ఆడమనిషిని చేరదీసి, లైంగికంగా అనుభవిస్తూ, సహజీవనం

అని చెప్పుకోవాలంటే కుదరదన్నమాట. అది గృహహింస చట్టం కిందకు వచ్చే నేరం అని వివరించాను.

"నేను తాత్కాలిక సుఖం కోసం సహజీవనం చేయట్లేదు. నాకు చట్టపరమైన రక్షణ కావాలి" అన్నాడతను మళ్ళీ!

"నాకో విషయం చెప్పండి. ఎన్నాళ్ళు ఇలా లైంగికసంబంధం లేకుండా కలిసి జీవిద్దామని అనుకుంటున్నారు...?" అనడిగాను.

'అవును ఎన్నాళ్ళూ...?' అతను ఆలోచనలో పడ్డాడని నాకు అర్థం అయ్యింది.

నేను వరుసగా కొన్ని ప్రశ్నలు సంధించాను.

"రేపు నీ పార్ట్‌నరే పెళ్ళి ప్రపోజల్ తెస్తే ఏం చేస్తారు?"

"సెక్స్ కోరితే ఎలా తప్పించుకోగలరు?"

"ఎన్నాళ్ళు మీ అసలు భార్య కోసం వేచిచూస్తారు?"

"ఆవిడ తిరిగొస్తుందనే మీ నమ్మకానికి ప్రాతిపదిక ఏమిటీ?"

"ఆమెని మీరు అంగీకరించినా, మిమ్మల్ని ఆవిడ అంగీకరిస్తుందనే భరోసా ఏముంది?"

"ఈ ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానం చెప్పండి... మీ కేసుని ఐదునిమిషాల్లో పరిష్కరిస్తాను" అన్నాను.

"ఈ ప్రశ్నలకు సమాధానాలు నేను వెంటనే ఇవ్వలేను" అన్నాడు సుందరం.

"ఆ సంగతి నాకు తెలుసు. సహజీవనం ఒక జీవితవిధానం కావాలంటే ఇప్పటి పరిస్థితుల్లో కష్టమే!" అన్నాను.

ఎంత ముంబయినగరం అయినా, అక్కడి సామాజిక వ్యవస్థ ఈ దేశవ్యవస్థకు అతీతమయినదేమీ కాదు.

అమెరికాలో కూడా గృహహింస, ఆఫీసుల్లో లైంగిక వేధింపులు, అక్రమ సంబంధాల కేసులు కొల్లలుగా ఉన్నాయి.

గృహహింసని ఆపటం అసాధ్యం, ఎందుకంటే రిపోర్ట్ చేయరు కాబట్టి అని అమెరికాలోనే చేతులెత్తేశారు... ఇవన్నీ మీరు గమనించాలి..." అన్నాను.

జీవితాన్ని ఏరోజుకారోజుగా ప్లాన్ చేసుకోవటానికీ, నిండునూరేళ్ళకు సరిపడా ప్లాన్ చేసుకోవటానికీ తేడాని అతను అర్థంచేసుకోవాలి కదా!

సుందరం మళ్ళీ కలుస్తానని లేచాడు.

అంతసేపు అతనితో గడిపినందుకు వెయ్యి రూపాయలు ఫీజుకింద ఇచ్చి వెళ్ళిపోయాడు.

నాతో మాట్లాడిన తరువాత అతని జీవితంలో ఒక కొత్త మార్పు వస్తే ఈ డబ్బుకు

ఫలితం ఉంటుంది. రోజూ ఇలాంటి కేసులు వస్తూనేవున్నాయి. నాకు తోచిన సాయం చేస్తూనేవున్నాను.

ఓ కేసు గురించి చెప్పాలి... "సహజీవనం చేసి, అన్ని రకాలుగా బావుందనుకుంటే అప్పుడు పెళ్ళి చేసుకుందాం... అని యువతీయువకులు కోరుకోవటంలో తప్పేమిటండీ?" అని వాదించిందో లాయరమ్మ. పెళ్ళికి ముందు లైంగికానుభవం అపకారం చేస్తుందంటూ కక్షిదారుడి పక్షాన నేను వకాల్తా పుచ్చుకున్నాను.

"నీచమైన ఆలోచనలకు, మనోవికారాలకూ ఆధునిక రంగు పులిమి, మన సంస్కృతిని పాతచింతకాయ పచ్చడిగా తూలనాడటం అభ్యుదయం కానేకాదు.

ప్రతి కులటా వ్యభిచార నేరం నుండి బయటపడటానికి సహజీవన మంత్రమే చదువుతుంది. కిరాణాకొట్లో మనకు కావలసిన సబ్బు లేదనంటే ఉన్నదేదో కొనుక్కుని కాంప్రమైజ్ అయిపోయే వ్యక్తులు ఇంట్లో పెత్తనం దగ్గరికొచ్చేసరికి ఆడ ఎక్కు [illegible] గ ఎక్కువా అనేదాకా వెళ్తారు.

"ఎవరెక్కువో తేల్చుకోవటానికి కాదు, సరిసమానమైన గౌరవం కోసం మహిళాభ్యుదయ ఉద్యమం పనిచెయ్యాలి!" అని వాదించాను.

పచ్చట్లో ఉప్పు తక్కువేసిందని జీవితాంతం పెళ్ళాంతో మాట్లాడ్డం మానేసిన ఓ అవధానిగా గొల్లపూడి మారుతీరావు నటించిన దృశ్యం అప్పుడు గుర్తుకొచ్చింది.

మూర్ఖపు పట్టుదలలకు లింగభేదం ఉండదు. ఆడయినా, మగయినా ఒకటే!

మహిళా ఉద్యమ లక్ష్యం స్త్రీపురుష సమానత్వం సాధించటమేగానీ, ఈ భూమ్మీంచి మగాళ్ళని అంతం చేయటం కాదు! పురుషద్వేషం వదిలేస్తేనే మహిళాభ్యుదయం సాధ్యం అవుతుంది" అన్నాను.

సౌదామిని రాకకోసం ఎదురుచూస్తుంటే బుర్రనిండా ఈ అక్రమసంబంధాల విషయాలే కమ్ముకుంటున్నాయి. ఎంత కంట్రోలు చేద్దామనుకున్నా అనే ఆలోచనలు, రోజూ జీవించేది ఈ కేసుల్లోనే కదా!

-- xxx --

# 9. కుంతల

విజయవాడ వెళ్ళివచ్చినదగ్గర్నుంచీ సుందరంలో ఏవేవో మార్పులు కనిపిస్తున్నాయి. ఏమయింది ఇతనికి...?

ఎప్పుడైనా కాఫీ తాగిన గ్లాసు టీపాయిమీదే ఉండిపోతే, అది మా ఇద్దరిలో ఎవరు తాగిందని చూడకుండా తీసి కడిగి కంచాల స్టాండులో పెట్టేవాడు. ·ఇప్పుడు, కుంతలా... "నువ్వు తాగిన గ్లాసు కడుక్కోలేదు" గుర్తుచేస్తున్నాడు.

"నా గ్లాసుకదా! నా ఇష్టం వచ్చినప్పుడు కడుక్కుంటాను. మధ్యలో నీకు దేనికీ...?" అని అనేయొచ్చుగానీ, ఎందుకో అనబుద్ధికాలేదు. పాపం ఫీలవుతాడేమోనని!

ఇలాంటివి ఒకటికాదు, చాలా జరిగాయి. ఇన్నాళ్ళూ అంతో ఇంతో విసుగు నేను ప్రదర్శించి వుంటాను కానీ, 'సుందరం మంచిబాలుడు'లాగా తనే సర్దుకుపోయేవాడు...

ఇప్పుడు సీను రివర్సయ్యింది. నేనే సర్దుకుపోతున్నాను. సర్దుకుపోతున్నకొద్దీ దాష్టీకం పెరుగుతోంది! ఒకరోజు ప్రశాంతంగా ఉన్నప్పుడు, "సుందర్!" అని పిలిచాను. చెప్పమన్నట్టు నా వంక చూశాడు.

"నీకు పెళ్ళిమీద గాలి మళ్ళిందా?" అనడిగాను, అకస్మాత్తుగా ఇలా నా ప్రశ్న వచ్చేసరికి ఏదో బాణం గుండెల్లో తగిలినట్టు ముఖం పెట్టాడు.

"నీతో నేనేమైనా అశ్లీలంగా ప్రవర్తించానా?" కంగారుగా అడిగాడు.

"ప్రశ్నకు ప్రశ్న జవాబా?" అన్నాను.

"నేను మనసా వాచా కర్మణా ఏనాడూ కాముకత్వంతో వ్యవహరించలేదు" అన్నాడు ధీర గం[illegible]గా!

"ఒకవేళ అదే అయితే నా ప్రశ్న సూటిగానే ఉండేది. నా నుండి నువ్వు సెక్స్ కోరుతున్నావా... అని! కానీ నీ మనసు సంసార జీవితం మీదకు మళ్ళింది.... అవునా కదా...?" అని మళ్ళీ సూటిగా ప్రశ్నించాను.

"నీది కేవలం అపోహ" అన్నాడు నా వైపు చూడకుండా తల వంచుకొని.

"కాదు, నీలో పురుషలక్షణాలు కనిపిస్తున్నాయి ఈ మధ్య"

"పురుష లక్షణాలంటే?"

"పెళ్ళాం అనే దాసీది కావాలని కోరుకోవటం"

"నేనే ఒక దాసానుదాసుణ్ణి... నాకింకో దాసీనా?"

"దాసానుదాసుడైన పాలేరుక్కూడా దాసీదైన భార్య ఉంటుంది కదా! భార్య అనే పదానికి పనిమనిషి అని అర్థం?"

సుందరం ఏమీ మాట్లాడలేదు. ఈ సంభాషణ తరువాత సుందరం వింతగా

మాట్లాడటం తగ్గించాడు. అంటీముట్టనట్టే ఉన్నా మునుపంత పెడసరం తగ్గింది.

ఏమైనా, ఇతని మనసులో పెద్ద తుఫాను రేగుతోందని మాత్రం అర్థం అయ్యింది.

సుందరంలో ఈ మార్పులు రావటానికి ఏం కారణమో నాకు అంతుబట్టలేదు. అంత పరిశోధించాల్సినంత తీరిక లేదు.

ఈ మధ్య ప్రమోషను రావటంతో నాకు పని ఒత్తిడి పెరిగింది. మామూలు అసిస్టెంటుగా ఉన్న రోజుల్లో చెప్పినపని చేసి అక్కడ పడేసి మాదారిన పోయేవాళ్ళం. కాకపోతే పనులన్నీ మాకే చెప్తున్నారని గొణిగేవాళ్ళం! అలా అనుకోవటం మానవసహజం.

ఇప్పుడు పనులు ఇచ్చే బాధ్యతలోకి ఎదిగాక తెలిసొస్తోంది. పని చెప్పటంకన్నా చెయ్యటం తేలికని!

పనులు చేసేవాళ్ళకు వందల్లోనూ, చెప్పేవాళ్ళకు వేలల్లోనూ [illegible] ఎందుకుంటాయో కూడా అర్థమైంది.

ఈ కంపెనీలో చేరినప్పటికన్నా జీతం పదిరెట్లు పెరిగింది. కానీ పని వత్తిడి పాతిక రెట్లు పెరిగినట్టనిపిస్తోంది.

అందువలన మా ఇద్దరి గురించి ఆలోచించే తీరిక దొరకటంలేదు.

అతన్ని నేను అశ్రద్ధ చేస్తున్నానేమో.... సుందరంలో మార్పులకు నా బాధ్యత కూడా ఉందేమో... మొదట నన్ను నేను సరిచేసుకొని తర్వాత అతన్ని సరిచేయటం గురించి ఆలోచించాలని అనుకున్నాను. ఒకరోజు చాలా ఆలస్యంగా ఇంటికొచ్చాడు సుందరం.

ఇంత లేటుగా రావటం ఎప్పుడూ లేదు. మనిషి అదోలాఉన్నాడు. రేగిన జుట్టూ, జారిన టై, సగం బయటకొచ్చిన టక్కూ - ఇలా ఎప్పుడూ కనిపించలేదు.

ఇలానే ఒక ఆడపిల్ల కనిపిస్తే, ఎవరైనా రేప్ చేశారేమో అనుకుంటాం.... అలా ఉన్నాడు. బహుశా తాగివచ్చాడేమో అనుకున్నాను. కొద్దిగా భయం వేసింది.

"ఏమైంది... ఎందుకలా ఉన్నావు...?" ఆందోళనగా అడిగాను.

అతను ఏంలేదులే... అంటూ తనగదిలోకి వెళ్ళిపోయి తలుపు వేసేసుకున్నాడు. నాకు ఏ మీ అర్థం కాలేదు. మర్నాడు ఎంతసేపటికీ తలుపు తెరిచి బయటకు రాలేదు. ఆ రోజున నేను చాలా ఎర్లీగా వెళ్ళాల్సివుంది. ఇతను ఎంతకీ లేవలేదు.

చేసేది లేక వెళ్ళి తలుపుతట్టాను. ఇన్నేళ్ళ మా సహజీవనంలో అతన్ని తలుపు కొట్టి లేపటం ఇదే మొదటిసారి. రెండు మూడుసార్లు తట్టిన తరువాత నెమ్మదిగా తలుపు తీశాడు. రాత్రి ఏ విధంగా వచ్చాడో అలాగే పడుకున్నాడు. 'కనీసం బూట్లు అయినా విప్పకుండా పడుకున్నావా...' అంటూ అతన్ని గదిలోంచి బయటకు లాగి గదిలోకి చూశాను.

గదంతా చిందరవందరగా ఉంది. పరమనీటుగాడిలా లెక్చరిచ్చే ఈ సుందరమేనా తన గదిని ఇంత సుందరంగా అట్టేపెట్టాడూ... అనుకున్నాను. చకచకా అతని గదిలోకి వెళ్ళి రెండు నిమిషాల్లో గదంతా నీట్‌గా సర్ది, పక్క దులిపి సరిచేశాను.

“నా కారులోనే వెళదాం త్వరగా తయారవుతావా? వచ్చేప్పుడు నేనే పికప్ చేసుకుంటాను” అని అనడిగాను. “వద్దు! నా కార్లోనే వెడతాను” అన్నాడు. మనిషి చాలా నీరసంగా ఉన్నాడు. బావిలోంచి వస్తున్నట్టుగా ఉన్నాయి అతని మాటలు.

నాకు టైమ్ అయిపోతోంది. ఆ పరిస్థితిలో అతన్ని వదలివెళ్ళటం మనస్కరించలేదు.

ఇదే అసిస్టెంటుగా ఉన్న రోజుల్లో అయితే, సెల్‌మెసేజ్ పెట్టి డ్యూటీకిదుమ్మాకొట్టేసేవాళ్ళం. ఇప్పుడు నేనే ఇన్‌ఛార్జిని. పర్మిషనిచ్చే అధికారి నాపైన లేరు!

ఆడది ఉద్యోగంలో ప్రమోషన్ పొందటం అంటే మగాళ్ళకు ఇబ్బందిగానే ఉంటుంది ఆఫీసులో కాదు ఇంట్లో! మగాళ్ళు గొర్రెతోకలా బెత్తెడు ఉద్యోగాలకే ఎక్కువ ఇష్టపడతారు.

రిస్కు తీసుకోవటాన్ని ఒప్పుకునేవాళ్ళు మగాళ్ళలో తక్కువ.

ఆడాళ్ళకు ఉద్యోగాల్లో ప్రమోషన్లు బాగానే వస్తాయి. కానీ, బాధ్యతలు పెరిగేకొద్దీ ఇంటికి మరింతగా దూరం అయిపోతుంటాం.

ఆఫీసు ప్రెషర్పుని తట్టుకోవటానికి ఈ సమయంలోనే మగాడి ఆసరా కావాలి. కానీ చాలామంది మగాళ్ళు ఈ సమయంలోనే ఇలా ప్రవర్తించి కొత్తటెన్షను తెచ్చిపెడ్తుంటారు.

కొంతమంది సుపీరియర్ల వ్యక్తిగత జీవితాలు నాకు తెలుసు. అందుకే హైయర్ కెరీర్ సాధించుకోవటానికి సంసారజీవితం అడ్డుకాకూడదనే ఇంత జాగ్రత్తగా ఉన్నాను.

నా ‘కెరీర్ ఫస్ట్’ నిజం అయ్యింది. ఇప్పుడు దాన్ని నిలబెట్టుకోవాలి. ఇప్పుడే నేను మరింత జాగ్రత్తగా ఉండాలి. సుందరంతో మనసువిప్పి మాట్లాడేయాలి. అతను నాకో తలనొప్పి కాక మునుపే కొన్ని చర్యలు తీసుకోవాలి తప్పదు!

“సుందర్! ఈ రోజున అఫిషియల్ గెట్ టు గెదర్ ఉంది. అర్జెంటుగా వెళ్ళాలి. రాత్రికి ప్రశాంతంగా మాట్లాడుకుందాం... థాంక్యూ... గుడ్ డే... అంటూ వెళ్ళిపోయాను. సుందరం నావైపు చూస్తూండిపోయాడు. ఆ సాయంత్రం నేను కొంచెం పెందరాళే ఇంటికి వెళ్ళాను. నాక్కూడా త్వరగా అలసట వచ్చేస్తోందీ మధ్య! మనసు రెస్ట్ కోరుకుంటోంది.

నేనే తలుపులు తెరచుకోవాల్సివస్తుందేమో అనుకున్నాను.

సుందరం ఇంట్లోనే ఉన్నాడు. బహువా సెలవు పారేసి ఉండిపోయుంటాడు.

హాల్లో కూర్చుని టీవీ చూస్తున్నాడు... టీవీ పెద్దగా వినిపిస్తోంది.

కారు పార్కింగ్ చేసివస్తుంటే టీవీలో ఎవరిదో మగగొంతు వినిపిస్తోంది...

"ప్రియా! ఒక్క విషయం గుర్తుపెట్టుకో! నేను తిరిగింది చెడ్డదారుల్లోనే కావచ్చు. కానీ, నా మనసు మాత్రం చెడ్డదికాదు. నేను వెళ్ళవలసిన చోటుకు రాచమార్గం లేదు కాబట్టి, చెడ్డదారుల్లో వెళ్ళానంతే! నిజమే తాటిచెట్టుకింద పాలు తాగేవాడిలా లోకనింద ఉంటుందని నాకూ తెలుసు... నేనేదో మహా ఉత్తముణ్ణని నీ ముందు శ్రీరామచంద్రుడిలా నిలబడట్లేదు. ఎందుకంటే, నా గతం అవగతం కానంత అనంతమైంది.

అందులో ఎగుడూదిగుడూ ఎన్నో ఉన్నాయి. వాటిలో దేనికీ నేను కారణం కాదు.

నాకు ఒకసారి లాటరీలో లక్ష వచ్చింది.

బ్యాంకులోంచి లక్షని డ్రా చేసుకుని వస్తుంటే ఎవడో దొంగాడు బ్యాగ్ కొట్టేశాడు.

చివరికి ఆ లక్ష రూపాయలకు కట్టిన ఇన్‌కంటాక్సు ఖర్చూ, లాటరీ వచ్చిందని ఫ్రెండ్సుకిచ్చిన పార్టీ ఖర్చూ కలిపి పదివేలు చిల్లుపడింది. వీటికి నేను కారణం కాదుకదా! నా జీవితం అంతా ఇలానే సాగింది. నా జీవితంలో ఆశించింది ఏదీ జరగలేదు.

డాక్టరుని కావాలనుకున్నాను. ఎమ్‌సెట్‌లోనే చాచి తన్నింది విధి. తెలుగు లిటరేచర్ చదవాలనుకున్నాను. మా మేనమామ వచ్చి ఎమ్‌బీయే చదవమని, ఉద్యోగం ఇప్పించి తన కూతురునిచ్చి పెళ్ళిచేస్తాననీ అన్నాడు. దాంతో అమ్మా, నాన్న నన్ను ఎమ్‌బీయేలోకి తోశారు.

నా చదువు అయ్యాక మేనమామ కూతురు తనకు మేనరికం వద్దు పొమ్మంది. దాంతో పెళ్ళితతంగం కాస్తా తుస్సుమంది. నా ఉద్యోగం నా అంత నేను సంపాదించుకున్నదే. మా మేనమామ ఇప్పించిందేమీ కాదు.

ఆ తరువాత ఇంకెవతెనో తెచ్చి పెళ్ళిచేశాడు నాన్న! ఉద్యోగం వచ్చిందిగా మంచిపిల్లే ఏలుకో అన్నాడు. అది ఫీటలు దిగుతూనే ఎవడితోనో లేచిపోయింది. రెండోపెళ్ళి తతంగం కూడా మళ్ళీ తుస్సుమంది. వెలగని మతాబులా అయిపోయింది.

మధ్యలో ఒకసారి ఓ ఆల్కెమిస్టు బంగారం చేసే యోగం చెప్తానంటే కొన్నాళ్ళు ఆయన శుశ్రూష చేశాను... బంగారం యోగం ఆయనకే సిద్ధించిందో లేదో తెలీదు... సన్యాసం స్వీకరించి, హిమాలయాలకు వెళ్ళిపోయాడు.

నా జీవితంలో కనీసం రెండేళ్ళు అలా వృధా అయిపోయాయి.

మనిషన్నాక ఏదో ఒక సుఖానుభవం కోసం ఆపేక్షపడతాడు. అలా అందించేందుకు ఓ స్త్రీ సిద్ధపడింది. నా కథంతా విని జాలిపడింది. నీకేం తక్కువా..? దిగులుపడకు. నిన్ను ఆదుకుంటాను... నేను పెళ్ళిచేసుకుంటాను... అంది. కానీ, అదే ముహూర్తానికి మా ఆఫీసర్ని పెళ్ళాడింది. "నీకన్నా ఎక్కువ కష్టాల్లో ఉన్నాడీయన; అందుకని ప్రస్తుతానికి

ఈయనతో ఉండి ఈయన్ని ఆదుకోవాలని అనుకున్నాను. ఇంకోసారి కలుద్దాం డియర్... అంది నా ప్రేయసి!

ఇలా టీవీలో చెప్పుకుంటూపోతున్నాడెవడో దౌర్భాగ్యుడు.

ఏదో సీరియల్లో సీను అనుకుంటాను... సుందరం భుజం మీద చెయ్యివేసి తలనిమిరి వెళ్ళి అతని పక్కనే కూర్చున్నాను. 'కాఫీ తాగుదామా...?' అనడిగాను గోముగా!

"ఫ్లాస్కులో ఉంది తాగు..." అన్నాడు. ఆ మాట ముక్తసరిగా అన్నట్టు అనిపించింది.

కాఫీ రెండు కప్పుల్లో పోశాను. తనకొద్దన్నాడు.

రెండింటినీ ఒకే కప్పులోకి ఒంపుకుని నేనే తాగేశాను.

"ఇంత అంక చండాలుడి కథని అంత ఇంట్రెస్టింగుగా చూస్తున్నావేంటి" అన్నాను.

అతనేమీ మాట్లాడలేదు.

ఓ గంటసేపు పడుకోవాలనిపించి నా రూములోకెళ్ళిపోయాను.

సౌదామిని దగ్గర్నుంచి ఉత్తరం ఏదీ రాలేదు.

కాళీ వర్తమానం కూడా తెలీదు.

ఆ రోజుల్లో మా నిర్మలమైన స్నేహాలు, ఆత్మీయానుబంధాలు జీవితంలో అవి చెక్కు చెదరినవని అనిపించింది. మనసు స్నేహం కోసం ఆత్రపడసాగింది.

ఓపిక కూడగట్టుకుని హాల్లోకొచ్చాను. హాల్లో లైటు వేసిలేదు. టీవీ మోగుతూనే వుంది. సుందరం టీవీ చూస్తున్నాడనుకున్నాను.

టీపాయి మీదే రిమోటు ఉంది. చకచకా వచ్చి వాల్యూమ్ తగ్గించాను. సుందరం కదల్లేదు. లైటు వేసి చూశాను.

అతను కళ్ళుమూసుకుని వున్నాడు.

తట్టిలేపాను. అతను లేవలేదు. సోఫాలోనే ఒక పక్కకు ఒరిగిపోయాడు.

ఆ క్షణాన భయంతో వణికిపోయాను. ఏం చెయ్యాలో తోచలేదు.

అంబులెన్స్‌ని పిలిపించి పదంటే పదినిముషాల్లో సుందరాన్ని ఆసుపత్రికి తీసుకెళ్ళిపోయాను.

ఎవరిని ఏ బలహీన ఘడియ ఏ దెబ్బ కొడుతుందో తెలీదు. అది ఇతరులపైన ఎలా పడుతుందో అంతకన్నా తెలీదు. ఇతనెవరిని చెప్పాలి...? ఇతనికేమైనా అయితే ఎవరికి తెలియజేయాలి...? ఇందులో నా జవాబుదారీ ఏమిటీ...?

ఆసుపత్రివాళ్ళు సుందరం భార్యగా నా సంతకం కావాలన్నారు...

సంతకం చేస్తున్నప్పుడు నా చేతులు వణికాయి.

-- xxx --

# 10. కామేశం

"దేని గురించిఆలోచించకూడదో దాని గురించే ఆలోచిస్తున్నావు కామేశం! మళ్ళీ అన్నీ తెలిసినట్టే మాట్లాడతావు. తెలివైనవాళ్ళు గడిచిపోయిందాని గురించీ, గడవబోయే దాని గురించీ ఆలోచిస్తూ టైమ్ వేస్టు చేసుకోరు" అంది సౌదామిని.

నేను మాట్లాడేది ఈ రోజు ఎగిరిపోతున్న నా ట్యూషన్ల గురించి, ఆమె చెప్పేది చెల్లుబాటు గాని అయిదొందల నోటు గురించి.

అన్నీ ఆవిడే మాట్లాడేస్తోంది. ఎదుటివాణ్ణి మాటలతో కన్ఫ్యూజ్ చేయటంలో ఆమెకు సాటి నేను కాదని ఒప్పుకున్నాను. నా గర్వం అంతాదిగిపోయింది.

నేను దిక్కుమాలిన అక్కుపక్షిలా ఆవిడముందు ఆ ఫాస్టుఫుడ్ రెస్టారెంట్లో చేతులు కట్టుకుని కూర్చున్నాను. అర్జునుడికి భగవద్గీత బోధిస్తున్న కృష్ణుడిలా మాట్లాడుతోంది సౌదామిని!

చేతిలో చిల్లిగవ్వలేదు, గూట్లో గుడ్డిగువ్వలాంటి ఆ చెల్లుబడికాని అయిదొందల నోటు తప్ప! లేనిది వచ్చేదీ లేదు. ఉన్నది పోయేదీ లేదు అన్నట్టుంది నా పరిస్థితి. ఇవి రెండూ అచ్చమైన పచ్చినిజాలు. ఇంతలో హోటలువాడు 'సెల్ఫ్ సర్వీస్' అంటూ ఒక అరుపు అరిచి వెళ్ళాడు. "మనమే తెచ్చుకోవాలటండీ" అన్నాను.

సౌదామిని ఒకసారి నా వంక కొరకొరా చూసి, నా దగ్గరున్న చెల్లని అయిదొందల నోటు తీసుకొని తన విలాసవంతమైన వానిషింగ్ బ్యాగులో పెట్టుకుంది. స్టైలుగా నడుచుకుంటూ క్యాష్ కౌంటరు దగ్గరకు వెళ్ళింది. మా ఇద్దరికీ టిఫిన్ టోకెన్లు తీసుకుని మిగిలిన చిల్లరతో సహా తిరిగొచ్చింది. నాకు మతిపోయినట్టయింది.

"సృష్టి సర్వస్వంలో నాశనం లేనిది ఒక్కటుంది! దాన్నిఎవ్వరూ నాశనం చేయలేరు. ఈ దేహాలన్నీ నశించినా అది నశించదు.

ఓ భరతవీరా! లే! లేచి ఆ టిఫిన్ కౌంటర్ దగ్గర మూగిన జనంతో యుద్ధం చెయ్యి.

నువ్వు చంపుతున్నాననుకోకు, నువ్వే చస్తున్నాననీ అనుకోకు. అవి రెండూ అబద్ధాలే!

నిజం ఏమిటంటే నువ్వెళ్ళి పోరాడి, టిఫిను పట్టుకురావటం..." అంది. టిఫిన్ టోకెన్లనీ, మిగిలిన నాలుగొందల నలభై రూపాయల చిల్లర నోట్లనీ నా చేతుల్లో పోస్తూ!

టిఫిన్లిచ్చే కౌంటరు దగ్గర విపరీతంగా జనం ఉన్నారు. అందరి ఆర్డర్లూ అయ్యేసరికి మరో గంటైనా పడుతుందేమో! ఇంతలో ఇందాక సెల్ఫ్ సర్వీసు అంటూ అరిచిన హోటల్ ఆసామి ఆ జనం దగ్గరకువచ్చి అందరికీ నెంబర్లున్న ప్లాస్టిక్ టోకెన్లిచ్చి, 'ఈ నెంబర్ల ప్రకారం నేను పిలుస్తానండీ... మీరంతా మీమీ కుర్చీల్లో కూర్చోండి' అన్నాడు.

కాసేపు కొత్త టోకెన్లివ్వద్దని క్యాష్ కౌంటరుకు వినిపించేలా మళ్ళీ అరిచాడు.

"వాడు పిలిచేదాకా వెయిట్ చెయ్యాలి గదా... కూర్చో..." అని నా చెయ్యిలాగా తన పక్కనే కూచోబెట్టుకుంది సౌదామిని.

"తెరుచుకున్న స్వర్గద్వారంలాగా మన పుణ్యంకొద్దీ ఈమహత్తరమైన రెస్టారెంటు దొరికింది. ఇక్కడ కురుక్షేత్ర సంగ్రామ దృశ్యం ఉంటుంది కాబట్టే. ఆ అయిదొందల్ని మార్చటం తేలికైంది.

చిరిగినచొక్కాని తీసేసి కొత్తచొక్కా తొడుక్కున్నట్టు ఆ నోటుని తీసేసి ఇంకొన్ని చిన్ననోట్లు తెచ్చుకోగలిగాం. అంతేగాని దాన్ని గొడ్డలితో నరకలేం. తుపాకీతో కాల్చలేం. ఎప్పటికైనా నోటు నిత్యం. అది ఎక్కడైనా ఉంటుంది. మన దగ్గర ఉన్నంతసేపే మనది..." అంది.

టిఫిన్ చేసేప్పుడు "అర్జునా!" అని పిలిచి, "లోకంలో రెండు పద్ధతులున్నాయి. ఆలోచించి బుర్రతో పనిచేసేది ఒక పద్ధతి. నైపుణ్యంతో పనిచేసేది ఇంకో పద్ధతి. మనకు రెండోది లేదని తేలిపోయింది. మొదటిదాని గురించి ఆలోచించు..." అంది.

"ఆ మొదటి దాన్ని నిన్న సాయంత్రం ఎనిమిదిగంటల నుండే నేను వదిలేశాను... ఇప్పుడు పెట్టుకోగల పనంటూలేదు. నా జేబులో ఉన్న ఈ నాలుగొందల నలభై రూపాయలు కూడా నావికావు. వీటిని సంపాదించిన మీవే! వీటికి నేను కస్టోడియన్ మాత్రమే!

ఎన్ని వానలు కురిసినా, ఎన్ని నదులు పొంగినా సముద్రం నిశ్చలంగా ఉన్నట్టే నేనూ ఉండదలిచాను. కోరికలు అంటకుండా, మోహం, అహంకారం లేకుండా ప్రశాంతంగా ఉండాలనుకుంటున్నాను. ఈ నాలుగొందలూ అయ్యాక కదా మళ్ళీ ఖంగారు మొదలయ్యేది" అన్నాను విరాగిలా!

ఏ పనీ పెట్టుకోకపోవటం కూడా ఒక పనే! అన్ని ఇతరపనులూ మాని, ముందు ఆ పని చూడు" అంది శాసిస్తూ ఆమె!

"ఏ పనీ?"

"టిఫిను తినే పని! అది పూర్తయితే నువ్వు చేయాల్సిన పని చాలా ఉంది" అంది.

కడుపునిండా టిఫిన్ పెట్టించి వెట్టి చేయించే ఆ యజమానురాలికి జీ హుజూరు అనక తప్పలేదు నాకు. గాంధీనగరం రెస్టారెంట్లో టిఫినయ్యాక వాళ్ళనీ వీళ్ళనీ అడిగి ఎట్లాగైతేనే లాయరు సదాశివగారి అడ్రస్ సాధించాను.

"ఇక్కడికి దగ్గర్లోనే అంటండీ... రెండు సందులు దాటాక ఎడం చేతివైపు తిరిగి లోపలికి వెళితే వస్తుందట..." అన్నాను. ఇద్దరం కలిసి రెండు అడుగులు ముందుకెళ్ళామో లేదో... స్పీడుగా పోయే ఓ మోటారు సైకిలు వాడు ఓ ఆరేళ్ళ పాపని గుద్దుకుంటూ ఆగకుండా వెళ్ళిపోయాడు.

నేలమీద పడి ఆ పిల్ల గిలగిలా కొట్టుకుంటుంటే సౌదామిని తట్టుకోలేకపోయింది

చుట్టూ మూగిన జనం చోద్యం చూస్తున్నారు.

కొంతమంది మోటారు సైకిలువాణ్ణి పట్టుకోవాలని వాడి వెంటపడ్డారు.

సౌదామిని ఒక ఆటో పిలవమని చెప్పి ఆ పిల్లని తన ఒళ్ళో పెట్టుకొని గవర్నమెంట హాస్పిటల్‌కు పోనీయమంది. నా చెయ్యి పుచ్చుకొని నన్ను ఆటోలోకి లాగింది.

"ఇలాంటప్పుడు యాక్టివ్‌గా ఉండాలి. అలా మీనమేషాలు లెక్కపెడతావేంటి..." అంటూ నా వంక కోపంగా చూసింది.

"అదికాదు, ఆ పిల్ల ఎవరి తాలూకానో ఏమిటో..." అంటూ ఏదో చెప్పబోయాను ముందు ప్రాణం పొయ్యాలి. ఆ తరువాతే మిగతావన్నీనూ! నువ్వు త్వరగా పదవయ్యా ఆటో..." అని అతన్ని అదిల్చింది. ఆటో దిగేటప్పుడు, "బాబూ! ఈ పిల్లని గవర్నమెంట హాస్పిటల్లో చేర్పించామని ఆ చుట్టు పక్కలవాళ్ళకి కొద్దిగా చెప్పు" అని బ్రతిమాలింది.

ఆటోవాడు మా దగ్గర డబ్బులు తీసుకోలేదు.

"రండమ్మా! నేను కూడా వస్తాను. కాజువాలిటీలో నాకు తెలిసిన ఒకాయన ఉన్నాడు" అంటూ ఆటో అతను సరిగ్గా యాక్సిడెంటు కేసులు ఆ ఆసుపత్రిలో ఎక్కడ చూపించాలో అక్కడికి తీసుకువెళ్ళాడు. ఆటో అతని సాయంతోనే ఆ పిల్లకి సకాలంలో వైద్యసాయం అందింది. సౌదామిని ఆటో అతనికి కృతజ్ఞతలు చెప్పి షేక్ హ్యాండిచ్చింది ఇదంతా జరిగేసరికి మధ్యాహ్నం 12 అయ్యింది. ఆటో అతను ఆటో స్టాండులోంచి తన ఆటోని తీసుకునివచ్చాక మళ్ళీ అదే ఆటో ఎక్కి గాంధీనగరం బయల్దేరాం.

"మీరెక్కడికి వెళ్ళాలో చెప్పండమ్మా! ఇంకేం ఖంగారులేదు. ఇందాక ఆటోస్టాండ దగ్గర ఆ పిల్ల బంధువులు కలిశారు. వాళ్ళు పిల్ల దగ్గరకు వెళ్ళారు" అన్నాడు ఆటో డ్రైవర్.

హమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నాను. తరువాత లాయర్ సదాశివగారి ఆఫీసుదగ్గర ఆటో దిగాం. నేను ఓ వంద నోటు తీసి ఆటో అతనికి ఇచ్చాను.

"నీ సహాయం మరిచిపోలేమయ్యా... ఉంచు" అంటూ ఇంకో వందనోటు కూడా ఇప్పించింది సౌదామిని. అతను సంతోషంగా తీసుకుని, "బేరం తగలకపోతే మీరొచ్చేదాక ఇక్కడే ఉంటాలెండి" అని అన్నాడు.

"నీ పేరేమిటీ..." అనడిగింది.

అతను 'శివ' అన్నాడు. 'గుడ్ నేమ్' అని మెచ్చుకుంది సౌదామిని.

ఆ మాటకే వాడు దణ్ణం పెట్టేశాడామెకి!

నాలో లేనిదీ, ఆమెలో ఉన్నదీ ఏమిటో నాకిప్పుడిప్పుడే అర్థం అవుతోంది.

-- xxx --

# 11. సుందరం

కుంతల సరిగ్గా ఆ సమాయానికి అక్కడ లేకపోతే నా పరిస్థితి ఏమై ఉండేదో తెలీదు.

ఈ పాటికి పన్నెండో రోజు భోజనాలు చేస్తుండేవారు.

నాకేమైనా జరిగినా కన్నీరు కార్చేందుకు నా అనేవాళ్ళెవరున్నారని...?

అదుగో మళ్ళీ బుర్రని ఆలోచనల్లోకి నెడుతున్నావు సుందరం... "ఇంత జరిగాక కూడా గ్రహింపు లేకపోతే ఎలా?" అని మందలించింది కుంతల.

నా వలన ఆవిడకు చాలా ఇబ్బందులు కలుగుతున్నాయి. తన ఉద్యోగానికి ఇబ్బందిగా ఉంటుంది. నాకు తెలీదా... ఇన్‌ఛార్జీల ఒత్తిడి ఎలా ఉంటుందో!

హాస్పిటల్లో నాకు తోడుగా కూర్చునే ల్యాప్‌టాప్‌లో రేయింబవళ్ళూ పనిచేస్తోంది. ఆమెకు ఉన్నంత మనోబలం నాకు లేదు.

ఇప్పుడు శరీరబలం కూడా లేనివాణ్ణయ్యాను.

ఆ రోజు టీవీ చూస్తూ కూర్చుంటే. అకస్మాత్తుగా ఆ సీరియల్లోకి ఎవడో నాలాంటి ఓ వాజమ్మ వచ్చి ఏవిటేవిటో మాట్లాడటం మొదలుపెట్టాడు.

అది నా ఆత్మే అనిపించింది నాకు. అచ్చం నా కథే చెప్తున్నాడని విస్తుపోయాను. నా జీవితంలో జరిగిన అకార్యాలన్నీ వాడు తనవిగా ఏకరువు పెట్టాడు.

అది వింటుంటే నాకు భయం వేసింది. నా పరిస్థితి కూడా ఈ వేగబాండ్ లాంటిదేనా... అనిపించింది. బుర్ర తిరిగిపోయింది. గుండెలు బరువెక్కిపోయాయి.

సరిగ్గా అదే సమయానికి కుంతల ఇంటికొచ్చింది.

నేను చూస్తున్న సీరియల్లో ఆ పాత్ర మాట్లాడుతుంది అంతా తనూ విన్నది.

వెనకనుండి వచ్చి. నా భుజం మీద చేతులేసి. తలనిమిరి. స్నేహంగా వచ్చి పక్కన కూర్చుంది.

టీవీలో వాడు తన దరిద్రాన్నంతా ఏకరవుపెడ్తున్నాడు. కాఫీ ఇచ్చి తాగమంది కుంతల. నాకు మైకం కమ్ముతున్నట్టనిపించి వద్దంటూ చేత్తోనే సైగ చేశాను.

"ఇంత అంక చండాలుడి కథని అంత ఇంట్రెస్టింగుగా చూస్తున్నావేంటి" అంది.

ఆ మాటతో నా గుండె పిండినట్టయిపోయింది. ఆ అంక చండాలుణ్ణి నేనే! అది నా కథే! పరమవికారంగా కనిపిస్తున్నది నా ఆత్మే!

కుంతల నన్ను గమనించలేదు. లేచి తన గదిలోకి వెళ్ళిపోయింది. ఆ తరువాత ఏం జరిగిందీ నాకు తెలీదు. స్పృహ వచ్చేసరికి ఈ బెడ్డుమీద ఉన్నాను.

డాక్టరుగారు వచ్చి 'ఇవ్వాళ డిశ్చార్జి చేద్దాం' అన్నాడు.

నా వంక చూసి, "మిస్టర్ సుందర్! మీరు కాస్త ఆలోచనలు తగ్గించుకోవాలి. తీవ్రమైన డిప్రెషన్‌కు లోనుకావటం వలనే ఇంత ప్రమాదం జరిగింది..." అని వివరించాడు.

"లేదు లెండి... ఆయన మనసు సంతోషంగా ఉండేలా నేను చూసుకుంటాను. నాదీ బాధ్యత!" వరమిచ్చే దేవతలా అంది కుంతల.

డాక్టరుగారు సంతోషంగా వెళ్ళారు. నాకూ మనసు కొంచెం కుదుటపడినట్టే అనిపించింది.

ఇంటికి వెళ్ళాక కుంతల పాదదాసిలా మారిపోయింది. భర్త ప్రాణాలకోసం యముడితో పోరాడిన పరమపతివ్రతలాగా కనిపించింది కుంతల.

భర్త కష్టాలలో ఉన్నప్పుడు మానవత్వంతో సేవలందించటాన్ని పాతివ్రత్యం అనటం సేవా తత్పరతను తగ్గించటమే అనేది నా అభిప్రాయం.

భార్య చేస్తే పాతివ్రత్యం. ప్రియురాలు చేస్తే ప్రేమ. స్నేహితురాలు చేస్తే? అదే సేవానిరతి. దానికింకో పేరు పెట్టాలనుకోవటమే తప్పు!

ఇప్పటికైనా కుంతలను సరిగా అర్థం చేసుకోకపోతే నేను మరో తప్పు చేసినవాడిని అయిపోతాను.

నేను కూడా ఆఫీసుకు వెళ్ళటం మొదలుపెట్టాను.

కుంతల తన వృత్తిలో మునుపటికన్నా బిజీ అయిపోయింది. నేను మామూలు స్థితికొచ్చాను. మళ్ళీ జీవితం రొటీనుకు రాసాగింది.

ఓ సాయంత్రం పూట ఇద్దరం మేడపైకి వెళ్ళి కాసేపు వెన్నెల్లో కూర్చున్నాం.

నేను ఏవేవో లోకాభిరామాయణాలు మాట్లాడుతున్నాను.

తను న్యూస్ పేపరు చదివేది కాదు.

నాకు అన్నం తినేటప్పుడు టివీలో వార్తలు చూడటం అలవాటు. రాత్రి పడుకోబోయే ముందుకూడా ఒకసారి హెడ్‌లైన్లను చూసి పడుకుంటాను.

కానీ మర్నాడు నిద్రలేస్తూనే పేపరు రాకపోతే చిరాకనిపిస్తుంది.

పేపరువాడి కోసం కాలు కాలిన పిల్లిలా తిరుగుతాను.

న్యూస్ ఛానల్స్ ఎంత ఇరవైనాలుగ్గంటలూ వార్తలిస్తూనే వున్నా పేపరు ప్రాధాన్యత పేపరుదేనన్నమాట.

కుంతల ఏదో మాట్లాడాలని అనుకుంటున్నట్టుంది.

టి.వి ఇంటర్వ్యూయర్‌లాగా తనను మాట్లాడనీయకుండా నేనే మాట్లాడేస్తున్నాను.

"సుందరం! లోకం సంగతి వదిలెయ్! లోకం తీరే అంత! దానికోసం నువ్వు బీపీ పెంచుకుంటావెందుకు...? జీవితంలో జీవించు!" అంది కొంచెం నన్ను మందలిస్తూ.

మన ప్రమేయం ఏదీ లేకుండా జీవితం దానిమానాన అది సాగిపోతోంది కదా. ఇంకా దాని గురించి చించేదేం ఉంది" అన్నాను.

నా మాటలో ఏదో నిరాశ వుందని నాక్కూడా అనిపించింది.

"కానీ, ఒక్కోసారి జీవితం గురించి ఆలోచిస్తే అది మలుపుతిరగవచ్చేమో..." అంది.

"మలుపు తిరిగితే ఇరుకుసందుల్లోకి వెళుతుందేమో బండి! ఉన్నదారిలో హాయిగానేపోతున్నాం కదా" అని నేను తప్పించుకోవాలని చూశాను.

"కానీ ఈ దారిలో డ్రైవింగు నీకు కష్టంగా ఉందిగా!" అని ఆమె రెట్టించింది.

"కారుకైతే డ్రైవరుని పెట్టుకోవచ్చు.

జీవితానికి పెట్టుకోలేం కదా! ఎవరి బండిని వాళ్ళే తోలాలి" అన్నాను.

"ఓ పని చెయ్యి, నీ డొక్కుబండిని పక్కనపడేసి వచ్చి నా కారెక్కు! రాజాలాగా రోజూ నిన్ను తీసుకువెళ్తాను" అంది.

కుంతల ఈ మాటలు ఆచితూచే మాట్లాడుతోందని నాకు తెలుసు. ఆ మాటల్లోని సారాంశం తెల్సుకోలేనంత అమాయకుణ్ణి కాదు.

"నీ కారెక్కేంత ధైర్యం నాకు లేదు" అన్నాను ధైర్యంగానే!

"మరి, నిన్ను సంతోషపెడతానని డాక్టరుగారికి మాటిచ్చాను కదా!" అంది.

"నేనిప్పుడు సంతోషంగానే ఉన్నాగా?"

"ఓకే! ఒప్పుకుంటున్నాను. నువ్వు ఇప్పుడు సంతోషంగానే ఉన్నావని, ఈ సంతోషాన్ని శాశ్వతం చేయటం మంచిది కదా!" అంది కుంతల.

"కష్టసుఖాలకు శాశ్వతత్వం ఉంటుందా?" అనడిగాను.

"నిజమే! ఒకసారి నువ్వు ఇలానే అన్నప్పుడు ఈ డైలాగు నేను చెప్పిందే... అప్పుడు నేను కెరీర్ డ్రైవ్‌లో ఉన్నాను.

సంసారబంధాలు నా లక్ష్యానికి అడ్డుగా ఉంటాయని భయపడ్డాను.

నువ్వు తోడుగా ఉన్నావన్న ధైర్యంతో నేను పరుగులు పెట్టాను. అనుకున్నది కొట్టాను...

"లా ఫస్ట్" అని నువ్వంటే, "కెరీర్ ఫస్ట్" అని నేనన్నాను. నీ మార్గంలో నువ్వూ, నా మార్గంలో నేనూ రాత్రనకా పగలనకా పనిచేశాం.

ఇద్దరం పైకొచ్చాం. ఒకరికొకళ్ళం తోడుగా ఉండబట్టే ఇది సాధ్యం అయ్యిందని నమ్ముతున్నాను.

ఈరోజే నాకు మళ్ళీ ప్రమోషనొచ్చింది. ఈ ప్రమోషను కోసం రేటింగ్ పెట్టారు. కానీ, అది జరిగిన పదిరోజులూ నువ్వు బెడ్డుమీద ఉన్నావు.

ప్రమోషన్ అంచున ఉన్నప్పుడు ఇలాంటివి ఇబ్బందే! అయినా కంపెనీకి నష్టం రాకుండా మేనేజి చేశాను. అది నాకు కలిసొచ్చింది.

ఇప్పుడు నాలుగురాష్ట్రాల బాధ్యత నాకు అప్పగించారు. జీతం అనూహ్యంగా నాలుగు రెట్లు పెరిగింది... కుంతల ఆ మాటలు చెప్తున్నప్పుడు ఆమె కళ్ళలో మెరుపు రేఖలు కొట్టొచ్చినట్టు కనిపించాయి.

ఇంతకన్నా సంతోషకరమైన వార్త ఇంకొకటి ఉంటుందా. నేను లేచి ఆనందంగా ఆమె రెండు భుజాల మీదా చేతులు వేశాను. ఆమె అప్రయత్నంగానే లేచి నుంచుంది.

నాకు తెలీకుండానే నేను ఆమెను దగ్గరకు తీసుకున్నాను.

ఆమె నన్ను గట్టిగా హత్తుకుంది. జీవితంలో మొదటిసారి ఒక దివ్యానుభూతికి లోనయ్యాను. ఇంతలో వానచినుకులు మొదలయ్యాయి.

"ప్రకృతి పులకరింత, చూశావా?" అన్నాను.

"తడిశాక జలుబుకు ముక్కు బలుబులా పొంగుతుంది. నీకసలే చలిగాలి పడదు... పద కిందికి వెడదాం..." అంటూ నన్ను ఇంట్లోకి లాక్కుపోయింది.

అంతలో ఆఫీసునుండి ఆమె సెల్‌కి కాలొచ్చింది. ఆమె ల్యాప్‌టాప్ తెరిచి ఆఫీసుపనిలో మునిగిపోయింది. నేను సోఫాలో కూచుని టివీ చూస్తూ, అక్కడే నిద్రపోయాను.

వర్కొస్తే ఆమెకు లోకం తెలీదు. నిద్రొస్తే నాకు ఒళ్ళు తెలీదు.

మర్నాడు విజయవాడలో మా ఇంటిపక్క నాయన అర్జెంటుగా రమ్మని నాకు ఫోన్ చేశాడు.

మా ఇంట్లో ఎవరో ఒకావిడ బంధువునని చెప్పి వచ్చి చేరిందట... మా అమ్మ ఇంకా కాశీ నుండి రాలేదట! బయల్దేరక తప్పలేదు.

-- XXX --

# 12. సౌదామిని

ఎన్ని జన్మలు దాసిగా పనిచేసినా లాయర్ సదాశివ ఋణం తీర్చుకోలేను. అతని మేలు విలువకట్టలేంది. "నా మనోభావాలన్నీ మ్యూజింగ్సు లాగా రాసిపెట్టాను. దాన్ని త్వరలోనే అచ్చులోకి తీసుకొస్తాను. అది నీకు అంకితం చేసుకుంటాను. ఇంతకన్నా 'ఏమివ్వగలదాననురా?' అన్నాను. ఆ చివరిమాటల్ని పాటలాగా పాడుతూ!

"నీ కమ్మని పాట విని చాలా ఏళ్ళైంది. ఒక్కసారిగా నన్ను బాల్యంలోకి లాక్కుపోయావు మళ్ళీ" అన్నాడు సంతోషంగా సదాశివ.

"నువ్వు లోకానికి లాయర్ సదాశివంగారివే గానీ, నాకు మాత్రం నా బాల్య మిత్రుడు 'సదా'వే! అలానే పిలిస్తే నీకేమైనా అభ్యంతరమా?" అనడిగాను.

సదా పెద్దగా నవ్వి, "భలేదానివి! అలా పిలవమని నేనే కోరాలనుకున్నాను. నీ వేటగాడి ఆలోచనలకు భయపడి ఆగాను. అసలే కరాటేయోధవి కదా!" అన్నాడు.

"నాకు అదికూడా వచ్చుకదూ.. ఆ సంగతే మరిచిపోయాను స్మీ!" అన్నాను పాత జ్ఞాపకాలు గుర్తుచేసుకుంటూ!

"ఆ రోజు నీచెంప దెబ్బతిని నిన్ను సివంగి అని పిలిచాడే... మన సోమనాథుడు గుర్తున్నాడా... ఆయనే జిల్లాజడ్జి అయ్యాడు. నీ కేసుకు అనుకూల తీర్పు ఆయనిచ్చిందే..." అన్నాడు.

నాకేం మాట్లాడాలో తెలీలేదు. నా చేతుల్లో చెంపదెబ్బ తిన్నాయన తీర్పిచ్చాడు.

నన్ను పెళ్ళి చేసుకుంటాననంటే కళ్ళురిమి చూశాను. దాంతో భయపడి వెనక్కిపోయిన ఈ సదాశి నా తరఫున వాదించాడు.

రేపటిరంగుల్ని, రంగవల్లుల్నీ ఊహిస్తూ, నమ్మి పెళ్ళిన మొగుడు నన్ను నట్టేట ముంచాడు.

ఆ రోజున వాళ్ళు తాగబోయిస్తే, సీసాడు సారాకి కక్కుర్తిపడి, మా దస్తావేజులు ఏ బ్యాంకులో ఉన్నాయో రహస్యం చెప్పేసింది స్వయంగా నా మొగుడే...

ఎందుకలా చేశాడంటే సమాధానం ఏవుంటుంది? తాగుబోతుకి నియతి ఉంటుందా? ఆ చేష్టలకు తర్కం ఉంటుందా? నాకు ఆస్తి వస్తే, అతనికి లాభం కాదా...?

"అమ్మో! ఆడదానిచేతికి డబ్బొస్తే ఇంక మాట వింటుందా...? నెత్తికెక్కయదూ..." అన్నాడు తాగిన మైకంలో!

నా మొగుడిచ్చిన సమాచారంతో నాన్నగారి శత్రువులు బ్యాంకు మేనేజరుని మాయచేసి, మా దస్తావేజులు కాజేశారు. వాటితో మా ఆస్తిని సొమ్ము చేసుకోవాలని చూశారు.

విజయవాడ నుండి మా కుటుంబాన్ని తరలించి, మా నాన్న వాళ్ళతో న్యాయపోరాటం చేశాడు. జీవితాంతం పోరాడుతూనేవున్నారు కేసు తేలకముందే

అమ్మానాన్న ఇద్దరూ వెళ్ళిపోయారు. ఈ గొడవల గురించి నాకు చూచాయిగా తెలుసుగానీ, ఇంత లోతుగా తెలియదు. సదాశివ పట్టించుకున్నాడు కాబట్టి, మా ఆస్తి మళ్ళీ మాకు దక్కింది.

వ్యాపారంలో మా వాటాగా రావాల్సిన డబ్బుకి వడ్డీతో సహా కట్టాలని కోర్టు తీర్పిచ్చింది.

కోర్టుఖర్చుల కింత కోర్టువారు ఇప్పించిన డీడీని మారిస్తే, చేతినిండా డబ్బొచ్చింది. ఒకటారొండా యాభైవేలు! పొద్దున ఐదొందలు దొంగనోటు మార్చాల్సివచ్చినప్పుడు పడిన మనోవేదన... రాత్రి అరకప్పుటీ తాగి సరిపెట్టుకోవాల్సి వచ్చినప్పుడు కలిగిన బాధ... అన్నీ ఈ డబ్బు చూడగానే మటుమాయమైపోయాయి.

"దీన్ని నీ దగ్గరే ఉంచు" అని యాభైవేల రూపాయల కట్టని కామేశానికి ఇచ్చాను. అతను ఆ డబ్బుని ముట్టుకోవటానికి గజగజా వణికిపోయాడు.

"ఇన్ని నోట్లను నాకంటితో నేనెప్పుడూ చూళ్ళేదు..." అన్నాడు.

"ఇప్పుడు చూశావుగా! ఉంచు" అన్నాను.

"నిద్రలో నడిచే జబ్బులాంటిదే, డబ్బు పారేసుకునే జబ్బుకూడా! అది నాకుంది. నన్ను క్షమించండి" అన్నాడు కామేశం.

అతని మాటలకు నవ్వొచ్చింది. "పోతే పోతుంది. డబ్బు గురించి అంత దుఃఖపడకూడదు. కుక్కని కొడితే రాల్తుంది" అన్నాను అతన్ని ఓదారుస్తూ! ఆ మాట అన్నానని నా చేతిలోంచి డబ్బు తీసుకుని కళ్ళకద్దుకుని మళ్ళీ నాచేతిలోనే పెట్టేశాడు.

'నీక్కూడా సెంటిమెంట్లున్నాయా...?' అని అడిగాను ఆశ్చర్యంగా!

"వెయ్యిరూపాయల నోట్లు మొత్తం యాభై ఉన్నాయి. ఇవి మడిచి జేబులో పెట్టమని నీకిస్తున్నాను. చెప్పింది చెయ్యి" అన్నాను కొంచెం కటువుగా!

అతను మాట్లాడకుండా నా ఆజ్ఞని పాటించాడు.

బ్యాంకులోంచి బయటకు వచ్చాక ఆసుపత్రిలో చేర్పించిన ఆ చిన్నపిల్ల ఎలా ఉందో చూద్దామని అనిపించింది. ఇంతలో ప్రొద్దున ఆటో తోలిన 'శివ' అటుగా పోతూ మమ్మల్ని చూసి ఆటో ఆపి "నమస్తే మేడమ్" అని పలకరించాడు.

"ఇంకేం... దొరికాడు తోడు... పదా" అన్నాడు కామేశం. అతని కళ్ళలో ఏదో అసూయ, రేఖామాత్రంగా కనిపించింది. నాకు నవ్వొచ్చింది. ఇద్దరం ఆటో ఎక్కాం. తిన్నగా గవర్నమెంట్ హాస్పిటల్‌కి తీసుకెళ్ళాడు. ఆటోని పార్క్ చేసి శివాని కూడా రమ్మన్నాను. ఇంటిపక్కావిడట ఎవరో ఓ ముసలమ్మ ఆ పిల్లదగ్గర కూచునివుంది.

ఆ పిల్లని ప్రసవించి తల్లి చనిపోయిందనీ, తండ్రి ఈ పిల్లని అమ్మమ్మ దగ్గర వదిలేసి, చెప్పాపెట్టకుండా వెళ్ళిపోయాడనీ, అతన్ని వెదుక్కొంటూ ఈ ఊరొచ్చిందనీ, గత ఆరేళ్ళుగా ఆ అమ్మమ్మే పాచిపనులు చేసుకొంటూ ఈ పిల్లని సాకుతోందని చెప్పింది. మందులు రాసిచ్చారంటూ చీటీ చూపించింది. డబ్బు అప్పుకోసం అమ్మమ్మ వెళ్ళిందట.

నేను వెంటనే ఆ మందుచీటీనీ, ఓ వెయ్యి నోటుని శివా చేతికిమ్మని కామేశానికి చెప్పాను. మందులూ, ఆ పిల్ల కోసం బ్రెడ్డూ, బిస్కెట్లు కూడా తెమ్మన్నాను.

మొత్తానికి డబ్బొచ్చిన మొదటిరోజు ఓ పుణ్యకార్యంతో మొదలయ్యింది.

సేవలో ఉన్న సంతృప్తి క్షేత్రయ్య అనుభవంలో లేదనిపించింది. అసలైన సంతృప్తి మనసు సంతోషపడ్డప్పుడే ఉంటుంది. "పద! మీ ఇంటికి పోదాం..." అంటూ ఆటో ఎక్కి కూచున్నాను. కామేశం ఆశ్చర్యపోయి మా ఇంటికా...?" అన్నాడు. చెయ్యి పుచ్చుకుని ఆటోలోకి లాగి కూచోబెట్టాను. "నేను చెప్పినట్టు చెయ్యమన్నానా? ప్రతి దానికీ డిస్కర్షను పెట్టుకొంటావు దేనికీ?" అని గదమాయించాను. పాపం ఆ అమాయకుడు కిక్కురుమనలేదు.

ఆటోలో కూచున్నాక "మీ ఇంటి ఓనరు ఎక్కడుంటాడు...?" అనడిగాను.

"గవర్నరుపేటలో..." అన్నాడు నీళ్ళు నములుతూ!

ఆటోని అక్కడకే పోనివ్వమన్నాను నేను ఆటోలోనే కూచుని, వెళ్ళి తన ఇంటి అద్దెబకాయి కట్టి రమ్మన్నాను. మారు మాట్లాడకుండా వెళ్ళొచ్చి ఆర్నెల్ల బాకీ... నాలుగువేల ఎనిమిదొందలు అయ్యింది..." అంటూ లెక్క చెప్పాడు.

"మంచిది! ఇంక మహరాజు దర్జాతో ఇంటికి వెళ్ళొచ్చు..." అని నవ్వాను.

కామేశం సిగ్గుపడి తలవంచుకున్నాడు. ఇంట్లోకి వెళ్ళాక, "ఆకలి దంచేస్తోంది. తింటానికి ఏవన్నా పట్రా!" అన్నాను శివాని మర్నాడు పొద్దున్నే ఇక్కడికకే రమ్మని చెప్పాను.

రోజంతా మాతోనే ఉండాలని చెప్పాను. ట్యాంకు ఫుల్లుగా ఆయిల్ కొట్టించి, రోజుకెంత కావాలంటే అంత ఇస్తాను. బయట కిరాయిల కోసం తిరగక్కర్లేదు. ఇంకనుండీ నీడ్యూటీ నా దగ్గరే అన్నాను. సరేనన్నాడు సంతోషంగా శివా.

పొద్దు వచ్చేలోగా ఆ ఇల్లనబడే గదిని సంస్కరించే పనిలో పడ్డాను. ముందు అతని గదిని ఆ తరువాత అతని బుర్రని ఉతికి ఆరేయాలి! పనికిరాని చెత్తంతా ఎత్తి బయట పారేశాను.

చెత్త పారేస్తే ఇంక ఆ ఇంట్లో మిగిలిందేంలేదు. ఎంత విశాలంగా ఉందో... అనిపించింది! ఆ దిక్కుమాలిన బొంతని దులిపి మడిచి. ఇంటిని ఊడ్చేశాను.

ఇల్లు ఊడుస్తున్నట్టు అనిపించలేదు. రోడ్డు ఊడుస్తున్నట్టుంది. స్నానం చేసి తింటానికి సిద్ధంగా కూచున్నాను.

ఏడీ... ఈ కామేశం... ఇంకా రాడు...! కడుపు మండుకుపోతోంది. ఇంతకీ విజయవాడ పారిపోయివచ్చిన ఆ పిల్ల తండ్రి ఎవరో...? ఈ కామేశం లాంటి భయస్థుడే అయివుంటాడు. చీకటిపడిందంటే ఇంక ఈ ఇంట్లో వీధి దీపమే గతి! కిటికీ తెరిచి ఆ వెల్తురులో చూస్తే పనికి రాని పాతకాలపు రేడియో ఒకటి అల్మారాలో కనిపించింది.

ఈ ఇంటిని పురావస్తుశాఖవారు చూస్తే. జాతీయపురావస్తు సంపదగా ప్రకటించగలరనిపించింది. ఈ రేడియో అందుకు సాక్షి. ఈ గదిలో ప్రతివస్తువూ కామేశం

బుర్రని ప్రతిబింబిస్తున్నాయి. ఆన్‌చేస్తే రేడియో బురబురలాడింది. "పని చేస్తోందండోయ్..." అనుకున్నాను. స్టేషన్ ట్యూను చేస్తే, ప్రాంతీయవార్తలు వస్తున్నాయి.

నాకు ఊహ తెలిసేటప్పటికే రేడియో వాడకం పోయింది.

పూర్వం రోజుల్లో హోటళ్ళలో కూడా రేడియో పెట్టి జనరంజని పాటలు వినిపించేవాళ్ళట. మా అమ్మమ్మ చెప్పింది.

"మీరు అదృష్టవంతుల్రా! పుడుతూనే టివీ చూస్తున్నారు. మాకు ఇప్పటిగ్గానీ ఆ అదృష్టం దక్కలేదు" అనేది అమ్మమ్మ.

ఎవరూ వినట్లేదు కాబట్టి, మూడొంతుల ఇళ్ళల్లో రేడియో అటకెక్కింది.

విజయవాడలో శ్రీనగర్ కాలనీలో జరిగిన పెద్ద అగ్నిప్రమాదం గురించి వార్తల్లో చెప్తున్నారు. మా ఇల్లు ఉన్నది కూడా అక్కడే! ఖంగారుగా రేడియో వాల్యూము పెంచాను. వార్త స్పష్టంగానే ఉంది. శ్రీనగర్ కాలనీలో ఓ పాతభవంతిలో షార్టు సర్క్యూట్ కారణంగా మంటలు రేగాయి.

ఆ సమయానికి గాలులు తీవ్రంగా ఉండటంతో మంటలు చుట్టుపక్కలకు త్వరగా వ్యాపించాయి. ప్రమాదంలో చాలామంది ఒళ్ళుకాలి ఆసుపత్రుల్లో చేరారు.

మంటల్లో చిక్కుకున్న అనేకమంది పిల్లల్నీ, ముసలివాళ్ళనీ కాపాడిన 'కాననం కాళీ' అనే యువతిని ప్రత్యేకంగా కలెక్టరుగారు అభినందించారట.

వార్త అక్కడితో ఆగలేదు... ఈ ప్రమాదం వెనుక విద్రోహచర్యని పోలీసులు అనుమానిస్తున్నారనీ... కోర్టు వ్యాజ్యంలో ఓడినవారు ఈ అగ్నిప్రమాదాన్ని సృష్టించి ఉండవచ్చనీ... ఆ కోణంలో పోలీసులు పరిశోధిస్తున్నారనీ... నాకు గుండె ఆగినట్టయ్యింది. అది నా ఇల్లే! రేపో ఎల్లుండో నాపేరున రిజిష్టరీ కానున్న ఇల్లు... సందేహం లేదు.

నాపైన కూడా హత్యాయత్నం జరిగే అవకాశం ఉందా...?

అంతలో కామేశం ఖంగారుగా వచ్చాడు.

కోర్టు నుండి ఇంటికెదుతూన్న లాయర్ సదాశివ దారిలో హోటలుదగ్గర కలిశాడట... ఈ రాత్రికి సురక్షిత స్థావరంలో ఉండమని చెప్పాడట... మర్నాడు పోలీసు కమీషనర్‌గారిని వ్యక్తిగతంగా కలుద్దాం అన్నాడట...

వార్తలు నన్నూ నా ఆకలినీ పూర్తిగా చంపేశాయి.

దిగాలుగా కామేశంవంక చూశాను. అతను భయపడవద్దన్నట్టు నా వంక చూశాడు.

"ఎక్కడో తలదాచుకోవటం కన్నా ఇక్కడుండటమే సేఫ్" అన్నాడు.

నేను మాట్లాడకుండా బొంతని పరుచుకుని పడుకున్నాను. పడుకున్నానన్నమాటే గానీ బుర్రంతా ఆలోచనలు ముసురుకొని పెద్ద తేనెతుట్టెలా ఉంది. అకస్మాత్తుగా కాళీ ఈ ఊళ్ళో ప్రత్యక్షం అయ్యిందేవిటీ...? నా ఊహే నిజం అయ్యింది... రేపు కాళీని కలవటం గురించే మనసు ఊరింతలాడింది. ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు.

-- XXX --

## 13. కాళీ

"చీమలూ పాములూ ఒప్పందానికొచ్చాయి ఒకసారి.

చీమరాజు అన్నాడు..." నాగరాజా! మా కోసం మేం అంతా కలిసికట్టుకున్న ఇళ్ళను మీరిలా ఆక్రమించి మమ్మల్ని మా ఇళ్ళలోంచి వెళ్ళగొట్టడం ధర్మంకాదు. కొన్ని యుగాలుగా మీకూ మాకూ జాతి వైరం స్థిరపడిపోయింది.

మీ నోటికి చిక్కి మా సంతతి ఎంతో నశించిపోయింది. ఇంకా ఇంకా నశించిపోవటానికి మేం సిద్ధంగా లేం" అన్నాడు.

నాగరాజు బిగ్గరగా నవ్వి, "మీ అంతగా మీరే మాకు ఇల్లుకట్టిస్తే మనకూ మనకూ గొడవలుండవు కదా..." అన్నాడు. చీమరాజు అందుకు ఒప్పుకున్నాడు.

"తమకోసం ఒకటీ, పాములకోసం ఒకటీ రెండిళ్ళు ఒకేసారి కట్టటానికి సిద్ధపడ్డారు చీమలు.

పాములు తమకోసం కట్టే ఇంటిని జాగ్రత్తగా దగ్గరుండి కావల్సిన పద్ధతిలో కట్టించుకున్నారు.

రెండోది ఎటు తిరిగీ చీమలు తమకోసమే కట్టుకున్నారు.

కాబట్టి, తమ ఇంటికన్నా దృఢంగా కట్టేవుంటారని పాములు అనుమానించాయి. వెళ్ళి చూసి రెండిళ్ళలో ఏది నచ్చితే దాన్ని ఉంచుకోవాలని అనుకున్నాడు నాగరాజు.

ఇళ్ళు పూర్తయ్యాక నాగరాజు సకుటుంబసపరివారంగా తరలివచ్చాడు.

"అయ్యా! తమ ఇంట గృహప్రవేశం చేసి, తరువాత మా ఇంటి గృహప్రవేశం కూడా తమరే చేసి మమ్మల్ని పావనం చేయండి..." అని వేడుకున్నాడు చీమరాజు. నాగరాజు ఈ మర్యాదకు పొంగిపోయాడు.

యుద్ధవ్యయం, యుద్ధనష్టాలు తప్పినందుకు ఆనందించాడు.

"ముందు మీ ఇంట్లోకి ప్రవేశించటం మర్యాద... ఎందుకంటే నిర్మాతలు మీరు కాబట్టి" అన్నాడు నాగరాజు. అంటూనే తన పాము పరివారిన్ని వెంట బెట్టుకొని చీమల ఇంట్లోకి వెళ్ళాడు.

వాళ్ళలా వెళ్ళారో లేదో పథకం ప్రకారం చీమల ఇల్లు కుప్పకూలిపోయింది. ఒక్క పామూ బయటకు రాలేదు. ఇంక, చీమలన్నీ పాముల ఇంట్లో సుఖంగా ఉన్నాయి!

అమ్మలారా! అక్కలారా! ఈ వ్యవస్థ ఇంతకన్నా ఎక్కువగా మనల్ని స్వార్థానికి బలి చేస్తోంది. ఈ కథలో చీమల్లా మనం దాన్ని ఎదుర్కోవాలి.

'బలవంతంబగు సర్పము చలిచీమల చేత చిక్కి చావదే... అంటాడు సుమతీ శతకకారుడు.

మనం కూడా సంఘటితమైతే ఈ వ్యవస్థ కోరలు పీకేయగలిగితేనే. మనల్ని మనం కాపాడుకోగలుగుతాం..." అని ప్రబోధించటం మొదలుపెట్టాను.

శ్రీనగర్ కాలనీలో ఆడవాళ్ళని కూచోబెట్టి నెమ్మదిగా వారికి అభ్యుదయభావాలు నూరిపోయసాగాను. మహిళాచైతన్య సాధనేకదా నా లక్ష్యం కర్తవ్యం కూడా!

మొన్న ఈ ఇంట్లో అగ్నిప్రమాదం సంఘటన తరువాత ఈ వారం రోజుల్లో ఇక్కడ నా మాటకు విలువ పెరిగింది.

ఆ రోజు సాహసం చేసి వుండకపోతే చాలామంది ఆడవాళ్ళు, పిల్లలూ, వృద్ధులూ అగ్నికి ఆహుతి అయిపోయుండేవాళ్ళు. వీళ్ళంతా దిక్కూమొక్కూలేని అనాధలు.

ఈమూడంతస్థుల మేడ ఇన్నేళ్ళుగా కోర్టుకేసుల్లో పడి ఖాళీగా ఉండటంతో భూత్ 'బంగ్లాలాగా తయారయ్యింది.

ఎంతోమంది ఎక్కడా ఆశ్రయం దొరకని బిచ్చగాళ్ళు, పేవ్‌మెంటు పైన పడుకునేవాళ్ళూ ఇక్కడే జీవిస్తున్నారు.

అగ్నిప్రమాదం జరిగినప్పుడు ఇక్కడ అందరూ ఆడాళ్ళే ఉన్నారు. మగాళ్ళు పనులనుండి ఇంకా ఇళ్ళకు చేరలేదు.

అందరమూ కలిసి భవనంలో ఉన్నవాళ్ళందరినీ బయటకు తెచ్చేశాం. లేకపోతే, కనీసం ఓ వందమంది ప్రాణాలు కోల్పోయేవాళ్ళు. ఇక్కడ ఆనాటి పరిస్థితి ఇది.

ఆ రోజున కలెక్టరు వచ్చి నన్ను ప్రశంసించాడు. నేను పని చేసింది ఆయన మెప్పుకోసం కాకపోయినా, అది నాకు కలిసొచ్చింది.

కాలనీలో ఉన్న అమ్మాయిల్నీ, అమ్మల్నీ, అమ్మమ్మల్నీ సమీకరించటానికి బాగా ఉపయోగపడింది. నా మాటకు విలువ పెరిగింది.

విప్లవసంఘ నాయకత్వం నాకప్పగించిన బాధ్యతని నెరవేర్చటానికి దీన్ని చక్కగా ఉపయోగించుకుంటున్నాను. అగ్నిప్రమాదానికి షార్ట్ సర్క్యూట్ కారణం అని పోలీసులు నిర్ధారించినట్టు పేపర్లలో వచ్చింది.

ఆ ఇంటికి ఇన్నేళ్ళుగా కరెంట్ ఎక్కడవుందని షార్ట్ సర్క్యూట్ ఏర్పడుతుందీ! ఎవరైనా వింటే నవ్వుపోతారు.

అగ్నిప్రమాదం జరిగిన మర్నాడు తెలిసిందీ అది సౌదామిని వాళ్ళ ఇల్లని...! అప్పుడే మొదటిసారిగా సౌదామిని దివ్యమంగళస్వరూపాన్ని చూశాను. సాధారణంగా వ్యక్తులకు ఇలాంటి విశేషణాలు వాడే అలవాటు మాకుండదు.

దివ్యమంగళ స్వరూపంలాంటి పదాలు ఫ్యూడల్ వ్యవస్థ అవశేషాలని మా నమ్మకం. కానీ, మా సౌదామినిలో ఉన్న ఏదో ఆకర్షణశక్తి నా చేత అలా అనిపింపచేసింది. సౌదామిని...! ఎంత అందమైన పేరూ... ఎంత సుందరమైన రూపూ... ఎంత మహోన్నత వర్చస్సూ...

తనలో ఏ మాత్రం మార్పులేదు. అప్పుడెలా ఉండెదో ఇప్పుడూ అలానే ఉందేదాన్ని! ఎన్నాళ్ళకు చూడగలిగానో దాన్ని!

అప్పుడప్పుడూ సౌదామినిని చూడాలని అనిపించేదిగానీ, ఆ అడవి బతుకులో అది సాధ్యం అవుతుందా...? ఇన్నేళ్ళలో నేను అడవి దాటి బయటకు రాలేదు. అడవిలోకొచ్చే అవసరం సౌదామినికి లేదు.

ఇలాంటి సంఘటనలు యాదృచ్ఛికంగా జరుగుతుంటాయి. కానీ, సామాన్యమానవులు వీటినే దైవికంగా జరిగిందని భావిస్తారు.

కాకతాళీయాలు కూడా ఒక్కోసారి నమ్మశక్యం కానంత గొప్పగా ఉంటాయి. ఒక తాటిచెట్టు మీద కాకి వాలింది. సరిగ్గా అదే సమయానికి, పండి పక్వానికొచ్చిన ఒక తాటి పండు రాలింది.

ఆ చెట్టునీడన ఒక బాటసారి ఎవడో విశ్రాంతి తీసుకుంటున్నాడు. రాలిన తాటిపండు తిన్నగా వచ్చి అతని నెత్తిన పడింది. అతను అక్కడికక్కడే మరణించాడు.

కాకి వాలటం వలనే తాటిపండు రాలిందనుకుంటే దాన్ని దైవికం అంటారు.

పండిన తాటిపండు రాలిపడబోతోంది. అది రాలింది.

కాకి వాలింది వరుసగా, వేర్వేరుగా ఒకేసారి జరిగిన సంఘటనలివి. ఇది కాకతాళీయం, అంటే కాకి తాటిచెట్టుమీద వాలినప్పుడు జరిగిన కథ. కాకి వచ్చి వాలినందువలన జరిగింది కాదు.

శ్రీనగర్ కాలనీలో మా అత్తగారింట్లోకి నేను వచ్చినప్పుడు జరుగుతున్న వరుస సన్నివేశాలివి. ప్రతి సన్నివేశంలోనూ కొన్ని సంఘటనలుంటాయి. కాకి వచ్చి వాలటం సన్నివేశం, పండు రాలటం, బాటసారి మరణించటం వరుస సంఘటనలు.

జనజీవనంలో కొచ్చిన తరువాత ఈ వరుస సంఘటనలు నన్ను కూడా ఊపిరి సలపనీయటం లేదు. వాటిలో కొన్ని బాటసారి మరణంలాంటి పీడకలలూ ఉన్నాయి. సౌదామినితో కలయిక లాంటి ఆనందదాయకమైనవీ ఉన్నాయి.

నాకు మహదానందం కలిగించిన అంశం ఇంకొకటుంది... సౌదామిని, ఈ కోట్ల రూపాయల ఆస్తి తన చేతికొచ్చిన వైనం అంతా చెప్పి, "ఇంత ఆస్తికి నేను హక్కుదారుని కాదు, సంరక్షకురాలిని మాత్రమే" అంది. అదీ నన్ను అబ్బురపరచిన విషయం.

సౌదామినికి నేను స్నేహితురాలినని చెప్పుకోవటం నాకు గర్వంగా అనిపించింది.

"నలుగురికి ఉపయోగపడే కార్యక్రమాలు చేస్తే, నీ లక్ష్యానికో ఫలితం ఉంటుందీ" అన్నాను. సౌదామిని వెంటనే అందుకు అంగీకరించింది.

"ఇన్నాళ్ళూ ఈ ఇంటిని ఆశ్రయించి, రిక్షావాళ్ళూ, రోడ్డు కూలీలు, బిచ్చగాళ్ళూ ఎందరో జీవిస్తూవచ్చారు. వాళ్ళందరినీ వెళ్ళగొట్టటం నాకిష్టంలేదు.

అందుకని, ఈ భవనంలో ఒక వృద్ధాశ్రమాన్ని ఏర్పాటుచేస్తాను. బిడ్డల ఆదరణకు దూరమైన తల్లిదండ్రుల్ని ఇక్కడ చేరదీస్తాను.

అనాథ బాలబాలికల్ని చదివించటంలాంటివి చేస్తే శాశ్వత ప్రయోజనాన్నిచ్చేవిగా ఉంటాయి" అంది.

అది మంచి ఆలోచన అని 'సౌదా' ని నేను ప్రోత్సహించాను.

"చేతిపరిశ్రమలు ఏర్పరిస్తే దిగువతరగతి నుండి మధ్యతరగతి ఆడవాళ్ళకూ, వృద్ధులకూ పని కల్పించవచ్చు.

వాళ్ళు ఇళ్ళలో కూర్చునే ఉత్పత్తుల్ని తయారుచేస్తారు.

మనం వాటికి మార్కెటింగ్ కల్పించగలిగితే, ఆ రాబడితో మహిళలు, వృద్ధులూ ఎంతో మంది స్వయం పోషకాలవుతారు. స్వయం ప్రకాశులవుతారు కూడా... నువ్వు సహకరిస్తానంటే ఈ ప్రాజెక్టు చేపడతాను అనడిగింది సౌదామిని, సౌదామిని అందనంత ఎత్తుకు ఎదిగిందనిపించింది. నేను సంతోషంగా అంగీకరించాను.

"ఇది మా నాన్నగారి కల! ఎప్పటికైనా ఇక్కడ వృద్ధాశ్రమాన్ని నడపాలని ఈ భవంతిని ఇలా గదులు గదులుగా కట్టించారు. మేవంతా పుట్టి పెరిగిన ఈ ఇంట్లోకి మళ్ళీ అడుగుపెడతానని అనుకోలేదు.

ఈ డబ్బుమీద నాకు వ్యామోహం లేదు. నాన్నగారి ఆశయాన్ని నెరవేర్చాలనేదే లక్ష్యం..." అన్నది సౌదామిని.

అగ్నిప్రమాదానికి తగలబడిన ఆ ఇంటిని రిపేర్ చేయించటం మొదలుపెట్టింది. త్వరగా వృద్ధాశ్రమాన్ని ప్రారంభించాలని అది ఉవ్విళ్ళూరుతోంది.

అందుకోసం ముందుగా తను మేనేజింగ్ ట్రస్టీగా ఒక ట్రస్టు ఏర్పాటు చేయాలనుకుంది.

ఈ కేసు గెలవటానికి కారణమైన లాయరు సదాశివను ఛైర్మనుగా ఉండాలని కోరింది. నన్ను ట్రస్టీగా ఉండాలని కోరింది. అలాంటివి నా ఒంటికి సరిపడవని చెప్పాను.

కానీ, తను వినలేదు. బలవంతంగా ట్రస్టుని రిజిష్టరు చేయించటానికి నన్ను రిజిస్ట్రారు ఆఫీసుకు తీసుకెళ్ళింది. అక్కడికి వెళ్ళాక ట్రస్టులో సభ్యుల పేర్లు చూశాను.

ఆశ్చర్యం... కుంతల పేరుకూడా కనిపించింది.

"కుంతల నీతో టచ్చిలో ఉందా! ఎక్కడుంటోంది..." అనడిగాను ఆత్రంగా!

"ఈ మధ్య అది ఉత్తరం రాసింది. ముంబై నగరంలో ఉంటోందిట, వెంటనే రమ్మని చెప్పాను. ఇప్పుడో ఇంకాసేపటికో వస్తుంది" అంది.

యాదృచ్ఛికాలు ఇంత గమ్మత్తుగా ఉంటాయా... అని ఆశ్చర్యపోయాను.

నాకైతే అంతా విఠలాచార్య సినిమా చూస్తున్నట్లు అనిపిస్తోంది.

మా కుంతలకు స్వాగతం చెప్పటానికి శాకుంతలపక్షులు ఎగురుకుంటూ వచ్చి సంబరాలు చేస్తున్నట్టు గాంధీనగరం వెల్‌కం హోటలు సెంటరు ఆ రోజు జనంతో చాలా సందడిగా ఉంది. నాకైతే ఆత్రం ఆగటంలేదు. కుంతలను ఎప్పుడు చూస్తానా...అని!

ఎవరో పరకీయ తన భర్త రాకకోసం ఎదురుచూస్తున్నదానిలా... రిజిస్ట్రారు ఆఫీసులోంచి బయటకొచ్చి రోడ్డు మీద నిలబడ్డాను. చాలాసేపు అలానే నిలబడ్డాను.

మనసు ఇంత ఆత్రపడుతున్నది ఎందుకో నాకు అర్థం కావట్లేదు. ఈ మనోభావాల్ని మార్క్సిజంతో కొలవటం అసాధ్యం. మా లలితక్క చెప్పేది...

'ఫ్రాయిడ్, మనసుని మాత్రమే పట్టించుకొని సమాజాన్ని వదిలేశాడు. మార్క్సుసమాజాన్ని మాత్రమే పట్టించుకుని మనిషి మనసుని వదిలేశాడు."

"ఫ్రాయిడ్ నీ, మార్క్సునీ కలిపి చదివితేనే సమాజంలో మనిషి మనసు కలిసి నిర్వహించే పాత్ర అర్థం అవుతుంది.

ఆఫ్టాల్ హ్యూమన్ ఈజ్ ఎ సోషల్ యానిమల్" అని, కానీ, అలా చేస్తే, మార్క్సుకు సమానంగా మరో వ్యక్తిని తెచ్చినట్టవుతుంది కదా!

అందుకని మార్క్సునీ, ఫ్రాయిడ్‌నీ కలిపితే కుక్కపిల్లలు పుడతాయని లలితక్క మీద విరుచుకుపడ్డారు మావాళ్ళు.

నా మట్టుకు నాకు ఫ్రాయిడ్‌ని మార్క్సుకోణంలో చదివితే కొత్త విషయాలు వెలుగులోకి వస్తాయని అనిపిస్తుంది.

ఇంతకీ కుంతల కోసం ఎందుకింత వెంపర్లాడిపోతోంది మనసు...?

ఇదంతా నా మనసు నిర్వహిస్తున్న మనోవ్యాపారమే! ఇందులో నా పాత్రలేదు. కాసేపు మనసుని స్వేచ్ఛగా వదిలేస్తే ఇలాగే జరుగుతుందని అనుభవపూర్వకంగా అర్థం అవుతోంది.

రోడ్డుమీద నిలబడి ఎదురుచూపులు చూడ్డం నాకు ఇష్టం లేదు. మోహావేశాలకు నేను అతీతురాలినని నా మీద నాకో నమ్మకం.

కానీ, మనసు చెప్పినట్టే నడుచుకోవటాన, తప్పిపోయిన ప్రియుడి రాకకోసం ఎదురు చూసే ప్రియురాలిలా ఇలా అయిపోయాను...!

విస్తళ్ళు వేసిన తర్వాత వడ్డన ఆలస్యం అయితే కలిగే చిరాకులాంటి ఒక పరిస్థితి ఇది! ఈ ప్రేమలూ, అభిమానాలూ అన్నీ మనిషిని అజ్ఞానాంధకారంలోకి నెట్టేవేనని నా నమ్మకం నమ్మకాలు వేరు, వాస్తవాలు వేరు, అనుభవంలోకి వచ్చినప్పుడు వాస్తవాలు మారిపోతూ వుంటాయి.

-- XXX --

# 14. కామేశం

నేను కామేశాన్ని!

భగవంతుడు రాస్తున్న 'సౌదామిని' అనే నవలలో ఒక పాత్రని ముఖ్యపాత్రనే!

నవలా ప్రారంభంలో సుగంధాలు వెదజల్లినట్టే చిత్రించాడు నన్ను భగవంతుడు. ముగింపుకొచ్చేసరికి కరివేపాకులా మార్చేశాడు.

ఆ రాత్రిపూట గుడ్లగూబలూ, గబ్బిలాల చేతుల్లో చిక్కుకుంటుందేమోనని సౌదామినికి ఆశయం ఇచ్చి ఆసరాగా నిలబడినందుకు సౌదామిని మనసనే ఇంటివసారా చూరుకు నన్ను తలకిందులుగా వ్రేలాడేశాడు... నాకు సౌదామిని పైన ఎలాంటి భేదాభిప్రాయమూ లేదు.

నా విభేదం అంతా నన్ను ఒక పాత్రగా సృష్టించిన ఆ రచయిత మీదే!

సౌదామినితో పరిచయం అయి పట్టుమని పదిరోజులు కూడా కాలేదు.. చాలా స్వల్పకాలంలోనే అనేక పరిణామాలు జరిగాయి...

భగవంతుడు రాసే నవల కదా... ప్రతి గంటా ఒక నిమిషంలా పరిగెట్టింది కాలం... ఈ పదిరోజుల్లోనే పదేళ్ళ అనుభవాన్ని పొందేస్తున్నాయి పాత్రలన్నీ! బహుశా చెయ్యి తిరిగిన రచయిత కావటంవలన కాబోలు, అన్నీ అతిమంచి పాత్రలే కనిపిస్తున్నాయి.

నా ఒక్కడి పాత్రే ఎంచేతనో ఒక వేగబాండ్‌లాగా మార్చాడు. మిగిలిన పాత్రలముందు బిచ్చగాడిలాగా చేశాడు రచయిత నన్ను!

బహుశా పెళ్ళాంతో పోట్లాడిన రోజున ఔటాఫ్ మూడ్స్‌లో ఉండగా నా పాత్ర చిత్రించాడేమో...! నా మానాన నా బతుకేదో బతికేస్తుంటే నా చేతిలో దొంగనోటు పెట్టి, నన్ను సౌదామినికి పట్టించాడంటే ఏమనాలి?

రచయితలు ముందు హీరోలుగానే పాత్రల్ని ప్రవేశపెడ్తారు. అంతమాత్రానికే ఆ పాత్రలు తాము హీరోలం అనుకుని మురిసిపోకూడదు... పోను పోనూ ఆ హీరో యాంటీహీరో అయిపోతాడు. ఆటోడ్రైవరు హీరో అయిపోతాడు. నవలల్లో పాత్రలకే నోళ్ళుంటే, తమ రచయితల్ని ఎన్ని పాత్రలు ఎన్ని రకాలుగా తిట్టుకుంటాయో...?

విశ్వనాథ సత్యనారాయణగారు వేయిపడగలు నవల్లో రామశాస్త్రి అనే పుణ్యాత్ముడైన ఒక పెద్దమనిషిని సృష్టించాడు. మొదట ఆయన పెద్ద మనిషి! తరువాత అతనికి నలుగురు ఆడాళ్ళతో అక్రమసంబంధం కలిపి, పరమభ్రష్టుణ్ణి చేస్తాడు.

అందరూ రామశాస్త్రిని తన్ని తరిమేస్తారు. గుళ్ళో ప్రసాదం తిని బతుకుతూ, ఆ గుడి అరుగుమీదే దిక్కులేని కుక్కచావు చచ్చినట్టు చిత్రించాడా పాత్రని విశ్వనాథవారు.

ఒక పెద్దమనిషి పాత్రని ఇంత ఘోరంగా మారిస్తే ఆ రామశాస్త్రి మాత్రం సంతోషిస్తాడా... శపించడూ!

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కులాలకు చెందిన నలుగురు అమ్మాయిల్నీ పెళ్ళి చేసుకొని రామశాస్త్రి సర్వమానవసమానత్వాన్ని సాధించాడట...

ఆయన బహువివాహాలను మినహాయిస్తే, అంత గొప్ప పాత్ర ఇంకొకటి లేదట... విశ్వనాథ వారి భక్తులు ఆ పాత్రని అలా ట్విస్టు చేశారు.

మా నవలలో నా పాత్ర రోజురోజుకీ దిక్కుమాలిందవుతోంది. నాకైతే అలాంటి ట్విస్టులు నచ్చవు. నచ్చినా రచయిత ఇచ్చేలా లేదు.

కాండక్టు సర్టిఫికెటు పుచ్చుకెళ్ళి చూపించి నా అంతగా నేను సౌదామిని ఆశ్రయం అడిగానా? నా చెయ్యి కమిలేలా గట్టిగా పట్టుకొని వదలకుండా నాతోనే ఉండిపోయింది సౌదామిని.

నేను యాంటీహీరో ఎలా అవుతాను...?

కుంతల, కాళీ, లాయర్ సదాశివ... ఒకరిని మించినవారొకరు, అన్ని గొప్ప కేరెక్టర్లముందు నిజంగా వేగబాందుని నేనే!

ఈ నవలలో నాది కెటలిష్టు పాత్ర,

కథ సాగటానికి ఒక ప్రేరకంగా నిలిచే పాత్ర అంతే!

నన్ను ఎలా ముగిస్తాడో ఈ రచయిత, రామాయణంలో రాముణ్ణి అడవులకు పంపించే సమయంలో నదిని దాటించిన గుహుడిలాంటివాణ్ణే నేను. మధ్యలో భరతుడు వస్తే, రాముడి మీదకు దాడికి వచ్చాడనుకుని కత్తి దూసిన ధీరోదాత్తుడు గుహుడు.

అయితే మాత్రం ఏం...? గుహుడు రామాయణంలో చివరి దాకా ఉన్నాడా? ఆ అవసరం తీరగానే వాల్మీకి ఆ పాత్రని కరివేపాకులా తీసి పక్కనపడేయలేదా...? అందాకా ఎందుకని నా అంతగా నేనే పక్కకు తప్పుకుంటున్నాను.

కేవలం మా రచయితగారి సౌలభ్యం కోసమే!

సౌదామినిని ప్రేమిస్తున్న సంగతి చెప్పేందుకు నేను వెళ్ళినట్టు, అది చూసి ఆ ఆటో డ్రైవరు నా మీద దాడి చేసినట్టు, మేమిద్దరం కొట్టుకున్నట్టు అనవసరమైన సీన్లన్నీ సృష్టించి నా పాత్రని మరింత ఖంగాళీ చేసివుండేవాడు మా నవలా రచయిత.

లేకపోతే, ఆ ఇంట్లో ఏ నెక్లెసో, ఉంగరమో పోయినట్టూ ఆ నేరాన్ని ఆటోడ్రైవరు నా మీదకు నెట్టినట్టూ రాయొచ్చు.

ఆ నగలు వేరే బీరువాలో ఉన్నాయని, పోలేదని సౌదామిని వాటిని తెచ్చి చూపించి, అనవసరంగా నోరుపారేసుకున్నందుకు ఆటోడ్రైవరునే కేకలేసినట్టు కూడా రాయొచ్చు.

కానీ, అందరూ వెళ్ళిపోయాక "కామేశం... ఎందుకు చేశావీపని...?" అని

అడిగినట్టు రాస్తే నా పరువేం కావాలి...? 'ప్రేమనగరు' సినిమాలో వాణిశ్రీలా నోట్లో గుడ్డలు కుక్కుకుని కాసేపు ఏడ్చి ఆ యింట్లోంచి నేను బయటకు పోవాల్సివస్తుంది కదా! అంత్యనిష్టూరంకన్నా అది నిష్టూరం మేలు... అందుకే నా ఈ నిష్క్రమణం.

రేపటి గురించి ఆలోచించే తత్వం నాకు లేదనీ, ఈ పూట గడిస్తే చాలనుకుంటానని నా గురించి అందరూ అంటారు. మా లైఫూ, మా మూడో మిత్రుడు కూడా అలానే ఉన్నారు. అందుకే, ఈ సారి ఎంతో ముందుచూపుతో వెడ్తున్నాను.

రిజిస్ట్రేషను రోజున నన్ను కూడా రమ్మని పిలిచింది సౌదామిని.

నాకు ట్యూషను క్లాసులున్నాయి... వీలుచూసుకొని వస్తానని చెప్పాను.

'ఇంకా ఆ ట్యూషన్లెందుకు మానేయి' అంది సౌదామని

'మానేశాక నేను యాచకుడిగా మారిపోతానేమో' అన్నాను.

నేనుండగా నీకలాంటి పరిస్థితి రాదులే... అని నవ్వింది.

నిజమే! ఎవరూ అందనంత ఎత్తుకు ఎదిగిన మేరునగధీర సౌదామిని.

ఎంతటివాడైనా ఆమె ముందు తల వంచాల్సిందే!

'సౌదా మినీ' శరణాలయానికి సంబంధించి కలెక్టరుగారి దగ్గరకు ఇలా వెళ్ళి అలా అనుమతులు, నిధులు మంజూరులు సాధించుకొచ్చిందంటే, అది ఇంకొకరి తరమా?

కోర్టు కాయితాలు చేతికొచ్చాక సౌదామిని విశ్వరూపం చూపించింది.

ఆస్తిగొడవలకు కారకులైన శత్రువర్గాన్ని మళ్ళీ దరిదాపుల్లోకి రాకుండా చేసింది.

లాయరు సదాశివగారు ఆఖరికి ఆమె వ్యక్తిగత లాయరుగా మారిపోయాడు.

పెద్ద పెద్ద అధికారులు రోజూ వచ్చి వరుసకట్టి ఆమెను పలకరించి వెడ్తున్నారు. పత్రికల వాళ్ళొచ్చి సౌదామిని ఇంటర్వ్యూలు తీసుకుంటున్నారు. రోజుకో స్టోరీ రాసి, మంచి పబ్లిసిటీ ఇస్తున్నారు. శ్రీనగర్ కాలనీలో సౌదామిని ఇప్పుడు సూపర్‌స్టార్. ఆమె మాటకు ఎదురులేదు.

మొగుడు తాగి ఇంటికొస్తే జంకూగొంకూ లేకుండా ఆ మొగుణ్ణి వదిలేయాలని ప్రబోధించింది. అలా వ్యక్తిత్వాన్ని ప్రదర్శించిన మహిళలను తాను ఆదుకుంటానని ప్రకటించింది.

స్త్రీని అణగదొక్కేవాళ్ళని పరిత్యజించటమే పరిష్కారం అంది.

పెళ్ళాం వదిలేసిన మొగుడని అనిపించుకోవటమే ఆ మగాడికి పెద్ద శిక్ష... అని అన్నప్పుడు ప్రజల్లో మంచి స్పందన వచ్చింది.

కాళీని, మరికొందరు ఆడవాళ్ళనీ ఇంటింటికీ పంపించి డోర్ -టు-డోర్ సర్వే చేయించింది. కమీషనర్‌గారు పోలీస్ సహకారం ఇచ్చారు.

ప్రతి ఇంటికీ వెళ్ళి, ఆ ఇంట్లో ఆడవాళ్ళు ఎందరున్నారు...?

పెళ్ళికాకుండా ఉండిపోయిన ఆడపడుచులున్నారా?

వాళ్ళు ఏవైనా కష్టాలుపడ్తున్నారా...?

భర్తల్ని కోల్పోయి వెట్టిచాకిరీ చేస్తూ పుట్టింట జీవిస్తున్న విధవల పరిస్థితి ఏవిటీ...?

కోడళ్ళ దాష్టీకానికి బలైన అత్తలు, అత్తగారి ఆరళ్ళకు అల్లల్లాడుతున్న కొత్తకోడళ్ళు ఏయే ఇళ్ళలో ఉన్నారు...? భర్తలు పెట్టే హింసలు భరిస్తున్న ఆడాళ్ళ సంఖ్య ఎంత? వాళ్ళందరికీ ఎలాంటి సహకారం కావాలీ అనేవి కనిపెట్టటం ఈ సర్వే లక్ష్యం.

ఉచిత న్యాయసహాయం అందించటానికి క్రిమినల్ లాయర్ సదాశివ ముందు కొచ్చాడు. చిన్నప్పుడు సౌదా, కుంతలా, కాళీ, లాయరు అందరం క్లాసుమేట్లేనట!

ఇలా రెండు మూడుసార్లు ఇంటింటికీ వెళ్ళి ఎంక్వయిరీలు చేస్తుంటే, గృహహింసకు తలపడేవారిలో భయం కలుగుతుంది. అది వారిలో మార్పుకు దారితీస్తుంది... అదీ సౌదామిని నమ్మకం. నిజానికి ఈ ప్రాజెక్టుని ప్రభుత్వమే చేపడితే గృహహింస ఖచ్చితంగా ఆగుతుంది.

"ఎటుతిరిగీ ఇంటింటికీ మలేరియాశాఖవాళ్ళు నెలకు ఒకట్రొండుసార్లు వచ్చి కుశలాలు కనుక్కొని వెడ్తున్నారు కదా! అలాగే, అధికారాలు కలిగిన ఒకరిద్దరు మహిళలు ఇంటింటికీ వచ్చి గృహహింస గురించి అడుగుతుంటే హింసపెట్టేవారిలో భయం, హింసకు గురి అవుతున్నవారిలో ఆత్మవిశ్వాసం కలుగుతాయి... అని వివరించింది సౌదామిని.

పోలీసు కమీషనర్‌గారు ఈ వాదాన్ని ఒప్పుకున్నారు.

ప్రయోగాత్మకంగా స్వచ్ఛంద సంస్థల చేత దీన్ని నడిపించాలనుకున్నారు.

ఆ బాధ్యతని సౌదామిని తీసుకుంది. కాళీ ముందుపీటీన నడిచింది.

సౌదామిని దగ్గర ఇలాంటి ప్రాజెక్టులెన్నో ఉన్నాయి. అమ్ములపొదిలోంచి అస్త్రాలను ఒక్కటొక్కటే తీస్తోంది. ఒక్కో అస్త్రమూ బ్రహ్మాస్త్రంలా పేల్తోంది.

ఇప్పుడా ఇల్లు భూత్ బంగ్లా కాదు, భూతలస్వర్గం. నాకా స్వర్గంలో నివసించే అదృష్టం లేదేమో... నా గతాన్ని సౌదామినికి చెప్పివుంటే బావుండేది. మొదటిరోజే పొమ్మని ఉండేది. అక్కడితో రామ్‌రామ్ అయిపోయేది. కానీ, సౌదామిని నాకా అవకాశం ఇవ్వలేదు. నన్ను ఏనాడూ మాట్లాడనిచ్చేది కాదు. అందుకని నా గత జీవితాన్ని ఆమెకు చెప్పుకునే అదృష్టం కోల్పోయాను. నిజమే! ఆ మంచి మనుషుల మధ్య జీవించే అర్హత నాకు లేదు.

భార్యకు ప్రసవ సమయంలో వైద్యం అందించే విషయాన్ని మరిచిపోయి, పేకాట్లో మునిగిపోయిన ఫలితంగా అనుకూలవతి అయిన భార్యని కోల్పోయిన దౌర్భాగ్యుణ్ణని చెపితే ఆమె నన్ను సహిస్తుందా...?

అనునిత్యం పెళ్ళాన్ని వేధించుకొనితినేవాణ్ణని తెలిస్తే ఆ శరణాలయంలోకి నన్ను అడుగుపెట్టనిస్తుందా?

ఆరేళ్ళక్రితం పండంటిబిడ్డని ప్రసవించి, నా భార్య మరణిస్తే, ఆ బిడ్డ మొహమైనా చూడకుండా దానిమానాన దాన్ని వదిలేసి ఈ బెజవాడ వచ్చేసి నిజంగానే వేగబాండు జీవితాన్ని గడుపుతున్నానని చెపితే నా ముఖం మళ్ళీ చూస్తుందా...?

సౌదామినిలాంటి ఉత్తమురాలిని నాలాంటివాడికి దూరంగా వుంచాలనే ఇంగితం నన్ను సృష్టించిన మా నవలా రచయితకు లేకపోయినా, నాకుంది.

అందుకే గౌరవంగా తప్పుకుంటున్నాను.

నీ జీవితంలో మొదటిసారి ఒక గౌరవప్రదమైన పని చేస్తున్నానని భావిస్తున్నాను. సౌదామినితో ఈ స్వల్పకాల సాంగత్యం వలన నా తప్పు నేనే తెలుసుకోగలిగే శక్తి నాకు సమకూరింది. సజ్జనసాంగత్య ఫలితం ఇదన్నమాట!

అందుకే, మా అత్తయ్య ఇంటికి బయల్దేరాను. నా వలన కలిగిన కష్టానికి ఆ పెద్దావిణ్ణి క్షమించమని అడిగితే తప్ప నా మనసులో బాధ దిగదు.

నా బిడ్డను చూసుకోవాలనిపించింది. దాన్ని ఎత్తుకొని ముద్దాడాలని మనసు ఆరాటపడింది. "నేను మీ నాన్ననమ్మా! ఇంకెప్పుడూ నిన్ను వదిలివెళ్ళను. నీతోనే ఉంటాను" అని చెప్పుకోవాలనిపించింది. అత్తారింటికి బయల్దేరింది బస్సు.

అత్తగారిది సిరిగలవారి ఇల్లేమీ కాదు, ఆ ఇంటిముంగిట నేను సిరిమల్లెనూ కాను, వెళ్ళాక తెలిసింది... బిడ్డను పొత్తిళ్ళలో పెట్టుకుని అత్తమ్మ నన్ను వెదుకుతూ బెజవాడ వచ్చిందని!

ఎక్కడుందో తెలియదు, ఏవయ్యిందో తెలీదు...

రచయిత! నువ్వే గెలిచావు.

బెజవాడ జీవితాన్ని నాకు నువ్వు రాస్తే, తుడిపేయగలనని అనుకోవటం ఎంత భ్రమ!

రిజస్ట్రేషనుకు వెళ్ళకుండా సౌదామిని ఆదేశాన్ని దిక్కరించాను.

అలా చివరిక్షణంలో ఎగ్గొడితే అప్పటికప్పుడు ఆమె ఏం చేయగలుగుతుందీ...?

బహుశా నా స్థానంలో బోర్డు ఆఫ్ ట్రస్టీస్ సభ్యుడిగా అప్పటికప్పుడు ఆటోడ్రైవరు శివా పేరు మార్చివుండొచ్చు. మొత్తం ప్రాజెక్టు నా కారణంగా దెబ్బతినకూడదు కదా! సాయంత్రానికి బెజవాడొచ్చేశాను. తిన్నగా నా రూముకే వెళ్ళాను.

సౌదామిని శరణాలయానికి వెళ్ళేందుకు మనసొప్పలేదు వెళ్ళినప్పుడల్లా గిల్టీకాన్షస్ నా గుండెల్ని రంపంతో కోసేస్తోంది. దాన్ని నేను తట్టుకోలేను. ఇంక సౌదామిని గురించి ఆలోచించటం మానేసి, నా కూతురు గురించి ఆలోచించటం అవసరం.

అత్తమ్మ ఈ ఊళ్ళో ఎక్కడుందో...?

-- XXX --

# 15. సౌదామిని

అందంగా ఉందని ఊళ్ళో ప్రతిఒక్కరూ దానివంకే కన్నార్పకుండా చూస్తూండటంతో చివరికి ఆ అమ్మాయి గ్రామదేవత అయిపోయిందట!

గాథాసప్తశతిలో ఒక చిన్న గాథ ఇది. దీన్నే మనవాళ్ళు దిష్టి అంటారు. దిష్టి తీసేస్తే అదొక ఉపశమనం. శకునాలు బాగోకపోయినా, దిష్టి తగిలినా చేపట్టిన పనులు చెడతాయని మన పెద్దవాళ్ళ నమ్మకం.

చంటిపిల్లలకు బుగ్గన చుక్క పెట్టినా, ఖరీదైనా మేడ కట్టుకుంటున్నప్పుడు గడ్డితో చేసి, ప్యాంటూ చొక్కా తొడిగి అశ్లీలంగా ఒక దిష్టిబొమ్మ పెట్టినా అదంతా దిష్టి తగలకుండా ఉండాలనే కదా!

కాకపోతే ఈ రోజుల్లో రాజకీయకక్షలు తీర్చుకోవటానికి దిష్టిబొమ్మల్ని తయారుచేసి తగలపెడుతున్నారు.

ఈ విధంగా దిష్టిబొమ్మల గిరాకీ పెరిగిందిప్పుడు, కొన్నాళ్ళకు దిష్టిబొమ్మలు అమ్మే షాపులు విరివిగా వచ్చేస్తాయి. ఈవెంట్ మేనేజర్లు జనాన్ని పోగేసి ఊరేగింపు జరిపి, దిష్టిబొమ్మ తగలపెట్టినందుకు ఇంత... అని చార్జి చేసే పరిస్థితులు కూడా దాపురిస్తాయి.

ఎవరైనా సరే మనకు వ్యతిరేకంగా ఉంటే, వాడి దిష్టిబొమ్మను తగలపెట్టించే కార్యక్రమాలు ఇప్పటికే సాగుతున్నాయి.

నాకైతే శకునాలు, దిష్టి వగైరాల మీద నమ్మకం లేదు గానీ... ఇది కేవలం సెంటిమెంటని కొట్టిపారేయటానిక్కూడా వీల్లేదేమో అనిపిస్తుంది ఒక్కో సంఘటన జరిగినప్పుడు, ఈ రోజు ప్రొద్దున్నే తయారై ఇంట్లోంచి బయటకు వస్తూండగానే, ఎవరో పెద్దగా తుమ్మారు. నేను పట్టించుకోకుండా బయల్దేరిపోయాను.

అంతలో ఒక విధవావిడ ఎదురొచ్చి, "ఎక్కడికెళ్తున్నావమా...?" అనడిగింది. 'విమానాశ్రయానికి' అని నవ్వుతూ చెప్పాను. కొంచెం ముందుకెళ్ళగానే ఒక శవయాత్ర ఎదురైంది.

సందు తిరిగి సాంబమూర్తి రోడ్డులోకి వచ్చామో లేదో, ఎవడో పిల్లాడు మా కారుకే అడ్డం వచ్చాడు. శివా చాకచక్యంగా కారును పక్కకులాగి ఆ పిల్లాడిని ఏ ప్రమాదం జరక్కుండా తప్పించాడు.

నేను కారు దిగి ఆ పిల్లాణ్ణి ఎత్తుకొని వాళ్ళ ఇల్లెక్కడో కనుక్కొని ఇంట్లోకి వెళ్ళి పిల్లాణ్ణి అప్పగించివచ్చాను.

"మేడమ్! ఈ పూట శకునం బాగాలేదు! ఇంటికెళ్ళి కాళ్ళు కడుక్కొని కాసేపు కూచొని బయల్దేరుదాం" అన్నాడు శివా! నేను అతన్ని కేకలేశాను.

ఈ యుగంలో కూడా ఇంకా మూఢనమ్మకాలేవిటి శివా...? అన్నాను. ఎన్నిదినములో వేచి మంచిమూర్తము చూసి – బయలుదేరబోవ 'హాచ్చి' అన్న ఆరుద్రగారి కూనలమ్మపదం ఒకటి గుర్తుకొచ్చింది.

మంచి శకునం, మంచి ముహూర్తంకోసం ఎదురుచూస్తూ రోజులు గడిపేస్తే, అన్నీ కుదిరినా బయల్దేరే సమయానికి నీకే తుమ్మొస్తే ఏం చేస్తావు? వెనక్కిచూడకు పద ముందుకు..." అని తొందర పెట్టాను. అతను అయిష్టంగానే కారుని పోనిస్తున్నాడు.

నా మనసంతా కామేశం గురించే ఆందోళనగా ఉంది.

'కామేశం! వెంటనే నువ్వు నీ దారి మార్చుకొని మా దారిలోకి రాకపోతే నీ దిష్టిబొమ్మ తగల బెట్టించాల్సి వస్తుంది...' అనుకున్నాను మనసులో!

తిన్నగా కామేశం ఇంటికి తీసుకెళ్ళమని చెప్పాను. ఆ ఇంటి తలుపు తాళం తీసే ఉంది. తలుపులు వేసివున్నాయి.

అంటే ఆ మనిషి ఇంట్లోనే ఉన్నట్టే కదా! నిన్ననంతా కనిపించకుండా అదృశ్యం అయి, గుట్టుచప్పుడు కాకుండా ఇంటికొచ్చి పడుకున్నాడు. కోపంగా వెళ్ళి తలుపుల్ని బడబడా బాదాను. ఖంగారుగా వచ్చి తలుపు తీశాడు. ఎదురుగా నేను....

"మీరా...?"

"మీరాని కాదు, సక్కుబాయిని! ఏం? మీరా అయితే నీకేమైనా అభ్యంతరమా...?"

"మీరాలు, బీరాలు, ఘోరాలు నాకు తెలియవు... నేను అత్యంత సామాన్యుణ్ణి!"

"ఏడ్చినట్టుంది నీ ప్రాస! త్వరగా బయల్దేరు..."

ఎక్కడికి?

గన్నవరం ఎయిర్‌పోర్టుకు కుంతలావాళ్ళు బెంగుళూరునుండి ఈ పూట ఫ్లైటుకు వస్తున్నారు. నిన్న రావటానికి ఫ్లైటు క్యాన్సిలయ్యిందట!

గడగడా చెప్పేశాను. తనేదో చెప్పబోతున్నాడు కామేశం.

ఉష్షంటూ నేను అతన్ని మాట్లాడనీయలేదు.

నిన్నంతా ఏమయ్యావు... రమ్మన్న సమయానికి ఎందుకు రాలేదు... నా దృష్టిలో ఇవన్నీ వ్యర్థప్రశ్నలు అడిగితే వచ్చే సమాధానం వలన ఒరిగేదేమీ లేనప్పుడు అడగటం దండగ.

అడగకుండా ఉండటమే అతనికి వేయగలిగిన శిక్ష.

"నేను ఇక్కడే ఉంటాను. నువ్వు త్వరగా రెడీ అయిపోయిరావాలి!" అంటూ బయటకొచ్చి కారులో కూర్చున్నాను.

నేను వందంకెలు లెక్క పెట్టే లోపు నువ్వు రావాలి... ఒకటీ... రెండూ... అంటూ అక్కణ్ణించే బిగ్గరగా అరిచాను.

నా అరుపుకు బెదిరి దఢాల్న తలుపులేసుకున్నాడు కామేశం. ఒకరు స్నానం చేస్తుంటే ఆ ఇంట్లో ఇంకొకరు ఉండటానికి వీలవదుకదా! చెప్పానుగా... అది చిరుగుతడిక తలుపులతో తాత్కాలికంగా అమర్చిన అటాచ్డ్ బాత్రూమ్ అని!

సాయంత్రం అతని సామానంతా మూటగట్టి అవతల పారెయ్! అందులో పనికొచ్చేదేదీ లేదు. ఆ ఇంటి ఓనరుకు 'కామేశం ఇల్లు ఖాళీ చేస్తున్నాడు' అని చెప్పు అన్నాను శివతో!

మొన్న నేను కారు కొన్నాక శివా నా దగ్గర డ్రైవరుగా చేరిపోయాడు. నమ్మకంగా పని చేస్తున్నాడు. కామేశమే మధ్య మధ్య అదృశ్యమై కాస్త ఇబ్బంది కలిగిస్తున్నాడు.

మళ్ళీ వెళ్ళి తలుపుకొట్టి త్వరగా రమ్మని హెచ్చరించమని శివను పంపించాను శివ అక్కడకు వెళ్ళేలోగానే కామేశం తలుపు తెరిచి బయటకొచ్చాడు.

మాసిన లాల్చీ, నలిగిన పైజామా మనిషి బాగా నలిగిపోయాడు. టైమ్ అప్పుడే పదయ్యింది.

ఇంకో గంట టైముంది. ఫ్లైటు రావటానికి, కామేశాన్ని కారెక్కించుకొని తిన్నగా పెద్ద బట్టల కొట్టుకు తీసుకుళ్ళాను.

అతనికి సరిపడ కుర్తా పైజమాలు ఓ అరడజను నేనే సెలెక్ట్ చేశాను.

"డ్రెస్సింగ్ రూములో ఒక జత తొడుక్కొని సరిపడ్డాయో లేదో చూడు... తొడుక్కుని అలానే బయటకు రా! నేనూ చూడాలి..." అన్నాను.

అచ్చుగుద్దినట్టు సరిపోయిందా డ్రస్సు ఇంక పద! ఆ దిక్కు మాలిన పైజమా లాల్చీ అక్కడే వదిలెయ్. ఇంటికి తీసుకురాకు. ఈ డ్రస్సుకు సరిపడ చెప్పులుకూడా ఉండాలి. చకచక పద... అవి కూడా తీసుకుందాం" అన్నాడు.

అంతలో షాపులో కుర్రాడు పై ఫ్లోరులో చెప్పుల సేల్ కూడా ఉందని చెప్పాడు.

చెప్పులు కొని బయటకు వస్తుంటే రేబాన్ కళ్ళజోళ్ళషాపు కనిపించింది. కూలింగ్ గ్లాసుల కళ్ళజోడు ఒకటి తీసుకుని పెట్టుకోమన్నాను.

రేబాన్ కళ్ళజోడు పెట్టుకొని అద్దంముందు నిలబడి ఒకసారి తనను చూసుకొని ఉలిక్కిపడ్డాడు కామేశం... ఆ కనిపించేది తనేనా... అనీ!

నిజంగా మన్మధుడిలా అనిపించాడా క్షణాన!

"చూసుకున్నది చాల్లే... బడాయి! అందగాడివే!..." అని సన్నగా నవ్వుతూ అతనికి మాత్రమే వినిపించేలా అన్నాను.

అతను పరిచయం అయ్యాక ఇన్నాళ్ళలో మొదటిసారి అతని ముఖంలో చిరునవ్వు చూశాను. మనిషి ముఖం చూస్తే, చేసిన తప్పు ఏదో తెలుసుకుని పశ్చాత్తాపపడ్డవాడిలా కన్పిస్తున్నాడు.

ఇంతకు మునుపు లేని కళ అతని కళ్ళలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. అది రేబాన్ కళ్ళజోడు వలన వచ్చింది కాదు. కళ్ళజోడు వెనుక తడిబారిన కళ్ళవలన వచ్చింది.

కామేశం మునుపటిలా కాదనీ, అతను మారతాడనీ, గిరీశం లక్షణాలు వదులు కుంటాడనీ, నాకెందుకో నమ్మకం కలుగుతోంది. ఎయిర్‌పోర్టుకు త్వరగా తీసుకెళ్ళమని శివాకు చెప్పాను. ఏలూరు రోడ్డున వెడితే ట్రాఫిక్ ఎక్కువని సాంబమూర్తిరోడ్డు మీంచి చుట్టుగుంట మీదుగా ఏలూరు రోడ్డుకు చేరుకున్నాడు శివా, నిడమారు వంతెనకూడా దాటింది కారు.

రోడ్డుపైన పెద్దగా వాహనాలు లేవు. దాంతో స్పీడుగానే పోతున్నాడు.

వంతెన దిగాక అవతల రోడ్డు మీంచి విజయవాడ వైపు వెళ్తున్న ఒక ట్రక్కు చటుక్కున రోడ్డు కటింగ్ దాటి మా కారుకు అడ్డంగా రాసాగింది.

అల్లంత దూరానే ఆ ట్రక్కువాడు ఇటు వస్తున్న సంగతి గమనించి, బాగా లెఫ్టుకు కట్ చేశాడు శివ అదే సమయానికి మా వెనకనుండి మరొక పెద్దలారీ మమ్మల్ని అంటుకొని వస్తూ లెఫ్టుకు తిరక్కుండా అడ్డుకోసాగింది. ఆలోచించి నిర్ణయం తీసుకునేంత సమయం లేదక్కడ.

వెనకాల లారీకి దారి ఇచ్చేందుకుగానీ, ముందు ట్రక్కును తప్పించుకుని పక్క నుండి వెళ్ళటానికిగానీ అవకాశం లేదని అర్థం అయిపోయింది. వెనకాల లారీవాడు వేగంగా వస్తూ అమాంతం లారీలోంచి దూకి అవతలకు దూకేశాడు.

ముందూ, వెనకా రెండు భారీ వాహనాల మధ్య మా కారు నలిగిపోయేందుకు ప్రణాళిక సిద్ధం అయ్యిందన్నమాట! ముందు సీట్లో డ్రైవరు పక్కన కూర్చున్న కామేశం రియల్ వ్యూ మిర్రర్‌లోంచి ఇదంతా గమనించాడు.

"శివా! రోడ్డు ఎడంపక్క డౌనులోకి కారుని తోసేయ్. ఏం ఫర్లేదు, సరిపడినంత మార్జినుంది..." అని అరిచాడు.

ఆ సరికే మా కారు లెఫ్టుకి వెళ్ళిపోయింది. మేం కంప్లీటుగా లెఫ్ట్ డౌనుకు వెళ్ళిపోయాం.

మేం అవతలకు తప్పుకోగలగటంతో వెనకాల లారీ రోడ్డుకు వస్తున్న ట్రక్కుముందు భాగాన్ని ఢీ కొట్టింది అంతే! ఆ ట్రక్కు పెద్దశబ్దం చేసుకొంటూ పక్కకు ఒరిగిపోయి గీమంటూ రోడ్డుమీద ఈడ్చుకుపోయింది.

దాని డ్రైవరు రక్తపుమడుగులో పడి, కాసేపు గిలగిలా కొట్టుకుని బిగుసుకుపోయాడు.

ఢీ కొట్టినవాడు కూడా ఆ లారీలోనే ఉంటే ఎట్టి పరిస్థితిలోనూ బతికేవాడు కాదు. దూకేసి బతికిపోయాడు. "మేడమ్! ఇది నిస్సందేహంగా మనపైన హత్యాయత్నమే! నేచురల్‌గా జరిగిన యాక్సిడెంటుగా చిత్రించాలని పథకం పన్నారు.

దేవుడు మీ పక్షాన ఉండటం మూలాన మీతో పాటు మేం కూడా సేవయ్యాం..." అన్నాడు శివా.

నెమ్మదిగా నేను ఆ షాకు నుంచి తెప్పరిల్లాను.

"మనం జాగ్రత్తగా ఉండాలి..." అంటున్నాడు కామేశం.

"అందుకే నామానాన మమ్మల్ని వదిలేసి నిన్న పారిపోయావు" అన్నాను కోపంగా!

కామేశం సిగ్గుపడి తలవంచుకున్నాడు.

'ఇంకెప్పుడూ వెళ్ళను' అంటున్నట్టు నా వంక చూశాడు. ఒక రకమైన అపరాధభావం అతని కళ్ళలో కనిపించింది.

యాక్సిడెంట్ జరిగినచోట ఎక్కువసేపు ఉండటం మంచిదికాదన్నాడు కామేశం. రోడ్డుసైడుకు దిగిపోయిన మా కారుని ప్రయాసపడి నెమ్మదిగా మళ్ళీ రోడ్డెక్కించాడు శివా!

మా వెనకాల వస్తున్న వెహికల్స్ కూడా మమ్మల్నే అనుసరిస్తూ రోడ్డు దిగి యాక్సిడెంట్ స్పాటుని తప్పించుకొని మాతోపాటే కదిలాయి.

కాసింత ఊపిరి పీల్చుకుని కారుని ఎయిర్‌పోర్టులోకి పోనిచ్చాడు శివా! కుంతలావాళ్ళు వచ్చే వరకూ చెట్టు నీడన ఆపుకొని రిలాక్స్ అవమని చెప్పి, కారు దిగి వెయిటింగులాంజ్‌లోకి వెళ్ళిపోయాం. ఫ్లైట్ సమయానికి వచ్చింది.

అన్ని ఫార్మాలిటీలూ పూర్తయి ముందుగా కుంతల చకచకా బయటకొచ్చేసింది. నన్ను చూస్తూనే గట్టిగా కావులించుకొని కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

నిన్ను చూసి ఎన్నాళ్ళయ్యిందే!... మళ్ళీ మనం కలుస్తామని ఊహించనేలేదు. అంతా దైవికంగా జరిగినట్టుంది అంది.

ఏడి! మీ సహజీవి...? పరిచయం చేయనే లేదు" అనడిగాను.

వస్తున్నాడు వెనకాల... సూటుకేసులు రావటానికి కొంచెం టైం పట్టుందిగా... అంది.

అంతలో, సహజీవి సుందర్ ట్రాలీతో వస్తూ కనిపించాడు. 'అడుగో అతనే... ఎలా ఉన్నాడు?' అంది నవ్వుతూ! 'నువ్వు రాసినట్టే పేరుకు తగ్గట్టు ఉన్నాడు' అన్నాను మెచ్చుకుంటూ!

సుందరం మా దగ్గరికి వచ్చేశాడు. నన్ను పరిచయం చేసింది కుంతల. నేను కామేశాన్ని ఆ ఇద్దరికీ పరిచయం చేశాను.

" మా ట్రస్టుకు మేనేజర్ కమ్ ట్రస్టీ" అని చెప్పాను.

అది విని కామేశం ఆశ్చర్యపోయాడు.

బహుశా అనుకొని వుంటాడు... నా తరఫున అన్ని నిర్ణయాలూ ఈవిడే

తీసుకుంటుందేవిటీ... నా ఇష్టాయిష్టాలతో పనిలేదా...? నాకామాత్రం వ్యక్తిత్వం లేదా? అని!

అతని వ్యక్తిత్వానికి గుర్తుగానే కదా... ఆ పదవి ఇచ్చింది. మరో గిరీశంలా కాపర్స్ కోసం కక్కుర్తి బతుకు గడుపుతూ విలువైన జీవితాన్ని నాశనం చేసుకోనిస్తానా...! దారితప్పిన బిడ్డను దారికి తెచ్చేందుకు తల్లిపడే శ్రమలాంటిదే నా శ్రమకూడా, లోకంలో మనుషులంతా దుష్టులు కాదు. దుష్టులు కూడా ఎల్లకాలం దుష్టులుగానే ఉండిపోరు. అందరినీ మన దారికి తెచ్చుకోగలగటంలోనే ఘనత ఉందని నా నమ్మకం. కామేశం మీద నా నమ్మకానికి ఇదొక్కటే కారణం!

కారుని మాదాకా తీసుకురమ్మని శివా సెల్‌కి ఫోన్ చేశాడు కామేశం.

కారు రాగానే ఇద్దరూ కలిసి సామాను డిక్కీలోకి ఎక్కించేశారు.

నలుగురమూ ఇంటికి వెళ్ళాం. అప్పటికే యాక్సిడెంట్ స్థలంలో జనం మూగి వున్నారు. వార్తలు మర్నాడు పేపర్లో తెలుస్తాయిగదా అనుకొని ఆగకుండా వెళ్ళిపోయాం.

ఇంటికి వెళ్ళాక కుంతల వచ్చిందని వెంటనే రమ్మని కాళీకి కబురుపెట్టాను.

కాఫీలయ్యాక సుందరం తనకు లాయర్ అప్పాయింట్‌మెంట్ ఉందనీ, అవగానే వచ్చేస్తాననీ అన్నాడు. రిజిస్ట్రేషన్ అవగానే తన సెల్లుకి కాంటాక్ట్ చేస్తే తను తిన్నగా ఇక్కడికే వచ్చేస్తానన్నాడు. "దగ్గర్లోనే మా ఇల్లు ఉందిగా... మా ఇంట్లో ఎవరో చుట్టం చేరిందట... ఆవిడ సంగతి ఏవిటో చూడాలి. పనులన్నీ పూర్తి చేసుకొని వస్తాను. నా కోసం ఎదురు చూడకండీ..." అంటూ గడగడా చెప్పేశాడు. "కారు తీసుకెళ్ళండీ... డ్రైవరు మిమ్మల్ని దింపివస్తాడు" అన్నాను.

"నేను పుట్టి పెరిగిన ఊరండీ ఇది... నా జన్మభూమి సెంటిమెంటుని కాసేపు ఆస్వాదించనీయండీ" అన్నాడు సుందరం నేను 'సరే'నని నవ్వాను.

సుందర్ అటు వెళ్ళాడో లేదో కాళీ ఇటు వచ్చింది.

"ఆ ఇద్దరూ ఒకరినొకరు ఎదురుపడే ఉంటారు గానీ, ఒకరినొకరు ఎరుగరుకదా! సుందర్ ఒక్కక్షణం ఆగివుంటే ఇద్దరికీ పరిచయం చేసి వుండేదాన్ని!" అన్నాను.

"కథలో ఆ మాత్రం సస్పెన్స్ లేకపోతే మజా ఉండదు కదా! సుందరమే కాళీని పరిచయం చేసుకుంటాడు చూడు... కాళీని చూడగానే గుర్తుపట్టగలిగేంతగా దాని గురించి అతనికి వర్ణించి చెప్పాను..." అంది కుంతల!

సుందర్ అనే పేరు వినగానే ఉలిక్కిపడింది కాళీ. ఎందుకో నాకు అర్థం కాలేదు.

-- XXX --

# 16. కుంతల

వెనకటికి ఓ కథ ఉంది! అది నీకు ఇప్పుడే చెప్పాలోయ్ సుందరం..

తెల్లవారుఝామున కోడి కూయగానే హడావిడిగా నిద్రలేచాట్ట ఓ కుర్రాడు.

పక్కనే ఉన్నవాడి పెళ్ళాం "పడుకోండి ఇది మనిల్లే... అందిట! అలా ఉంది నీ తంతు. అసలు నీకీ కథ అర్థం అయ్యిందా?" అనడిగాను.

సుందరం నా ప్రశ్నకు ముసిముసినవ్వులు నవ్వాడు, "ఈ యాండ్రాయిడ్ ఫోన్‌లో నీ సిగ్గుబుగ్గలు ఎర్రగా కంది అందంగా కనిపిస్తున్నాయిలే..." అన్నాడు.

మళ్ళీ సిగ్గుమొగ్గయ్యాడు సుందర్ "ఎవతె ఇంట్లోనో ఉన్నప్పుడు గుట్టు రట్టు కాకుండేందుకు కోడి కుయ్యంగానే లేచి వచ్చేసే అలవాటు కదా... ఇంట్లో ఉన్నప్పుడు కూడా అదే అలవాటున లేచి కూచున్నాడట..." అన్నాను. అతన్ని కవ్విస్తూ.

"లోకంలో పెళ్ళాలు అందగత్తెలుగా ఉంటే సరిపోదు, తెలివిగలవారుగా కూడా ఉండాలి. బహుశా ఆ మొగుడు మళ్ళీ అలాంటి కక్కుర్తిపని చేసి వుండకపోవచ్చు..." అంటూ సుందరాన్ని బాగా ఉడికించటం మొదలుపెట్టాను.

బెజవాడ వచ్చాక సుందరం ఏవేవో పనుల వంక చెప్పి తిరుగుతున్నాడు. నాకే దొరకటం లేదు. మధ్య మధ్య ఫోన్ చేసి అక్కడున్నాను, ఇక్కడున్నాను అని చెప్తున్నాడు.

"రాత్రిపూట మాయమైపోతున్నావు... ఎవరైనా చిన్ననాటి స్నేహితురాళ్ళు దొరికారా...?" అనడిగాను, ఉడికింతగా! కావాలనే బహువచనం వాడాను.

"నువ్వనుకునే ఆ భాగ్యానికి రాత్రే కావాలా?" అన్నాడు ఎదురు నన్ను ఉడికించా ు.

"అంత రాత్రీ పగలూ తేడా లేకుండా ఉందా వ్యవహారం?" అనేసరికి, మైకం దిగిపోయింది. ఫోన్లోనే దణ్ణం పెట్టేసి 'ఇంకెప్పుడూ నీతో పెట్టుకోను' అన్నాడు.

"ఈ కథలో లాగా కొత్త అలవాట్లు చేసుకోకు... చేసుకున్నావంటే దొరికిపోతావు జాగ్రత్త" అని బెదిరించాను.

"అలాగే! నేను మాట తప్పను, మడమ తిప్పను" అన్నాడు గర్వంగా!

"ఈ మధ్య రాజకీయాల్లో వినిపిస్తున్న కొత్త డైలాగనుకుంటా ఇది! న్యూస్ పేపరు పరిజ్ఞానం బాగానే వంటబట్టింది." అన్నాను. సుందరం మాట్లాడలేదు.

"ఇంతకీ, మీ ఇంటికి ఎవరో ఒంటరి చుట్టం వచ్చివుంటోందని ఎవరో ఫోన్ చేసి చెప్పారన్నావు కదా... ఆ చుట్టంగారు బాలికా? కన్యా? ప్రౌఢా? వృద్ధా...? అనడిగాను. ఆ సంగతి తనకే తెలియదన్నాడు అతను ఎప్పుడు వెళ్ళినా ఇంటికి తాళం వేసుంటోందిట...

"అయ్యో పాపం! భలే ఛాన్స్ మిస్సయ్యావే..." అని ఏడిపించాను.

"అంత సీనేం లేదులే! నా సంగతి నీకు తెలీదా...?" అన్నాడు

"ఇంకో ఆడదాని దగ్గర నీ సీనేంటో నాకెలా తెలుస్తుందీ..." అని అతన్ని ఉడికించాను.

ఫోనోలోనే ఏడ్చేశాడు సుందర్.

"సర్లే! ఇంక ఏడిపించన్లే! నా ముద్దుల సుందరానివి గదా..." అన్నాను ఊరడిస్తూ!

ఈ 'సౌదా' దగ్గరే ఉండిపోయి అది చేపట్టే సేవాకార్యక్రమాలలో భాగం కావాలని నాకు చాలాసార్లు అనిపించింది. నిజానికి ప్రొద్దునే వచ్చి సాయంత్రమే బయల్దేరి బెంగళూరు వెళ్ళిపోవాలి అనుకున్నాం. ఆఫీసు ఒత్తిడి అలాంటిది. కానీ ఇక్కడకు వచ్చాక పోబుద్ధికావటంలేదు. సౌదా దగ్గర ఉంటే ఏదో తెలీని మానసిక శాంతి దొరికనట్టనిపిస్తోంది!

'వర్క్ ఎట్ హోమ్' పెట్టుకొని, రెండు రోజులు అలాగే ఉండిపోయాను.

ఇదే అదనుగా సుందర్ నాకు దొరక్కుండా తప్పించుకు తిరుగుతున్నాడు.

'సౌదా'తో చెప్పి, మా పెళ్ళి దాని చేతులమీదుగా జరిపించుకోవాలని నా తహతహ ఇక్కడి కొచ్చాక ఈ పనుల హడావిడిలో ఆ విషయమే ప్రస్తావించటానికి సమయం చిక్కటంలేదు.

"ఈ రోజు లంచికి 'సౌదా' వాళ్ళ ఇంటికే రమ్మని సుందరానికి గట్టిగా చెప్పాను. 'సౌదా'ను మించి ఆప్తులెవరున్నారు మనకి...? మన పెళ్ళి సంగతి 'సౌదా'కి చెప్పి దాని ఆశీస్సులు తీసుకుందాం" అన్నాను. అన్నమాట ప్రకారం మధ్యాహ్నం పన్నెండుకల్లా వచ్చేశాడు సుందర్.

మొన్న అగ్నిప్రమాద బాధితులకు ప్రభుత్వం ప్రకటించిన నష్టపరిహారాన్ని వెంటనే ఇప్పించాలని కోరుతూ సబ్ కలెక్టర్ ఆఫీసు ముందు ధర్నా ఉందంటూ సరిగ్గా అదే సమయానికి కాళీ బయటకు వెళ్ళిపోయింది. కాళీ అలా వెళ్ళింది. సుందర్ ఇలా వచ్చాడు.

"గేటు దగ్గర మా ఫ్రెండు ఎదురయ్యిందా? చూశావా దాన్ని? గుర్తు పట్టావా?" అనడిగాను ఆత్రంగా!

"కుంతలా! ఆడాళ్ళు కనిపిస్తే కళ్ళలోకి ముఖం పెట్టి ఎలా చూస్తాను...? ... అయితే ఒకామె మాత్రం ఎర్రజెండా పట్టుకొని బయటకు రావటం చూశాను. ఎక్కడో చూసినట్టనిపించింది గానీ ఆమె ఎవరో తెలీదు..." అన్నాడు.

"అదే ... మా కాళీ! సబ్ కలెక్టరు ఆఫీసుముందు ధర్నా చేయటానికి వెడ్తోంది..." అన్నాను.

"ఎందుకీ ధర్నాలు? ప్రభుత్వంతో పనులు అవుతాయని మనం అనుకోవటం పెద్ద భ్రమ! అలాగే, ధర్నాలతో విజయాలు సమకూరటమూ భ్రమే!" అన్నాడు సుందర్.

"నిజానికి, రాజకీయ పార్టీల వాళ్ళు జనానికి తామేదో చేస్తున్నట్టు కనిపించేందుకు

ధర్నా ప్రహసనాన్ని సృష్టిస్తారు. అది ఒక గంటకు మించి జరగదు.

మీడియావాళ్ళొచ్చి వెళ్ళగానే అయిపోయే ఈ ధర్నాలవలన ప్రయోజనం ఏవుందీ?" అన్నాడు ఆవేశంగా సుందర్! ఆ మాటలు విని, ఆశ్చర్యంగా అంది సౌదా.

"మీ ఆలోచనలూ - మా కాళీ ఆలోచనలూ పూర్తిగా విరుద్ధంగా ఉన్నాయి. మీఇద్దరూ ఉత్తరధృవం దక్షిణధృవంలా ఉన్నారు. ఆ బీదజనానికి దక్కవలసిన నష్టపరిహారం ఇప్పించే ఉపాయం మీదగ్గర ఏదైనా ఉంటే చెప్పండి."

"రెండు మార్గాలున్నాయండీ..." మీ పలుకుబడి ఉపయోగించి కలెక్టరుతో మాట్లాడి న్యాయం చెయ్యమని కోరటం మొదటిది.

ఇంక రెరండోది, మీరే ఆ పరిహారం ఇచ్చేసి మీ దాతృత్వం చాటుకోవటం...

మనిషికి రెండువేలు చొప్పున ఇచ్చినా వందమందికి రెండు లక్షలు మించదు... ఈ భాగ్యానికి ఇంత తతంగం అనవసరం. మనవంతు సేవా కార్యక్రమం అనుకోవటం మంచిది" అన్నాడు సుందరం. నిజంగా ఇది నేను ఊహించని విషయం!

సుందర్ ఇంత నిబద్ధతతో మాట్లాడతాడని నేనెప్పుడూ ఊహించలేదు.

"కుంతలా! నీ సెలెక్షన్ అమోఘమే! అతను నా కళ్ళు తెరిపించాడు. అతను చెప్పిందానికి అంగీకరిస్తున్నాను" అంది సౌదా.

వెంటనే మేనేజరు కామేశంగారిని రమ్మని పిలిచింది. "అగ్నిప్రమాద బాధితులకు రెండు లక్షల నష్టపరిహారం మన ట్రస్టులోంచే ఇద్దాం. కలెక్టరుని పిలిపించి ఆయన చేతుల మీదుగానే ఇప్పిద్దాం... ఆయన అప్పాయింట్‌మెంట్ అడగండి" అంది.

"మా 'సౌదా' దగ్గర మంచి మార్కులు కొట్టేశావుగా..." అని మెచ్చుకుంటూ సుందర్ చెయ్యి ...చ్చుకొని నొక్కాను. అతను గర్వంగా చూశాడు నా వంక!

అంతలో పోలీసుస్టేషను నుండి ఫోనొచ్చింది. 'సౌదా' ఖంగారుగా చెప్పింది...

"కాళీని అరెస్టు చేశారుట... సబ్‌కలెక్టరు ఆఫీసుమీద దాడి చేసిన నేరానికి ఏవేవో సెక్షన్లలో పెట్టి ఇరికించారట..." అని! కన్నీటి పర్యంతం అయ్యింది 'సౌదా'!

"కంగారుపడకండి! లాయరుతో మాట్లాడి బెయిలు వచ్చే ఏర్పాట్లు చూద్దాం" అన్నాడు సుందరం. లాయర్ సదాశివని కలిసి ఈ విషయాన్ని చెప్పి బెయిలు ఏర్పాట్లు చెయ్యమని చెప్పింది సౌదా. సుందరానికి ఆ బాధ్యత పురమాయించి, "మా కామేశం గారిని తీసుకెళ్ళండి ఆయనకు చెక్కుపవరుంది. ఎంత డబ్బయినా కట్టి కాళీని విడిపించుకురండి" అంది.

దాని కళ్ళలో నీళ్ళు తిరుగుతుంటే నేను చూడలేకపోయాను.

కాసేపాగాక, 'మనం వెళ్ళి కాళీని ఊరడిద్దాం" అంది సౌదా!

ఇద్దరం పోలీసుస్టేషనుకెళ్ళాం. ఆ సమయంలోనే పోలీసు అధికారికి సదాశివ

ఫోనుచేశాడు... తాను బెయిల్ కాయితాలు తీసుకొస్తున్నాననీ! కాళీకి లాకప్పులోంచి విముక్తి లభించింది. మాతో కాళీని ఇంటికి వెంటబెట్టుకొచ్చేశాం. మేం అక్కణ్ణించి వెళ్ళిపోయాక లాయర్ సదాశివం, సుందర్, కామేశం ముగ్గురూ స్టేషనుకు వెళ్ళారు.

సదాశివ పోలీసు అధికారులతో మాట్లాడాడు.

ప్రభుత్వం ప్రకటించిన నష్టపరిహారాన్ని 'సౌదామినీ శరణాలయం ట్రస్టు' వారు భరిస్తారనీ, కాళీపైన కేసులు ఉపసంహరించుకోవాలనీ కోరాడు. అవసరమైన కాయితాలపైన సంతకం చేయటానికి ట్రస్ట్ మేనేజర్ కమ్ ట్రస్టీ సిద్ధంగా ఉన్నారని చెప్పాడు.

యస్సై ఈ విషయాన్ని పోలీసు కమీషనరు దృష్టికి తీసుకెళ్లాడు.

కమీషనరు కలెక్టర్‌తో మాట్లాడారు. కాళీ పైన ఇంతకుమునుపు ఎలాంటి కేసులూ లేవు కాబట్టి, ప్రథమ తప్పిదంగా భావించి కేసు ఎత్తేయటానికి అంగీకరించినట్టు ప్రకటించారు. అక్కడికి ఈ కథ సుఖాంతం అయ్యింది. ఈ తతంగం అంతా పూర్తయ్యేసరికి సాయంకాలం అయ్యింది ఆ పూట ఎవరికీ భోజనాల్లేవు.

కాళీని రెండు రోజులపాటు తనదగ్గరే ఉండిపొమ్మంది 'సౌదా'! మేమిద్దరం బెంగుళూరు తిరిగి వెళ్ళేవరకూ తనకు చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళకూడదని కాళీని శాసించింది.

సుందర్ మన్నాడు ప్రొద్దున్నే వస్తానని నాకు ఫోను చేశాడు.

"ఈ గందరగోళంలో మూడ్సన్నీ ఆఫయిపోయాయి. ఇప్పుడెందుకులే! మన పెళ్ళి సంగతి... రేపొద్దున ఫ్రెష్‌గా మాట్లాడదాం" అన్నాడు.

నేను కూడా సరేనన్నాను.

సుందరం నన్ను ఎవాయిడ్ చేస్తున్నాడని నాకేమీ అనిపించలేదు.

కానీ, కాళీని అతనింతవరకూ పరిచయమే చేసుకోలేదని మాత్రం బాధ కలిగింది.

కాళీకి ఎంతకష్టం వచ్చిందోననిపించింది. సుందరే శ్రద్ధ తీసుకుని ఆమెపైన కేసులు తప్పించాడు. లాయర్ సదాశివ అందుకు ఒక అండగా నిలబడ్డాడు.

సదాశివ మా ముగ్గరికీ బాల్యస్నేహితుడు. నేనన్నా, 'సౌదా' అన్న అతనికి ఎంతో ఇష్టం. కాళీ అతనితో కలిసి మహిళా ఉద్యమాల్లో పనిచేసింది కూడా!

గమ్మత్తేవిటంటే, కాళీ అకస్మాత్తుగా మా మధ్య నుండి అప్పట్లో ఎందుకు మాయమయ్యిందోచ ఎక్కడికిచేరిందో, ఇక్కడికి ఎందుకొచ్చిందో ఆ మిస్టరీ గురించి దాన్ని ఇంతవరకూ అడగనే లేదు. తనకేమైనా తెలుసేమోనని 'సౌదా'ని అడిగాను.

"గతచరిత్రలతో మనకు పనేమిటని అడగలేదు..." అంది 'సౌదా'!

తీరుబడి లేక పనుల ఒత్తిడిలో ఎవరమూ మాట్లాడుకోలేదని చెప్పింది.

ఇక్కడకు వచ్చి అప్పుడే నాలుగురోజులవుతోంది. నాకు మాత్రం అడగటానికి తీరిక దొరికిందా...? కనీసం నా పెళ్ళి విషయం కూడా ప్రస్తావించలేకపోయాను కదా!

ఆ పూటకు కడుపు నిండేందుకు ఉల్లిపకోడీలు చేయించింది 'సౌదా'!

తింటూ మాట్లాడుకుంటున్నాం -

"ముగ్గురమూ కలిసిన ఫోటోలు సరదాగా దిగుదాం" అంటూ నా సూట్‌కేసులోంచి ఎస్సెల్లార్ కెమెరా తీసి రెడీ చేశాను. 'సౌదా' దగ్గర ఉండే అసిస్టెంట్ ఒకమ్మాయి తనకు ఫోటోలు తీయటం వచ్చంటే ఆమెకి కెమెరా ఇచ్చాను. మేం మాట్లాడుకుంటే కూచుంటే తనకు నచ్చిన రీతిలో ఫోటోలు తీస్తోంది ఆ అమ్మాయి! అంతలో ఎవడో తాగుబోతు బయట గేటుమేన్‌ని తోసుకుంటూ లోపలికొచ్చాడు.

'ఒసే' 'ఏమే' పదజాలంతో సౌదామినిని దూషిస్తూ ఆమె మీదకు దూసుకురాసాగాడు.

'సౌదా' బెదరకుండా నిలబడింది.

'ఎందుకొచ్చావిక్కడికి...?" అని ఉగ్రంగా చూసింది.

."నా ఇష్టమే! ఇది నా పెళ్ళాం ఇల్లు. అంటే, నా ఇష్టం వచ్చినట్టు వస్తాను..." అన్నాడు.

"నీ ఇష్టం నీ ఇంటిదగ్గర. ఆ రోజు కట్టుబట్టల్తో ఇంట్లోంచి బయటకు వెళ్ళగొట్టి, తలుపు లేసేసినప్పుడు నీ పెళ్ళాం అనేది నీకు గుర్తురాలేదా..? అది చచ్చిందో బతికిందో అనిపించలేదా...?" కసిగా అడిగింది 'సౌదా'! వాళ్ళ మాటల్ని బట్టి ఆ తాగుబోతు 'సౌదా' మొగుడని, ఆమెని హింసించేవాడనీ నాకు అర్థం అయ్యింది.

'సౌదా' పళ్ళ బిగువున కోపం అణచుకుంటోందని గుర్తించాను.

"ఏంటే వాగుతున్నావు...? మొగుడికే ఎదురుచెప్తావా..? నాలుగు రూపాయలు చేతికొచ్చే సరికి కళ్ళు నెత్తికొచ్చాయా...?" అంటున్నాడు.

వాణ్ణి నిజంగానే చంపేయాలన్నంత కోపంగా చూస్తోంది కాళీ, మొదట కొద్దిసేపు ఇది మొగుడూ, పెళ్ళాల విషయం అనుకొని మౌనంగా ఊరుకున్నాం. కానీ, వాడి వ్యవహారం శ్రుతిమించి రాగాన పడుతుండటంతో నాక్కూడా కోపం ఆగలేదు. నేనే వాడి మీదకు చెయ్యెత్తాలన్నంత ఆవేశం వచ్చింది.

"ఈ సారి ఇంకో యాక్సిడెంట్లో అయినా నువ్వు చచ్చేది ఖాయం..." అన్నాడు ఆ విధంగా వాడు మొన్న లారీ ప్రమాదం తన పనేనని చెప్పేశాడు.

"నిన్ను చంపి నా పగ తీర్చుకుంటాను. అప్పుడు ఈ ఆస్తంతా నాదే అవుతుంది..." అన్నాడు. సౌదాని చంపితే ఆస్తి వాడిదెలా అవుతుందీ...?

"ఇది నా ఆస్తి! ఇవిగో డాక్యుమెంట్లు! నిన్ను చంపేస్తాను" అంటూ, బొడ్లోంచి కత్తి తీసి గిర్రున తిప్పుతూ, వెర్రెత్తినట్టు అరిచాడు.

అంతే! సివంగిలాగా పెద్దగా గర్జించింది సౌదా! వాడు బిత్తరపోయి చూశాడు.

ఎగిరి వాడిమీదకు దూకి, చాచి డొక్కల్లో తన్నింది.

నిజానికి ఇదికాళీ చేయాల్సిన పని! కానీ, సౌదాయే చేసింది. వాడికి బుద్ధి చెప్పాలని! ఎన్ని నాళ్ళనుండో గుండెల్లో గూడు కట్టుకుని వున్న కసి ఆ తన్నులో కన్పించింది.

అప్పుడు నాకు గుర్తుకొచ్చింది... 'సౌదా' చిన్నప్పుడే కరాటే నేర్చిందని!

ఇట్లాగే, చదువుకునే రోజుల్లో ఓ కుర్రాడు కాలేజీలో ఆడపిల్లల్ని అల్లరిచేసి ఏడిపిస్తుంటే 'సౌదా' వాణ్ణి దగ్గరకు పిలిచి, చాచి తన్నింది. కాలేజీగేటుదాకా అలానే తన్నుకుంటూ వెళ్ళింది.

అక్కణ్ణించి వాడి స్నేహితులు వాణ్ణి ఆసుపత్రికి మోసుకుపోయారు.

ఇప్పుడీ మొగుడిగాడికి కూడా అదే గతి పడుతుందని నాకు తెలుసు.

'సౌదా' తన్నిన ఇంకో తన్నుకి, అక్కణ్ణించి మెట్లదాకా వెళ్ళిపడ్డాడు.

మెట్లదగ్గర నిలబడి మళ్ళీ తన్నేసరికి వాడు దొర్లుకొంటూ కిందమెట్టు దగ్గరకొచ్చిపడ్డాడు.

నీ ఇంట్లో ఉన్నంతకాలం "నిన్నిలా ఎందుకు తన్నలేదో తెలుసా? మొగుడివనే పనికిమాలిన పాత్రలో ఆ రోజున నువ్వున్నావు కాబట్టి! నన్ను బయటకు గెంటి, "నిన్నొదిలేశాను, దిక్కున్న చోటుకి పోయి చెప్పుకో" అన్నావు కాబట్టి నిన్ను ఇలా తన్నగలిగాను.

ఆ రోజున పిరికివాడిలా తలుపులేసుకొని లోపల దాక్కున్నావు కాబట్టి, బతికిపోయావు.

ఇవ్వాళ నిన్ను రెచ్చగొట్టి పంపినవాళ్ళకి చెప్పు... మళ్ళీ నా జోలికి వస్తే, వాళ్ళకీ ఇదే గతిపడుతుంది" అని అంది.

వాడు తాగిందంతా దిగిపోయి కళ్ళు బైర్లుకమ్మి లేచి నుంచుని మళ్ళీ పడిపోయాడు.

"ఇది ఆఖరి తన్ను. ఇంతకన్నా ఎక్కువ తంతే నెత్తురు కక్కుకుని చస్తావు...! బతకాలని వుందో, చావాలని వుందో ఈ తన్ను తర్వాత తేల్చుకో" అంటూ మళ్ళీ తన్నింది.

వాడు బయట గేటుదాకా దొర్లుకుంటూ పోయాడు.

గూర్ఖావాణ్ణి పిలిచి "వీణ్ణి లాక్కుపోయి బయట ఆ చెట్టుకి కట్టెయ్. పోలీసులకు ఫోన్ చేసి, జరిగింది చెప్పు" అంది.

'సౌదా' విశ్వరూప సందర్శన భాగ్యం నాకు ఆ విధంగా కలిగింది.

'కుంతలా! నీ జన్మధన్యం అయ్యిందే...' అని నన్ను నేనే అభినందించుకున్నాను.

అక్కడ మూగిన తన పరివారాన్ని ఎవరిపనుల్లోకి వాళ్ళని వెళ్ళమంది సౌదా!

ఈ జనం అంతా కలిసి తలా ఒక తన్నూ వాణ్ణి తన్నివుంటే, వాడి గతేం అయివుండేదో...! 'సౌదా'యే తన్ని వాణ్ణి బతకనిచ్చింది.

ఎస్సైగారు వెంటనే వచ్చారు. అందరినీ జరిగిందేమిటంటూ వాకబు చేస్తున్నారు.

"జరిగిందేమిటో నేను చూపిస్తాను రండి సార్..." అంటూ ఇందాక ఫోటోలు తీసిన అమ్మాయి ఆ కెమెరాలో ఉన్న మెమరీకార్డుని తీసి ల్యాప్‌టాప్‌లో ఉంచి స్విచ్ ఆన్ చూపించింది.

ఆ మొగుడుగాడు లోపలకొచ్చి వాగిందీ, తన్నులు తిన్నదీ అంతా ఆ కెమెరా వీడియో మోడులో చిత్రించింది ఆ అమ్మాయి.

దాని సమయస్ఫూర్తికి మెచ్చుకోకుండా ఉండలేకపోయాను. ఎంతైనా ఈ జనరేషన్ మాతో పోల్చుకుంటే చాలా ఫాస్టు అనిపించింది నాకు.

"నాలుగు రోజుల క్రితం నిడమానురు వంతెనదగ్గర మీ మీద హత్యాప్రయత్నం జరిగింది. అందుకు ఉపయోగించిన ఆ రెండు లారీలూ ఆ సమయంలో ఒకదానినొకటి గుద్దుకున్నాయి. మీరు దైవికంగా ఆ ప్రమాదంలోంచి బయటపడ్డారు.

ఆ సంఘటన వెనుక వున్న వ్యక్తులే ఇప్పుడు మిమ్మల్ని హత్య చేయటానికి ఇతన్ని ప్రేరేపించారు. మీరు మరణిస్తే ఈ ఆస్తి అతనికే దక్కుతుందని అతను దురాశతో ఈ దాడి చేశాడు... ఇలా అనుమానిస్తున్నారని భావించవచ్చా!" అనడిగాడు ఎస్సై.

"ఇటీజ్ నాట్ ఎ ప్రిజంషన్, ఇటీజ్ ఎ ఫ్యాక్ట్...! రోజూ నాకు ఏదో ఒక సమయంలో ఆకాశరామన్న బెదిరింపుకాల్స్ వస్తూనే వున్నాయి" అంది 'సౌదా'.

ఆమె కళ్ళనీళ్ళు పెట్టుకుంది. నాకూ కళ్ళు చెమర్చాయి.

అంతలో లాయర్ సదాశివ కూడా వచ్చాడు.

ఎస్సైగారితో మాట్లాడి, ఆయన్ని పంపించేశాక, సౌదాతో అన్నాడు.

"మేడమ్! మీరు విడాకులు తీసుకోవటం మేలనుకుంటాను"

"చూద్దాం... రేపు ఆలోచిద్దాం..." అంది తడుముకోకుండా సౌదామిని. 'రేపు' అనే ఆప్షన్ తనెందుకు అట్టేపెట్టుకుందో నాకు వెంటనే అర్థం కాలేదు...

కత్తితో తనమీద దాడి చేసిన నేరానికి తన భర్తను కాలితో తన్ని బుద్ధి చెప్పింది. కానీ, అతనితో తాళి కట్టించుకున్న పాపం కూడా ఉంది కదా... తను కూడా ఒక సగటు భారతీయ స్త్రీయే కదా...! తెగతెంపు అనేది ఆవేశపూర్వకంగా తీసుకోగలిగే నిర్ణయం కాదని ఆమెకు తెలుసు. ఆలోచించి రేపు తన నిర్ణయం చెప్తానంది!

చివరికి అది ఏ నిర్ణయం చెప్తుందో నాకు తెలుసు... తనకు విడాకులే కావాలంటుంది.

కానీ, తాను హేస్టీ డెసిషన్లు తీసుకునే మనిషిని కాదని ఆమె నిరూపించుకుంటోంది.

-- XXX --

# 17. లాయర్ సదాశివ

తల్లీబిడ్డల మధ్య పేగుబంధం ఉంటుంది. భార్యాభర్తల మధ్య మాంగల్యబంధం ఉంటుంది. డాక్టరూ పేషెంట్ మధ్య లాయరు క్లయింటూ మధ్య వృత్తిపరమైన బంధం ఉంటుంది. సౌదామినికీ, నాకూ మధ్య వీటన్నింటికీ అతీతమైన స్నేహబంధం ఉంది.

బంధాలన్నింటిలోనూ స్నేహం ఉన్నప్పుడే ఆ బంధంలో నాణ్యత ఉంటుంది.

స్నేహం ఆత్మ అయితే, బంధం ఆకృతి!

సౌదామిని జీవితంలో చల్లగా సాగుతున్న మూగకాళ్ళకు మొగుడనే సంకెళ్ళబంధం తగులుకుంది. అది అంత తేలికగా తెంచుకోగలిగేదిగా కనిపించలేదు.

సౌదామిని భర్త విషయాన్ని వెంటనే నేను ఫ్యామిలీ కోర్టుకు నివేదించాను. అతని బారి నుండి ఆమెకు సత్వరం విముక్తి కల్గించవలసిందిగా కోర్టువారిని ప్రార్థించాను.

సౌదామిని భర్తకు సంబంధించిన చరిత్రంతా తెచ్చి కోర్టుముందుంచాను.

ఆమెను చంపితే ఆ ఆస్తి తనది అవుతుందనే దుష్టచింతనతోనే అతను ఉన్నాడనటానికి సాక్ష్యంగా, నిన్న దాడి చేసిన సందర్భంలో అతని మాటల వీడియో రికార్డింగు  కోర్టు ముందుంచాను. అతనిపైన దాడికేసు నడుస్తోన్న సంగతి కోర్టుకు నివేదించాను.

లారీ ప్రమాదానికీ, ఇతనికీ సంబంధం ఉందనే కోణంలోంచి పోలీసులు కేసును పరిశోధిస్తున్నారని చెప్పాను.

నిజానికి ఆ కేసు ఋజువైతే అతనికి శిక్షపడ్తుంది.

కానీ, అది పెద్దదిగా ఉండకపోవచ్చు... మనకు అన్యాయంగా కనిపించింది పోలీసులకో, కోర్టులకో అలా కనిపించాలని లేదుకదా... కనిపించినట్లయితే కిందికోర్టులో శిక్షపడినవాడిని పై కోర్టులో నిర్దోషిగా పంపటం ఎందుకు జరుగుతుందీ... రిమాండు ఖైదీ కాబట్టి, సౌదామిని మొగుణ్ణి పోలీసులు వెంటబెట్టుకుని కోర్టుకు తీసుకువచ్చారు.

వాడు వాదన ప్రారంభంలోనే తాను చాలా దుర్మార్గుణ్ణని ఒప్పేసుకున్నాడు. 'సౌదామిని ఒక దేవత' అన్నాడు. బుద్ధి గడ్డి తిని తాను ఆమెకు ద్రోహం తలపెట్టానని చెప్పుకున్నాడు. తనకు ఏ శిక్ష వేసినా సంతోషంగా స్వీకరిస్తానన్నాడు.

ఉరిశిక్ష వేసినా క్షమాభిక్ష అడగనన్నాడు, సంతోషంగా ఉరితాడుని మెడలో ధరిస్తానన్నాడు తనలాంటివాడు బతకకూడదనీ, చావాలనీ సవినయంగా కోర్టుకు విన్నవించుకున్నాడు.

ఇదొక గొప్ప టెక్నిక్ ఎవరైనా మనల్ని తిట్టాలని వస్తున్నాడనుకోండి. ఆ తిట్లు తప్పించుకోవటానికి ఇది మంచి ఉపాయం.

ఆ వ్యక్తి రాగానే మనల్ని మనమే తెగ తిట్టేసుకోవటం మొదలుపెట్టాలి. దాంతో ఆ పెద్ద మనిషి కరిగిపోయి, తను వచ్చినపని మరిచిపోయి, మంచివాడినంటూ పొగిడి వెళతాడు.

అభియోగాలు, ఆరోపణలను డైల్యూట్ చేయటం వాడి లక్ష్యం. వాడి క్రిమినల్ బ్రెయిన్‌ను తక్కువగా అంచనా వేయకూడదు. వాడికి ఇంకో క్రిమినల్ లాయర్ అవసరం లేనేలేదు.

కోర్టువారు వాడి మొసలికన్నీటికి కరిగిపోతున్నారేమోనని నాకు భయం వేసింది.

వాడికి వందేళ్ళు శిక్షపడినా ఒప్పుకుంటాడటగానీ, సౌదామినితో విడిపోయే శిక్షను మాత్రం ఒప్పుకోలేడట! రాత్రికి రాత్రి తాను మారిపోయానన్నాడు. ఆ దేవతకు తిరిగి ద్రోహం తలపెట్టననీ తనను మన్నించాలనీ సౌదామినిని కోర్టులోనే వేడుకున్నాడు. కాళ్ళు పుచ్చుకొని బతిమాలుకుంటానన్నాడు.

ఆమె కాళ్ళతో తన్నగానే తనకు జ్ఞానోదయం అయ్యిందన్నాడు. ఈ పని ఆమె ఎప్పుడో చేసివుంటే తనవలన ఇంత అపకారం జరిగేది కాదన్నాడు.

ఆమె పాదాల దగ్గర కుక్కలాపడి వుంటానని మొత్తుకున్నాడు.

వాడు ఆ మాటలంటున్నప్పుడు కోర్టులో సౌదా తలవంచుకుని కూర్చుంది.

కాళీ, కుంతలా ఆమెకు చెరోవైపు కూర్చున్నారు.

కోర్టువారు ఆమెను పిలిచి తన అభిప్రాయాన్ని చెప్పవలసిందిగా ఆదేశించారు.

సౌదా ఇలా చెప్పింది, 'కోర్టు తీర్పు ద్వారా తనకు సంక్రమించిన ఆస్తి తనది కాదనీ, అది తన తండ్రిదనీ చెప్పుకుంది. అక్కడ ఒక శరణాలయం కట్టి అభాగ్యులకు చేయూతనివ్వాలనేది తన తండ్రి జీవితాశయం' అంటూ తండ్రి రాసుకున్న ఒక వీలునామాను, ఆయన డైరీలను కూడా చూపించింది. ఒక్కగానొక్క కూతురునికాబట్టి తండ్రిమాట నెరవేర్చాల్సిన బాధ్యత తనకుందని చెప్పుకుంది. తన భర్త ఈ విషయంలో ఆస్తి తనకు దక్కనీయకుండా దాన్ని కైవసం చేసుకోవాలని ప్రయత్నించాడని చెప్పుకుంది.

"మా నాన్నగారి అక్రమాస్తులపైన నాకు ఆపేక్షలేదనీ, నేను ఆ ఆస్తిని కోరుకోవటంలేదని, ఈ కేసులో నేను వ్యక్తిగతంగా కోర్టుకు హాజరుకావాల్సిన అవసరం లేకుండా మినహాయించాలంటూ అతను గతంలో దాఖలు చేసిన అఫిడవిట్ ఫోర్జరీదని ప్రకటించింది.

ఆ డాక్యుమెంట్లన్నీ నేను న్యాయమూర్తి ముందుంచాను.

ఆమె అన్నింటినీ ఓపికగా పరిశీలించారు. తాము ఆడించినట్లల్లా ఆడి, ఆ కేసులో సహకరిస్తే, స్థిరాస్తులన్నీ అతనికే చెందేట్లు లిఖితపూర్వక హామీ ఇచ్చారు ప్రత్యర్థులు.

ఆ కాయితాలే చేత్తో పుచ్చుకువచ్చి, "ఈ ఆస్తి నాది" అంటూ రంకెలేశాడు నిన్న!

ఆ దృశ్యాన్ని వీడియోలో చూపించి కోర్టువారికి అతనిపట్ల సరైన అవగాహన కలిగించాలని ప్రయత్నించాను. ఆ హడావిడిలో అతను పారేసుకున్న ఆ కాయితాల్ని న్యాయమూర్తికి అందించాను ఆస్తిని కైవసం చేసుకోవటానికి అడ్డుగా ఉంటుందని సౌదామినిని ఇంట్లోంచి వెళ్ళగొట్టాడనీ, దిక్కులేని స్థితిలో సౌదామిని .ఆత్మహత్య చేసుకుటుందనీ, ఆస్తి తనకే సంక్రమిస్తుందనీ అతని ఆలోచనగా నిరూపించే ప్రయత్నం చేశారు.

ఆమె మీద అతను ఎన్నిసార్లు హత్యాయత్నాలు చేసిందీ వివరించాను.

మొన్నటి ఆ లారీ ప్రమాదం ఈ క్రమంలో చివరినుండీ రెండోదనీ, నిన్నటి ఈ దాడి లేటెస్టనీ అన్నాను.

కానీ, సౌదామిని తన యావదాస్తినీ ట్రస్టు పేరున బదలాయించిన సంగతి ఆ మొగుడికి తెలీదు. ఇప్పుడామెను చంపినా ఆ ఆస్తిలో చిల్లిగవ్వ అతనికి దక్కదు.

ఆ సంగతి కోర్టుసాక్షిగా అతనికి తెలియపరిచాను.

అతనే భర్త కాబట్టి, ఆమె వ్యక్తిగత వ్యయాన్ని ఎదురు భరించవలసి వస్తుందని బెదిరించాను.

జైలు నుండి తిరిగివచ్చేవరకూ ఆమె జీవించటానికయ్యే వ్యయాన్ని డిపాజిట్ చేసేలా తీర్పు ఇవ్వవలసిందిగా కోర్టువారిని కోరాను.

విడాకులు ఇవ్వకుండా రేపు జైలుకెళ్ళి కూర్చుంటే ఆమె పోషణ ఎవరు చూస్తారని ప్రశ్నించాను. అదుపాజ్ఞల్లో ఆమెను ఉంచాలనుకుంటే గృహహింస చట్టం ఊరుకోదని కూడా చెప్పాను. ఆమె సేవాకార్యక్రమాలకు అడ్డుతప్పుకుంటే మంచిదని నచ్చచెప్పాను.

సౌదామిని మొగుడి దుష్టత్వాన్ని న్యాయమూర్తి ఆమోదించారు.

అలాంటి భర్తతో చేసేది కాపురం కాబోదన్నారు. కానీ, ఏ దేశంలో అయినా చట్టాలనేవి ఆ సమాజపు సంస్కృతికీ, ఆచార వ్యవహారాలకూ అతీతంగా ఉండజాలవన్నారు.

“ఎంతటి దుర్మార్గుడైనా అతనిలో పరివర్తన తప్పక రావచ్చునని మన రాజ్యాంగకర్తలు నమ్మారు. మన పురాణేతిహాసాలలోని గుణనిధి, నిగమశర్మలాంటి వ్యక్తుల జీవితాలే ఇందుకు సాక్షి” అన్నారు న్యాయమూర్తి.

ఒక సంవత్సరం పాటు వేచి వుండి, ఆ తరువాత కూడా వాళ్ళు విడిపోవాలనే కోరుకుంటే అప్పుడు విచారణ చేసి విడాకులు మంజూరు చేస్తామని తీర్పు ప్రకటించారు.

దాడి కేసులో పడే శిక్ష చాలా స్వల్పంగా ఉంటుంది. అందుకని, అతనిపైన ఫోర్జరీ కేసును కూడా బనాయించేందుకు నేను ప్రయత్నించాను.

కానీ, సౌదా ఒప్పుకోలేదు.

"సదా! కోర్టులచుట్టూ తిరగటం నీకు వృత్తి. కానీ, నాకు కాదు. ఋజుమార్గంలోనే వాణ్ణి వదిలించుకోవటం గురించి ఆలోచించు..." అంది.

అది ఆమె మంచితనానికి నిదర్శనం. కానీ, ఒక దుర్మార్గుడి వలన మనకు అపకారం జరక్కుండా ఆపటానికి ఈ మంచితనం ఒక అడ్డుకారాదు కదా!

వాడు జైల్లో ఉన్నా, బయట ఉన్నా కనీసం ఒక సంవత్సరంపాటు వాడి పీడ మనకు తప్పదు. అసంతృప్తిగానే ఇంటికి వెళ్ళింది సౌదా! కుంతల, కాళీ కూడా ఆమెను అనుసరించారు.

ఆ సాయంత్రం సౌదా ఇంటికి వెళ్ళి, ఆమెను ఓదార్చే ప్రయత్నం చేశాను. కాసేపు అన్నీ మరిచిపోయి, రిలాక్సవ్వమన్నాను.

మాయాబజారు కలర్ సినిమా డీవీడీ తీసుకొచ్చాను... లాహిరి లాహిరి పాడుకుంటూ ఎంజాయ్ చేద్దాం అన్నాను. మూడ్ మార్చేసి నవ్వించే ప్రయత్నం చేశాను.

అందరూ నెమ్మదిగా మామూలు స్థితికి రాసాగారు.

ఘటోత్కచుడి పాత్ర వచ్చేసరికి మాయబజారు సినిమా స్వరూపమే మారిపోతుంది.

హై హై నాయకా అంటూ మనం కూడా ఆ ఘటోత్కచుడి అనుచరులుగా మారిపోదాం... అన్నాను వాళ్ళను కవ్విస్తూ! అందరం అలా మంచిమూడ్‌లోకి వస్తుండగా కాళీవాళ్ళ ఇంటిపక్కనావిడ వచ్చింది.

"మీ అత్తమ్మ కాశీ నుండి తిరిగివచ్చిందమ్మా..." అని చెప్పింది.

కాళీ వెంటనే ఇంటి తాళం చెవి ఇచ్చి ఆవిణ్ణి పంపించేసింది.

తను మౌనంగా అలాగే కూర్చుండిపోయింది.

నాకు ఆశ్చర్యం వేసింది. అత్తగారొస్తే కాళీ కదలకుండా కూర్చున్నదేమిటీ...?

లాయర్ బుర్ర కదా, నా ఆలోచన ఎప్పుడూ అక్కడ ఏదైనా ఉందా అనేదాన్నే వెదుకుతూ వుంటుందనుకున్నాను. కానీ, సౌదా కూడా అదే ప్రశ్న వేసింది. కాళీ వెంటనే జవాబివ్వలేదు.

ఆమెకు పోరాడటం ఒక్కటే తెలుసు.

వ్యవహారానికొస్తే ఎలా వ్యవహరించాలో తెలీదు. ఒక్కక్షణంలోనే ఆమె సంసారం సాఫీగా సాగటంలేదనే అనుమానాన్ని అందరిలోనూ కలిగించింది.

సౌదా ఆమెను వదల్లేదు 'నిజం చెప్పు... నీ అసలు కథేమిటీ...?' అనడిగింది.

"మనం మన వ్యక్తిగత జీవితాలను చెప్పుకోవటం అవసరం. వాటికి తగ్గట్టుగా వ్యవహరించటం కూడా అవసరం..." అంది. కాళీ తన కథ చెప్పటం మొదలుపెట్టింది.

-- xxx --

# 18. కాళీ

పొయ్యిలో మండుతున్న కట్టెపుల్లను చేత్తో పుచ్చుకొని సూర్యుడు ఉదయించాడు.

రోజూ అలానే ఉదయిస్తాడు. కానీ ఆ విషయాన్ని నేను ఒకరోజు ప్రొద్దునపూట మా ఇంటికి తెలియని చుట్టాలొచ్చిన రోజు గుర్తించాను.

మా ఇంటిముందు ఆవులు మేతమేస్తున్నాయి. శుభాలకో, అశుభాలకో గోదానాలు పుచ్చుకున్నందువలన మా ఇంట్లో ఆవులమంద ఉండేది. మాకు పాలూ, పెరుగులకు లోటు ఉండేది కాదు. పెరట్లోని ఆవులమందలో ఒక ఆవుదూడలాగా నేను కూడా అతిగారాబంగా పెరిగాను. నా మాటంటే మా ఇంట్లో అందరికీ వేదం. నన్ను కాదనేవారు లేరన్నంతగా పెంచారు మా నాన్న.

ఆ ప్రొద్దునపూట మా ఇంట్లో పెద్ద పంచాయితీ ఏదో జరుగుతోంది. ఎవరో బంధువులకు సంబంధించిన విషయం... అది! పెళ్ళి సంబంధాల గురించి మాట్లాడుకుంటున్నారు.

ఇచ్చిపుచ్చుకోవటాల దగ్గర పేచీలమద పంచాయితీ జరుగుతుందేమో అనుకున్నాను. మొదట్లో విషయం నాక్కూడా అర్థం కాలేదు.

నాన్నగారు మధ్యవర్తి అనుకుంటాను. మధ్యలో కూర్చున్నారు. వాళ్ళలో పెళ్ళికూతురు తరఫువారెవరో, పెళ్ళికొడుకు తరఫువారెవరో తెలీదు. పేచీ ఎందుకొచ్చిందో కూడా తెలీదు. పెళ్ళికొడుకు కూడా ఆ చర్చల్లో ఉన్నాడేమో తెలీదు. మా అమ్మ కూడా తనకు తెలీదంది!

అమ్మ కాఫీ పెట్టి గ్లాసుల్లో పోసి అందరికీ ఇవ్వమని చెప్పి నన్ను పంపించింది.

నాకు అతిథిమర్యాదలంటే మహాఇష్టం. బంధుమిత్రుల ఇళ్ళలో పెళ్ళి జరుగుతున్నా ముందుగా వెళ్ళి చేతుల్లో పనిని అందుకోవటం అంటే మహా సరదా!

నేను కాఫీలు అందిస్తున్నప్పుడు ఒకాయన అంటున్నాడు.

“ఎప్పుడో ఆరేళ్ళ క్రితం బంధువులంతా ఒత్తిడి చేస్తే, ఈ సంబంధానికి ఒప్పుకున్న మాట నిజమే! అప్పట్లో తాంబూలాలు పుచ్చుకున్న మాట కూడా వాస్తవమే! మేం దేనినీ కాదనటం లేదు. కానీ, అప్పట్లో మా ఇంటి స్థితిగతులు వేరు, నేను ఊరుచివర ఎక్కడో శివాలయంలో పూజారిగా ఉండేవాణ్ణి. తరువాత దుర్గమ్మ గుడిలో పూజారిత్వం దొరికింది. అక్కణ్ణించి మా స్థితి మెరుగుపడింది. మా పిల్లని పై చదువులు చదివించుకున్నాం.

మీతో వియ్యమందాలనుకున్నప్పుడు మా అమ్మాయి పది చదువుతోంది. అప్పటికి దానికి పెళ్ళి సంగీతం వచ్చు. 'పిల్లవాడు పై చదువులు చదివి మంచి ఉద్యోగంలోకిచ్చాకే పెళ్ళి' అని మీరే అన్నారు. మేం కూడా పిల్లను చదివించుకోవచ్చు కదా అని, సరే అన్నాం.

దాన్ని బెజవాడ ఘంటసాల వెంకటేశ్వరరావు సంగీత కళాశాలలో చేర్పించి సంగీతం చెప్పించాం. బాలసుబ్రహ్మణ్యం గారి 'పాడుతా తీయగా'లో పాటలు పాడి మా అమ్మాయి మంచిపేరు తెచ్చుకుంది.

సినిమాఛాన్సులు కూడా వస్తున్నాయి. అందుకని ఇప్పుడు పెళ్ళికి అది ఇష్టపడట్లేదు.

పిల్లకు ఇష్టంలేని పెళ్ళిచేసి దాని గొంతు కోయలేం కదా!

పెళ్ళి ఆనాడే జరిగిపోయివుంటే ఈ చర్చ వచ్చేదే కాదు, కానీ, ఇప్పుడు పరిస్థితులు మారిపోయాయి.

అమ్మాయి ఇష్టానికి వ్యతిరేకంగా నేనేమీ చెయ్యను... అది తెలివైన పిల్ల, దాని భవిష్యత్తు గురించి నిర్ణయించుకునేపాటి తెలివి దానికుంది.

అందుకే నేను ఒత్తిడి చెయ్యదలచుకోలేదు" అన్నాడాయన.

ఆ రోజున మీ అబ్బాయి కెరీరు గురించి మీరు ఆగాలన్నారు. ఈ రోజు మా అమ్మాయి తన కెరీరంటోంది. ఆగగలిగితే ఆగండి. లేకపోతే వివాహం రద్దు చేసుకుందాం..." అని నిర్మొహమాటంగా చెప్పాడు పిల్ల తండ్రి.

సరిగ్గా అదే సమయానికి కాఫీ గ్లాసులు ట్రేలో పెట్టుకుని నేను వెళ్ళాను. అప్పుడే ఆయన అంటున్న మాటలు నా చెవిన పడ్డాయి.

'శభాష్ తండ్రీ! ఆడపిల్ల తండ్రివంటే నువ్వేనయ్యా...!' అనుకుని మనసులోనే ఆయనకు దణ్ణం పెట్టుకున్నాను.

నా కర్మకొద్దీ ఆ పెళ్ళికొడుకు తల్లికళ్ళు నా మీద పడ్డాయి. ఆ కొడుక్కి ఎవతో ఒకతి దొరికితే చాలనుకుందేమో తెలీదు.

ఈ 'కర్మ'లు, 'దురదృష్టా'లు పూర్వజన్మ సుకృతాలూ ఉన్నాయో లేవో నాకు అనుమానమే! ఉన్నాయని నమ్మే కుటుంబం మాది! ఉన్నాయనే ధర్మానికి ప్రచారకుడు మా నాన్న!

లేవని గట్టిగా వాదించే భావాలకు నేను ప్రతినిధిని. నా శరీరం పెరుగుదల అక్కడ, మనసు పెరుగుదల ఇక్కడా జరిగాయి.

నేను మనసుకే ప్రాధాన్యం ఇస్తానెప్పుడూ!

"ఇది మా అమ్మాయండీ! ఎమ్మే ఫిలాసఫీ చేస్తోంది. దీన్ని ఓ అయ్యచేతిలో పెడితే నా బాధ్యతలు తీరిపోతాయి" అన్నాడు నాన్న!

అయ్యచేతిలో పెట్టటం అంటే ముసలోడికిచ్చి కట్టబెడతారా...? పూర్వాచార పరాయణత్వం అంటే బాలికల్ని ముసలోళ్ళకు కట్టబెట్టటమా...?

ఇంటికి ఎవరొచ్చినా, మా నాన్న ఇవే మాటలు అంటుంటాడు. నాకక్కడే కోపం నషాళానికంటుతుంది.

నేను ఫిలాసఫీ చదువుతున్నానని మా నాన్న చెప్పగానే, ఎవడో ఓ కుర్రాడు, 'ఇండియన్ ఫిలాసఫీనా, వెస్టర్నా...' అనడిగాడు. బహుశా అతనే తొక్కలో పెళ్ళికొడుకు అయివుండొచ్చు. ఒక సంగీతవిద్వాంసురాలిచేత తిరస్కృతుడు.

నేను కొంచెం తీక్షణంగానే అతనివంక చూశాను.

"ఏదైతే నీకెందుకు... నీ పెళ్ళాం సంగతేదో నువ్వేడు' అన్నట్టు చూశానని, చూపుల్ని చదవటం చేతనైనవాడెవడైనా ఖచ్చితంగా గుర్తిస్తాడు. కాఫీ గ్లాసులన్నీ ఇచ్చేశాక ఎంగిలిగ్లాసులు తీసుకొని ఇంట్లోకి వెళ్ళాలి, కానీ, నాకు కోపం ఆగట్లేదు. అందుకని ట్రేని అక్కడే పడేసి వంటింట్లోకెళ్ళి అమ్మ మీద ఇంతెత్తు ఎగిరికేకలు పెట్టాను.

అంగట్లో వస్తువులాగా పెళ్ళిచూపుల పేరుతో నన్ను సింగారించి కూర్చోబెట్టారంటే నేను ఒప్పుకోను.

నా ఇష్టానికి వ్యతిరేకంగా మీరు ఏం చేసినా సహించను ఆ తరువాత జరిగే పరిణామాలకు నా బాధ్యత లేదు..." అని అప్పుడే అమ్మకి చెప్పేశాను.

బహుశా ఆ తరువాత ఎప్పుడో నాన్నకు చెప్పి వుంటుంది అమ్మ... 'కాళీ అసలు పెళ్ళే వద్దంటోంది...' అని!

'పెళ్ళికొడుకు తల్లి అక్కడ నన్ను చూసిందికదా... నన్ను తనకొడుక్కి అడిగినట్టుంది. ఆ తొక్కలో పెళ్ళికొడుక్కి మళ్ళీ పెళ్ళా? గంతకు తగ్గ బొంత దొరక్కపోతుందా' అనుకున్నాను.

కొన్నాళ్ళ తరువాత ఆ పెళ్ళికొడుక్కి నేను నచ్చానని కబురు చేసినట్టున్నారు. నాన్న వీధి అరుగుమీద అగ్నిహోత్రావధానుల్లాగా తాంబూలాలిచ్చేసి ఇంట్లోకొచ్చి అమ్మకు చెప్పినట్టున్నాడు... "తాంబూలాలిచ్చేశాను, తన్నుకు చావండి" అని!

అప్పట్లో ఇదంతా నాకు తెలీదు. ఆ తరువాత జరిగిన పరిణామాల్ని బట్టి ఇదంతా నా ఊహామాత్రమే! నాకు చెప్పకుండానే కథంతా నడిపేసి, గుట్టుచప్పుడు కాకుండా బెజవాడ దుర్గగుడికి తీసుకొచ్చారు.

నన్ను పెళ్ళిపీటలమీద కూర్చోపెట్టి ఆ 'తొక్కలో పెళ్ళికొడుకు' చేత తాళి కట్టించేశారు. సినిమాల్లోనే అనుకున్నాను.

నిజజీవితంలో కూడా ఇలా ఉంటారని అప్పుడే నాకర్థం అయింది. అరిచి గోలచేసి, పంచాయితీకెక్కేకన్నా అందరికీ షాక్ ట్రీట్‌మెంటు ఇచ్చే నిర్ణయం ఏదో ఒకటి తీసుకోవాలని గట్టిగా నిర్ణయించుకున్నాను.

మంగళసూత్రాలు తీసి ఇంట్లో చిలక్కొయ్యకి తగిలించేశాను.

ఎవ్వరికీ ఈ విషయం తెలయనివ్వద్దని అమ్మకు హుకుం జారీచేశాను.

ఆఖరికి మీ ఇద్దరిక్కూడా చెప్పలేదు. నేను తీసుకోబోయేది తీఓణమైన నిర్ణయం. దానికి ఆ పరిస్థితులలో మీరు ఒప్పుకోలేరు.

అందువలన నా గుట్టురట్టు కావటమే తప్ప ప్రయోజనం లేదు. కనీసం 'సౌదా'కైనా చెప్పి వుండాల్సింది. కానీ, నాకు ధైర్యం చాల్లేదు.

పరీక్షలయ్యాక కార్యం చేయటానికి ఇంట్లో ఏర్పాట్లు చేస్తున్నారు. రకరకాలైన చండాలపు ఎత్తులు వేసి ఎలాగొలా తప్పించుకుంటూ వచ్చాను.

కానీ అది ఎక్కువ రోజులు సాగేలా కన్పించలేదు. ఇంక నేను ఆలస్యం చేయదలచలేదు.

మీ అందరికీ తెలుసు. లలితక్క ఎప్పుడూ మన కాలేజీకొచ్చి మహిళా సమస్యలమీద మాట్లాడుతుండేది. ఆమెని కలిసి నా సంగతంతా చెప్పేశాను. ఆమె సహాయంతో విప్లవసంఘంలో చేరిపోయాను.

శ్రీకాకుళం అడవుల్లో అన్నల్లో కలిసిపోయాను. ఇదంతా జరిగి కనీసం ఆరేళ్ళు గడిచిపోయుంటాయి కదా! అడవుల్లో యుద్ధవిద్యలన్నీ నేర్చుకున్నాను.

విప్లవపంథాపైన అవగాహన పెంచుకున్నాను. నా నరనరాల్లోనూ విప్లవ చైతన్యాన్ని నింపుకున్నాను. వర్గశత్రువును చూస్తే పిడికిలి బిగిసి, నా నరాలు ఉప్పొంగేవి. వాణ్ణి అంతం చేయాలని మనసు కుతకుతలాడేది. అడవిలో జీవించటం అంటే సామాన్యం ఏమీ కాదు.

నియమబద్ధమైన జీవితం గడపాలి. అకుంఠితమైన బ్రహ్మచర్యం, నిష్కల్మషమైన మనస్తత్వం ఉండాలి. విప్లవ భావాలకు అంకితమైన మనో నిబ్బరం ఉండాలి. లేనివాళ్ళు రెండో రోజుకే పారిపోతారు.

ఒకసారి అక్కడకు వెళ్ళాక పారిపోగలగటం అసాధ్యం. అక్కడికి వెళ్ళగలగటం కూడా అసాధ్యమే! అది ఒక దేశపురక్షణ యంత్రాంగం అంత పటిష్టంగా ఉంటుంది.

నాకున్న పరిమితుల రీత్యా మీకు నేను ఇంతకన్నా ఎక్కువ చెప్పలేను.

అక్కడ అడవుల్లో జంతువులమధ్య జంతువుల్లానే మేం జీవిస్తుంటాం.

మా నాన్న ఎప్పుడూ వానప్రస్థాశ్రమం గురించి చెప్తుండేవాడు. అన్నీ అనుభవించేశాక ఇంక అనుభవించేదేమీ లేదన్నాక అడవుల్లోకి వెళ్ళటం వానప్రస్థం.

నేను అన్నీ వదిలేసి, నాకా అనుభవవాలేవీ వద్దని వదులుకొని, వానప్రస్థం చేశాను.

నా గురించి మన ఊళ్ళో అందరూ ఏవనుకొని వుంటారో నేను ఊహించుకోగలను.

మిగతావాళ్ళ సంగతి నాకు అనవసరం. మీ ఇద్దరూ నా గురించి చెడుగా అనుకొని వుండరనే నమ్మేదాన్ని! మొదటిసారి ఇక్కడ 'సౌదా'ని కలిసినప్పుడూ, ఆ తరువాత నిన్ను కలిసినపుడూ ... మన బాల్యంనాటి తీపి గుర్తులు మీ మనసుల్లోంచి చెరిగిపోలేదని అర్థం చేసుకున్నాను. నాకు చాలా సంతోషం వేసింది.

మీతో కలిసిపోయి, మళ్ళీ మునుపటి కాళీలా మారిపోవాలని నాకూ అనిపించింది. 'సౌదా'ని చూశాక, ఆ అభిప్రాయం మరీ బలపడింది.

అందుకే సౌదాతో కలిసి పనిచేయటానికి ఇష్టపడ్డాను. విప్లవ సంఘం నాకు అప్పగించిన పని మహిళాచైతన్యాన్ని సాధించటమే! సౌదా చేపట్టిన కార్యక్రమం అందుకు తోడ్పడుతుందని అనిపించింది. సంతోషంగా ఒప్పుకున్నాను.

కావాలని వెదుకుతూ వచ్చి మా అత్తగారింట్లో చేరాను. నాకెవరి తోడూ అవసరం లేదు. ఎవరూ లేకుండా బతకటం ఎలాగో నాకు ఆరేళ్ళపాటు శిక్షణలిచ్చారు మా అన్నలు.

"సౌదా! నిన్న నీ 'తాళికట్టిన మొగుడు'కి నువ్వు పాదఘాతాలిస్తున్నప్పుడు నీలో ఒక చైతన్యమూర్తిని చూశాను. ఈ ప్రపంచంలో ఉన్న స్త్రీ చైతన్యాన్నంతా ఒక విగ్రహంలా పోతపోస్తే అది సౌదామినిలా ఉంటుందని చెప్పగలను.

ఊరికొక్క సౌదామిని ఉంటే ఈ మృగాళ్ళు ఇలా చెలరేగేవాళ్ళా?

నీ కడుపులో ఆరేళ్ళుగా దాగున్న కసి తీరాలంటే నీకు అలాంటి ఒక అవకాశం రావాలి. వచ్చినప్పుడు నువ్వు దాన్ని గొప్పగా నెరవేర్చావు. కామ్రేడ్ సౌదామినీ' [illegible] విప్లవభినందనలు. ఇక్కడకొచ్చి నా చైతన్య కార్యక్రమాలు ప్రారంభించగానే [illegible] కనిపించావు.

గమ్మత్తుగా మా అత్తగారు లేకపోవటం వలన ఇన్నాళ్ళూ ఆమె పేరు చెప్పుకుని ఆ ఇంట్లో కాలక్షేపం చేశాను. ఇప్పుడావిడ వచ్చేసింది.

ఆవిడ ఎలా ఉంటుందో నాకైతే ఏమీ గుర్తులేదు. నన్ను పెళ్ళాడిన ఆ పెళ్ళికొడుకెలా ఉంటాడో కూడా నాకు తెలీదు. నేనతన్ని చూసిన జ్ఞాపకమే రావట్లేదు...

ఇలా నేను నా గురించి చెప్పుకుంటుంటే కుంతల, సౌదా ఇద్దరూ శ్రద్ధగా వింటున్నారు.

లాయరుగారు కూడా అక్కడే ఉన్నారు.

అంతలో, "ఆ పెళ్ళికొడుకు పేరు 'సుందరం' అవునా...?" అనే ప్రశ్న వినిపించింది.

నలుగురం అటువైపు ఆశ్చర్యంగా చూశాం.

"సుందర్! నువ్వెప్పుడొచ్చావ్?" ఆశ్చర్యంగా అడిగింది కుంతల.

"మీ ఫ్రెండు తన ఆటోబయోగ్రఫీ మొదలెట్టినప్పుడే వచ్చాను" అని కుంతలకు సమాధానం చెప్పి, నా వైపు తిరిగి "సారీ మేడమ్! మీ తొక్కలో పెళ్ళికొడుకుని నేనే" అన్నాడు.

విస్తుపోవటం నా వంతు అయ్యింది. సౌదా ఏ మాత్రం స్పందించకుండా శిల్పంలా బిగుసుకుపోయి కూర్చుంది. కుంతల సంభ్రమాశ్చర్యాల్లోంచి తేరుకోలేదు.

నాకు మాత్రం చాలాసార్లు అనిపించింది.... నా కథను ఇలాంటి మలుపే ఏదో ఒకటి ఉంటుందని! కథ మలుపులు తిరిగితే ఫర్వాలేదు. కానీ, కథ క్లైమాక్సుకు రాకుండానే, రోడ్డు క్లోజు అయిపోతోంది. ఈ కథ కంచికి వెళ్ళదు. వెళ్ళాలని నేను కోరుకోవట్లేదు కూడా!

-- XXX --

# 19. కుంతల

చిత్ర విచిత్రాలు సినిమాల్లోనే అనుకున్నాను. నిజజీవితంలో కూడా జరుగుతాయని ఇప్పుడే తెల్సింది. అవి కూడా ఇంత వేగంగా! కాళీ పేల్చినబాంబు సామాన్యమైందికాదు. అది అమెరికా వాడు జపానుమీద వేసిన అణుబాంబుకన్నా పెద్దది. అది వచ్చి నాపైన పడింది.

నాక్కావాల్సిన మొగుడు నా ప్రాణస్నేహితురాలికి ఆల్రెడీ మొగుడంటే కాసేపు నవ్వొస్తోంది. కాసేపు ఏడుపు కూడా వస్తోంది. నెమ్మదిగా తమాయించుకున్నాను.

సుందర్ మీద నాకు కోపం లేదు. ఒకరి చరిత్రలు ఒకళ్ళం అడగరాదని ఒప్పందం చేసుకున్నాం కాబట్టి అతను నాకు ఏమీ చెప్పలేదు.

నేనే చాలాసార్లు అతన్ని చెప్పనివ్వలేదు.

నాక్కూడా ఇలాంటి చరిత్ర ఒకటుంది.

"అది ఇప్పుడు అందరికీ చెప్పినా ప్రమాదం లేనిదే! ఇప్పుడే చెప్పాలి.

ఈ కథ సౌదాకి కూడా తెలియదు.

దాని పెళ్ళయి అది ఏలూరు వెళ్ళిపోయిన కొన్నాళ్ళకు జరిగింది.

"ఒక శుభముహూర్తాన మా మేనత్తకొడుకుతో నాకు ఎంగేజ్‌మెంట్ అయ్యింది. అంటే, తాంబూలాలు పుచ్చుకున్నారు. నాది శాస్త్రీయసంగీతం. మా బావ ఘంటసాల పాటలు బాగా పాడేవాడు. 'పాడుతా తియ్యగా'లో వచ్చాడు కూడా!

అతన్ని పెళ్ళి చేసుకోవటానికి నేను మనస్ఫూర్తిగానే ఇష్టపడ్డాను! ఇద్దరం కలిసి ఆడుతూ ...డుతూ బతికేయొచ్చని అనుకున్నాను.

మా పెద్దవాళ్ళు మమ్మల్ని ఇద్దర్నీ కలిపి సినిమాక్కూడా పంపించారు.

కానీ, ఒకరోజు అకస్మాత్తుగా నా పెళ్ళికొడుకు బావ ఎవరో సినిమాపాటలు పాడే అమ్మాయిని తీసుకొచ్చి "ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాను" అని చెప్పాడట.

మా మేనత్త ఏడ్చుకుంటూ మా ఇంటికొచ్చి, ఇలా జరిగిందన్నయ్యా! నన్నేం చెయ్యమంటావు?" అని మా నాన్నకు చెప్పుకొని బోరుమంది.

మా నాన్న మా అత్తని ఓదార్చాడు.

"అయ్యిందేదో అయ్యింది. వాళ్ళిద్దర్నీ ఆశీర్వదించు... అంతకన్నా నువ్వు చేయగలిగిందేమీ లేదు..." అన్నాడు.

ఇక్కడ మీ అందరికీ తెలియనిట్విస్టు ఒకటుంది....

సుందరానికి తప్పిపోయిన పెళ్ళి కూతురు లేచి వచ్చేసింది ఎవరితోనో తెలుసా? నా పెళ్ళికొడుకు బావతో!

కాళీ ఇందాక చెప్పిందే... 'తప్పిపోయిన పెళ్ళి' కథ... అది మా కుటుంబంలోనే జరిగింది. ఆ పెళ్ళికూతురు కెరీర్ వంకపెట్టి, సుందరాన్ని కాదని, నా పెళ్ళి కొడుకుతో లేచిపోయిందన్నమాట! నా స్నేహితురాళ్ళు నేను చెప్పింది విని ఆశ్చర్యపోయారు.

"మన కథల్లో ఇన్ని పీటముళ్ళున్నాయేమిటే...?' అంది సౌదామిని.

విధి ఎంత విచిత్రమైందో చూశావా...? సుందరం పెళ్ళిని తప్పించి, నా పెళ్ళినీ తప్పించి, ఆ ఇద్దర్నీ కలిపి, మా ఇద్దర్నీ కలిపి... బతుకే ఒక సినిమాలా ఉంది కదూ అంటూ బిగ్గరగా నవ్వాను. మొత్తం మీద ఈ ఎపిసోడ్లన్నీ నా మంచికే జరిగాయనుకుంటాను. 'అంతా మన మంచికే' అనే సిద్ధాంతం గొప్పది. అది నా స్వంత కెరీరుని నిజంగా నిలబెట్టింది.

లేకపోతే మా మేనత్త ఇంట్లో నేను సక్కుబాయినో, మీరాబాయినో అయిపోయి, "హే... కృష్ణా" అని పాడుకుంటూ కూర్చునేదాన్ని.

సౌదామిని అంతటిదానికే ఆ గతిపడితే, ఇంక నాబోటి అల్పురాలి పరిస్థితి ఏంటి...?

జీవితంలో ఎంచుకున్న రంగంలో అనితరసాధ్యం అన్నంత ఎత్తుకు ఎదిగిన తరువాత మాత్రమే ఆడది పెళ్ళికి ఒప్పుకోవాలి.

అందాకా మగాడిని మొగుడిగా చేసుకోకూడదు. అల్లంత దూరాన ఆపి వుంచాలి.

సెక్స్‌కోసం కక్కుర్తిపడితే అధఃపాతాళానికి దిగిపోయినట్టే!

మగాడిదే పైచేయి అవుతుంది.

లైంగికసంబంధమే లేకపోతే ఆడదానికి జవాబుదారీయే లేదు.

క్లియోపాత్రా కథని ఆదర్శంగా తీసుకుని సెక్స్‌తో ఆధిపత్యం సంపాదించవచ్చను కోవటం ఒక భ్రమ!

ఆడదెప్పుడూ 'ఆ ఒక్కటీ అడక్కు' అన్నట్టుండాలి... ఆ ఒక్కదానికి లొంగితే ఆడది మగాడికి లొంగిపోయినట్టే...!" ఇలా మాట్లాడటం మొదలుపెట్టాను.

వాళ్ళెవరిముఖంలోనూ నెత్తురుచుక్కలేదు. నేను గమనిస్తూనే వున్నాను.

మా సంగీతం మేడమ్ ఒక జానపదం గేయం పాడేది.

'శిల వృక్ష లతలబుట్టిన చెలువలు తా ముప్వరు గూడిన శుభలగ్నం తాంబూలం' అని!

రాళ్ళల్లో సున్నాన్నీ, మొక్కల్లో వక్కనీ, లతల్లో తమలపాకునీ తెచ్చి ముడిపెడితే అది తాంబూలం అవుతుందట.

ఈ పాట గుర్తువచ్చినప్పుడల్లా మన ముగ్గుర్నీ ఒక తాంబూలంలాంటి కలయికగా భావించేదాన్ని ఎప్పుడూ!

'మనం కలిస్తే లోకం నోరు ఉదయించే సూర్యుడిలా ఎర్రగా పండుతుంది' అనేది కాళీ!

'అతి కలకత్తా కాళిక నాలిక, జనజ్వాలిక" అని పాడేది సౌదా!

'రతీదేవి పాపిటదిద్దిన కుంకుమబొట్టు' అని నేను అనేదాన్ని. పాపిట కుంకుమని పెళ్ళయిన ఆడవాళ్ళు మాత్రమే ధరిస్తారని వివరణ ఇచ్చేదాన్ని.

ఇలాంటి సంభాషణలు మన మధ్య చాలాసార్లు వచ్చేవి. మీకు గుర్తుందో లేదో మరి!

మన ముగ్గురిజీవితాలతోనూ పెళ్ళి అనే వ్యవస్థ చెడుగుడు ఆడుకుందని నాకు ఇప్పుడు అర్థం అయ్యింది. మొదటి రౌండులో కాళీ అవుటయ్యింది. సుందరం దాన్ని అవుట్ చేశాడు. దాంతో ఆడటమే ఆపేసి, కాళీ తను కోరుకున్న మార్గాన వెళ్ళిపోయింది.

రెండో రౌండులో నా పెళ్ళికొడుకు బావ నన్ను అవుట్ చెయ్యాలని చూశాడు.

కానీ సుందరం మాజీ పెళ్ళికూతురు నన్ను పక్కకు లాగి తను అవుటయ్యింది.

నేను కూడా ఆట ముగించి, కెరీర్ దారిపట్టి చాలా జాగ్రత్తగా జీవితాన్ని మౌల్డ్ చేసుకునేందుకు ప్రయత్నించాను. మూడో రౌండులో సౌదా క్లీన్‌బౌల్డ్ అయ్యింది. అంపెర్ నో బాల్ డిక్లెర్ చేశాడు. ఆట రెండో ఇన్నింగ్‌లో సౌదా అందర్నీ అవుట్ చేసింది.

ఇప్పుడు మాతో పోటీపడే ప్రత్యర్థులు లేరు. ఆ రోజున సౌదా నెత్తిన పడ్డవి తలంబ్రాలు కావు పెద్ద బండరాళ్ళు! అది కాబట్టి నిబ్బరంతో తట్టుకుంది.

మహా కెరటంలా పడినా లేచి ఎగిరింది. ఇవ్వాళ దాని పేరు జిల్లాలో మార్మ్రోగుతోంది.

ఇవన్నీ చూశాక పెళ్ళంటే నాకు అసహ్యం ఏర్పడింది.

మూడు నిమిషాల కక్కుర్తికోసం నూరేళ్ళ బతుకుని మొగుడి కాళ్ళదగ్గర పరిచి బానిసై పోవాల్సినంత అగత్యం లేదనిపిస్తోంది.

నా మనసు వైరాగ్యంతో నిండిపోతోంది.

అన్ని సుఖాలూ అనుభవించాక ఇంక ఆసక్తీ, అశక్తీ తగ్గిపోయాక తీరికగా సన్యాసం తీసుకునే వాళ్ళని మనం ఆదర్శంగా తీసుకోనవసరంలేదు.

ఆ మూడు నిమిషాలూ మనవి కాదనుకుంటే జీవితానికి అంతకన్నా సుఖం ఇంకొకటి లేదనిపిస్తోంది. అందుకే సౌదాతో అన్నాను.

"సౌదా! దీని గురించి ఇంత బుర్ర చించుకోవాల్సిన అవసరంలేదు... నేనే ఒక నిర్ణయానికి వేగంగా వచ్చేశాను. నా మనసులో మాట చెప్పేస్తున్నాను... ముఖ్యంగా నువ్వే వినాలి...

ఏనాడో సుందర్, కాళీల పెళ్ళి జరిగిపోయింది. జరిగిపోయిన పెళ్ళిని మనం గౌరవించాలి. లేకపోతే జీవితానికి అర్థం లేదు.

తుపానులాంటి ప్రకృతి వైపరీత్యాల మాదిరే విధివైపరీత్యాలు కూడా ఉంటాయి. పెను భూకంపాలు కూడా వస్తుంటాయి. వచ్చినప్పుడు చెదరక, బెదరక నిలబడగలగటమే స్థితప్రజ్ఞత... కాబట్టి, దేవుడి సాక్షిగా పెళ్ళిచేసుకున్న కాళీ, సుందర్ ఒక ఇంటివాళ్ళు కావటం ధర్మం.

మనసా వాచా కర్మణా సుందర్, నేనూ స్నేహితుల్లానే జీవించాం. ఇకముందు కూడా స్నేహితుల్లానే ఉంటాం. మీరు మరీ అంత సీరియస్‌గా ఆలోచించకండి..." అన్నాను.

నా మాట పూర్తి అయ్యేలోగా సౌదామిని అందుకుని, "అలా జరగటానికి వీల్లేదు..." అంది. ఈసారి విస్తుపోవటం నావంతయ్యింది. సౌదా చెప్తోన్న ఒక్కొక్కమాట శిలాక్షరాలే నాకు.

"కుంతలా! ఇంత చదువుకొని, దైవసాక్ష్యాలు, గుళ్ళో తాళికట్టటంలాంటి సెంటిమెంట్లతో జీవితాన్ని నడిపించాలనుకోకూడదు.

ఎవడైనా ఒక అమ్మాయిని గుడికితీసుకెళ్ళి, మెడమీద కత్తిపెట్టి, మెళ్ళో తాళికడితే అది పెళ్ళి అవుతుందా...? వాడు మొగుడవుతాడా...? గుళ్ళోనే జరిగినంతమాత్రాన కట్టిన తాళి ఆ ఇద్దరినీ భార్యాభర్తల్ని చేయగలదా...?

అలాంటి కథలు సినిమాలు తీయటానికి పనికొస్తాయిగానీ నిజజీవితానికి పనికొచ్చేవి కావు. హిందూ ధర్మశాస్త్రం, కాళీ సుందరాలకు జరిగింది పెళ్ళిగా అంగీకరిస్తుంది. కానీ, మనసెరిగిన మనంగానీ, ఆఖరికి ఈ సుందరం గానీ నిజంగా దాన్ని పెళ్ళిగా అంగీకరించగలరా...?

సుందరం ఎంత ధర్మబద్ధుడో నాకు తెలుసు... ఆయన ఒకసారి మన లాయరు సదాశివనే కలిశాడు. చెడిన తన వైవాహిక జీవితంలోంచి బయటపడి నిన్ను పెళ్ళి చేసుకోవటానికి చట్టపరమైన అవకాశాల గురించి ఏనాడో సంప్రదించాడు.

ఆ సంగతి నీకు తెలీదు. సుందరాన్ని చూడగానే ఈ విషయాన్ని సదాశివ నాకు చెప్పాడు. అది విన్నాక సుందరంగారి పైన నాకు ఎక్కడాలేని గౌరవమూ పెరిగింది.

నేను మళ్ళీ చెప్తున్నాను, నీ సెలక్షన్ గొప్పది! మీవాడు పేరుకు తగ్గవాడు, నీకు జోడీగా ఉండాల్సినవాడు కూడా!

నువ్వన్నట్టు తుచ్ఛమైన మూడు నిమిషాల కోసం నిన్ను ఎక్స్"ప్లాయిట్ చెయ్యని వ్యక్తిని నువ్వు కూడా గౌరవించాలి..." అంది. నేనేమీ బదులు చెప్పలేదు.

అవుననిగానీ, కాదనిగానీ చెప్పలేకపోవటానికి సుందరం పట్ల నా మనసులో ఆకర్షణ ఉండటమే కారణం కావచ్చు.

ఇదేగనక కొన్నాళ్ళ క్రితం జరిగివుంటే సుందర్‌ని నేనే గంపలో తెచ్చి కాళీ పక్కన కూర్చోపెట్టి మళ్ళీ పెళ్ళిచేసుండేదాన్నేమో!

"సుందర్ మాజీ పెళ్ళికూతురు మన కాళీయే నన్న సంగతి ఇప్పుడేగా మనందరికీ తెలిసింది. కాబట్టిమెళ్ళో తాడుని చూపించే 'సినిమా త్యాగం' గురించి నువ్వేమీ ఆలోచించకు... తాళి తీసి పెళ్ళయినరోజే అది చిలక్కొయ్యకి తగిలించేసింది" అంది.

నాకు ఏం మాట్లాడటానికీ పాలుపోలేదు.

సుందరం మౌనంగా కూర్చున్నాడు. లాయరు సదా మాసంభాషణల్లో తలదూర్చ కుండా స్పెక్టేటర్ పాత్ర పోషిస్తున్నాడు. ఎవరు ఏం మాట్లాడతారో తేలిన తరువాతే తను మాట్లాడదలిచినట్టు అర్థం అయ్యింది.

ఇంక మాట్లాడే వంతు కాళీకొచ్చింది.

"కుంతలా! ముఖ్యంగా నీకే నేను చెప్పాలి... మీ ఫ్రెండుని నేను కోరి పెళ్ళాడలేదు. ఆయన్ని కనీసం కంటితో కూడా చూళ్ళేదు.

నా మీద లేచిపోయినదాన్ననే ముద్రపడుతుందని తెలిసినా ఆ రోజు నేను వెనకడుగు వేయలేదు. నేను ఎంచుకున్న దారిలో నేను వెళ్ళిపోయాను.

ఇప్పుడు కూడా నేనేదో పశ్చాత్తాపంతో తిరిగొచ్చిన మీ ఫ్రెండు పెళ్ళాన్ని కాదు. నా విప్లవ మార్గాన పనిచేయటానికి వచ్చినదాన్ని తాత్కాలిక ఆశ్రయం కోసం ఈ ఇంట్లో చేరాను.

ఇంట్లోకి ప్రవేశించాకే తెల్సింది. నా మెళ్ళో తాళికట్టిన వ్యక్తిపేరు ఫలానా అని!

ఇప్పుడే తెలిసింది ఆయన నీకు ఫలానా అని!

కాబట్టి, ఏదో జరిగిపోయిందనుకోవద్దు. ఏదో జరిగిపోతుందని కూడా అనుకోవద్దు.

నాకు పెళ్ళిధ్యాస లేదు. మగాళ్ళమీద మనం చదువుకునే రోజుల్లో నాకు ఏ అభిప్రాయం ఉండేదో ఇప్పటికీ అదే ఉంది.

అందువలన గుళ్ళో పెళ్ళి సెంటిమెంటు పెట్టుకుని బలవంతంగా ఆయన్ని నాకు అంటగట్టి ఆయన జీవితాన్ని నాశనం చెయ్యకు.

నీ జీవితాన్ని త్యాగం పేరుతో పాడుచేసుకుని నాకు ఇబ్బందులు తెచ్చిపెట్టకు.

నీ ఆలోచన సరికాదు. అది నాకు మేలు చేసేదికాదు. ఎవ్వరికీ మేలుజరిగేది కూడా కాదు. నీముందే ఇదంతా నేను మీ ఫ్రెండుక్కూడా చెప్తున్నాను.

రేపే మీరు రిజిష్టరు మ్యారేజి చేసుకోండి. నేనే మొదటి సాక్షిసంతకం చేస్తాను.

"లీగల్‌గా నన్నెక్కడ సంతకం పెట్టమంటే అక్కడ పెడ్తాను..." గడగడా చెప్పేసింది కాళీ, ఇంకా ఎక్కువసేపు ఇక్కడుంటే దాన్ని మొహమాటపెట్టో, బ్రతిమాలో దాని అభిప్రాయాన్ని మారుస్తామేమోనని కాళీ అక్కణ్నించి వెళ్ళిపోయి మంచం మీద పడుకొని నిద్రపోయింది.

అప్పుడు సౌదా అంది "మనం ఈ విషయాన్ని ఈ పూటకు ఇక్కడితో ఆపుదాం. ఈ రాత్రంతా ఆ ముగ్గురినీ ఆలోచించుకోనివ్వాలి.

రేపొద్దుటికి ఎవరి ఆలోచనలు ఎటు తిరుగుతాయో చూద్దాం. రేపే సుందరంగారి తల్లిని కూడా కలుద్దాం. ఆవిడ అభిప్రాయాన్ని కూడా తీసుకుందాం.

"సుందరం గారి మనోభావాలను రేపు విందాం" అని మీటింగు ఎడ్జర్న్ చేసింది సౌదా!

లాయరు సదాశివాన్ని రేపు మ్యారేజి రిజిస్ట్రేషనుకు కావలసిన డాక్యుమెంట్లు సిద్ధం చేయమని చెప్పింది. "కుంతలతో జరిగినా, కాళీతో జరిగినా ఎటుతిరిగీ మ్యారేజీ రిజిస్ట్రేషను జరగాలి కదా" అంది! నేను దేనికీ అభ్యంతరం చెప్పదలచలేదు.

నా మంచీ, చెడులూ, కాళీ మంచి, చెడ్డలూ రెండూ సమానంగా చూసే సౌదా ఉండగా నేను ఇంతకన్నా మాట్లాడవలసిన అవసరం ఏముందీ... జీవితంలో ఆర్థికపరమైన కెరీర్ కోసం ఇన్నాళ్ళూ తాపత్రయపడ్డాం... సుందరమూ, నేనూ... ఇప్పుడు సంసారపరమైన కెరీర్‌ని నిర్మించుకోవాలి. కలలు చిగురులు వేసే ఈ సమయంలో మొక్కని సమూలంగా పెకలించనీయకూడదనే నా మనసుకు అనిపిస్తోంది. కానీ, కాళీ మనసు మార్చుకుని తన భర్త తనకు కావాలంటే మాత్రం నేను అడ్డుకాకూడదని గట్టిగా అనుకున్నాను.

ఇంతకీ, సుందరం ఏమనుకుంటున్నాడో... అతనితో ఏకాంతంగా చర్చిస్తే, అతని ఆలోచనల్ని ప్రభావితం చెయ్యటం అవుతుందని ఊరుకున్నాను.

తనంత తనే ఒక నిర్ణయానికి రావటం అవసరంకూడా! రేపు సుందరం ఏం చెప్తాడో చూద్దాం. సౌదా అన్నదే కరెక్టు...!

సుందరానికి ఆలోచించుకునేందుకు టైం ఇవ్వాలి. తను వాళ్ళింటికి వెళ్ళి, వాళ్ళ అమ్మ దగ్గర కూర్చుని చర్చించి, అప్పుడతను ఒక నిర్ణయానికి రావటం మంచిది. మా సుందరం సుందరకాండలో నెలకొన్న ఉత్కంఠకు తెల్లవారుతూనే తెరపడుతుంది. సుందరం ఏం చెప్తాడో... నాలాగా కాళీ బుర్ర చించుకోవట్లేదు. అది గాఢనిద్రలో ఉంది. వెళ్ళి దానిపక్కనే నేనుకూడా పడుకున్నాను.

-- XXX --

# 20. లాయరు సదాశివ

మర్నాడు ప్రొద్దున అందరికన్నా ముందుగానే లేచి, నేను సౌదా వాళ్ళ ఇంటికి వెళ్ళాను.

అప్పటికే కాళీ, కుంతలా రెడీగా కూర్చునివున్నారు.

అందరూ బహుశా సుందరం కోసం ఎదురుచూస్తున్నారేమో అనుకున్నాను.

"ఇంతకీ అసలు పెళ్ళికొడుకు ఏడీ..." అనడిగాను నవ్వుతూ!

"వస్తాడు.. తప్పకుండా వస్తాడు..." అంది కుంతల.

నాకు ఎందుకో కొద్దిపాటి అనుమానం వాసనలు తగుల్తున్నాయి. టెన్షను తట్టుకోలేక ఈ పెళ్ళికొడుకు చెప్పా పెట్టకుండా అదృశ్యం అయితే పరిస్థితి ఏంటని నేను ఆలోచిస్తున్నాను.

కానీ సుందరం ధైర్యవంతుడే! అలా చెయ్యడనిపించింది.

సుందరం సమస్యని జటిలం కానీయకుండా సహకరిస్తే మంచిదే! అలానే జరగాలని ఆశిద్దాం. అప్పుడు నాకు పెద్దపని తప్పినట్టౌతుంది.

సౌదాకు నా అవసరం రాకుండా వుండాలనే కోరుకుంటాను.

సమస్య వచ్చినప్పుడేకదా నా ఎంట్రీ...?

సమస్యల్లేని ఇంట్లోంచి పిడికెడు ఆవాలు తెమ్మని ఎవరైనా అడిగితే, సౌదా ఇంట్లో అడగమని చెప్పాలి. అదీ కోరిక! ఇంక నా గురించంటారా...? చెప్పేదేం ఉందీ... పెళ్ళీలేదు. పెటాకులూ లేవు... ఏక్‌నిరంజన్!

కాళీ తనకు పెళ్ళిధ్యాసలేదని మాత్రమే అంది. నాకు పెళ్ళంటే అసహ్యం కూడా!

పెళ్ళికీ, నాకూ బహుదూరం... ఎంతో మంది అమ్మాయిలూ అబ్బాయిల మనసుల్ని మార్చి పెళ్ళిళ్ళుచేశాను గానీ, నాకు పెళ్ళిచేసుకోవాలని ఏనాడూ అనిపించలేదు.

జీవితంలో ఒకే ఒక్కసారి ఏ కారణంచేతో పెళ్ళి చేసుకోవాలని అనిపించింది. అదీ సాక్షాత్తు ఈ 'సౌదా'ని ...!

కానీ, సౌదా నావంక ఉరిమి చూడటంతో ఆ ఆలోచన దెబ్బకి చచ్చిపోయింది.

పెళ్ళి చేసుకోమని సూటిగా వెళ్ళి అడిగేస్తే ఏ ఆడదైనా ఏమంటుందీ... 'చెప్పు తెగుద్దీ' అనదూ...! ఆ తరువాత పెళ్ళి అనే ఊహ మళ్ళీ రాలేదు.

సౌదాని ఆ దృష్టితో ఎప్పుడూ చూళ్ళేదు! అలాంటి ఊహని కలిగించగలిగిన మరో ఆడది నాకు తారసపడలేదుకూడా!

ఇలా అనటం పురుషాహంకారం అనుకుంటే, 'అలాంటి స్త్రీకి నేను తారసపడివుండను' అని నా వాక్యాన్ని సవరించుకుంటున్నాను.

కన్యాశుల్కం నాటకంలో సౌజన్యారావు పంతులంతటి బ్రహ్మచారి న్యాయవాదిని కావాలనేది నా చిరకాల కోరిక!

కానీ, మధురవాణిని ముద్దుపెట్టుకోవటం కోసం సౌజన్యారావు పంతులు గంగవెర్రులెత్తిపోయాడు కదా! అంతటి అవస్థని నేను పడకూడదని శతధా, సహస్రధా ప్రయత్నిస్తూనే ఉన్నాను.

ఇంతవరకూ అంత ప్రమాదం ఎదురవలేదు. అక్కడికి అదొక అదృష్టం.

ఆడా మగా సముజ్జీలయ్యాకే పెళ్ళి చేసుకోవాలనే కుంతల ఆలోచనలతో నాకు ఏకీభావం ఉంది.

భార్యాభర్తలిద్దరూ సమ ఉజ్జీలుగా ఉండటం అనేది సంపాదనలోనో, అధికారం పొందటంలోనో కాదు, వ్యక్తిత్వంలో ఉండాలి.

ఇద్దరూ ఐఎఎస్‌లే అయినా, ఆ దంపతుల మధ్య సఖ్యత ఉండాలనే నియమం ఎక్కడుందీ...? ఈ రాష్ట్రానికీ, మరో రాష్ట్రానికీ ముఖ్యమంత్రులిద్దరూ భార్యాభర్తలై మూడో రాష్ట్రంలో కాపురం పెడితే ఎలా ఉంటుందో ఊహించుకుని చూడండి...

అందుకని భార్యాభర్తల మధ్య సమ వ్యక్తిత్వం అవసరం. వ్యక్తిత్వంలేని సమానత్వం వలన మహిళలకు ఒరిగేదేమీ లేదు.

మహిళల్లో పురుషద్వేషాన్ని నూరిపోసి మహిళోద్య సాహిత్యం, స్త్రీని తక్కువచేసి చూపించే మతపరమైన సాహిత్యం రెండూ ఒకే తప్పు చేస్తున్నాయి... సమాన వ్యక్తిత్వం గురించి ఆలోచించకపోవటం...!

మా తాతయ్య జాతకాలు చెప్తుండేవాడు. 'ఒకే నక్షత్రానికి చెందినవాళ్ళకు పెళ్ళి చెయ్యకూడదురా...' అన్నాడొకసారి.

'ఇద్దరూ కోపగిష్టులో, ఇద్దరూ దుబారా చేసేవాళ్ళో అయితే సంసారంలో సమన్వయం ఎలా కుదురుతుందీ.... ఒకరు కోపిష్టి అయితే రెండోవారు సర్దుకుపోయే వారుగా ఉండాలి.

అప్పుడే అనుకూలదాంపత్యం పొసగుతుంది...' అనేవాడు.

మహిళోద్యమకారులు ఈ సిద్దాంతంతో ఏకీభవించరు. భర్త కోపిష్టిగా ఉండటం ఆయన హక్కా...?

భార్య సర్దుకుపోవటం ఆవిడ బాధ్యతా...? అనడుగుతారు.

సంసారంలో మహిళదే పైచేయి అయితే దాన్ని అభ్యుదయ సంసారం అంటారు. కానీ, ఆ మగాణ్ణి మాత్రం కొంగుచాటు మొగుడు, పెళ్ళానికి చెంచాగాడు, హెన్పెక్కుడూ అని ఆడవాళ్ళే తాటాకులు కడతారు!

"తాతా! గాంధేయవాదానికి, విప్లవవాదానికి స్నేహం కలవదుగానీ, పెళ్ళి కలుస్తుందా" అని మా తాతని సరదాగా ఓ ప్రశ్న అడిగాను.

"శ్రీశైలం అడవుల్లో గాంధీగారు కనిపిస్తే బుద్ధుడు కూడా లేచొచ్చి పకపకా నవ్వుతాడు" అన్నాడు గంభీరంగా తాత.

జీవితానిక్కూడా థియరీ ఆఫ్ ప్రాబబిలిటీ, రూల్ ఆఫ్ తంబ్ లాంటి సూత్రాలు అన్వయిస్తాయి. ఈ సూత్రాల ప్రకారం ఆలోచిస్తే, సుందరం కుంతలనే ఎంచుకుంటాడు. చివరికి అదే జరుగుతుంది.

కానీ, కుంతల అంగీకరాన్ని అంచనా వేయటానికి ఈ సూత్రం సరిపోదు. ఇంత బతుకూ బతికి, 'ఇద్దరి సందున పవళించివున్న ఇంతి పేరెవరురా...?' అని పాడుకుంటూ నా బతుకు గడిపేయాలా? అనుకుంటే, కుంతల నిర్ణయం సుందరానికి వ్యతిరేకంగా ఉంటుంది.

ఆవిడ దక్షిణాదిలో నాలుగు రాష్ట్రాలకు అధినేతగా ఉద్యోగం చేస్తోంది. నెలకు రెండు లక్షల పైబడిన జీతం... సుందరానికి బహువా అంతసీను లేదనుకుంటా!

భార్యభర్తలిద్దరినీ కలిపివుంచాల్సింది హోదాలూ, అధికారాలూ కాదు. వ్యక్తిత్వం మాత్రమే... అనే సూత్రాన్ని కుంతల పాటిస్తే, ఆమె నిర్ణయం సుందరానికి అనుకూలంగా ఉంటుంది.

కుంతల లోతైన సముద్రంలాంటిది... ఆ సముద్రపు లోతుల్లోకి చేరగలిగే చేవ ఉంటే, అక్కడ ముత్యాలూ, పగడాలూ దొరుకుతాయి.

సుందరం అనేక సంవత్సరాలుగా ఆమె పక్కనే ఉంటూ ఆ ప్రయత్నం చేస్తూనేవున్నాడు. దాదాపు సఫలం అవుతున్న సమయంలో ఈ అవాంతరం వచ్చింది. సుందరం తనకు కుంతలే తగిన జోడీ అంటాడని నా ఊహ.

అలాకాకుండా, కాళీని ఎంచుకోవాలంటే అంతకన్నా ఎక్కువ మనోధైర్యం కావాలి.

'అక్కడ కాదురా... ఇక్కడ కాల్చు' అంటూ గుండెని ఎదురొడ్డే దమ్మున్నవాడు ఆమె మనోకాననంలో సింహంలా జీవించగలుగుతాడు.

సుందరం ప్రయత్నించి ఎప్పటికైనా కుంతలంత పొజిషనుకు రాగలడేమోగానీ, కాళీ స్థాయికి రావటానికి మాత్రం ఒక జన్మ తపస్సు చేయాలి.

ఈ కథలో సుందరం వాళ్ళ అమ్మ ఇచ్చేదే ఫైనల్ తీర్పు అవుతుందేమో...

'మనల్ని వద్దనుకుని లేచిపోయినదాని గురించి మనకెందుకురా! మనం కావాలనుకునేదే మనకు కావాలిగానీ...' అని ఆ ముసలావిడ అని తీరాలి! కానీ అలా కాకుండా ఇంకోలా అనేందుకూ అవకాశం లేకపోలేదు.

ఏరికోరి మీ నాన్న తన స్నేహితుడి కూతుర్ని మాకు కోడలిగా చేసుకున్నార్రా...! తండ్రిమాట నిలబెట్టాల్సిన బాధ్యత నీకు లేదా...?

అనడిగిందనుకోండీ... సీనురివర్స్ అవుతుంది. అక్షరాలు కూడా రివర్సయి 'దడిగాడువాన్నవి' అవుతాడు.

తెల్లవారింది అప్పుడే పద్దైపోయింది. సుందరం జాడ తెలీదు.

"నువ్వు ఫోన్ చేసి చూడకపోయావా...?" అని కుంతలను అడిగింది సౌదా!

కుంతలకు అప్పటికే చిరాకొచ్చేసింది.

'సౌదా! అతనొస్తే మనవాడు, రాకపోతే కానివాడు... కొత్తగా మనం నష్టపోయేదేం ఉందీ" అంది నిర్లిప్తంగా! "మనం మగాళ్ళకోసం వెంపర్లాడిపోతామని ఈమగాళ్ళ అభిప్రాయం..." అంటూ విసుక్కుంది. కుంతలలో ఇలాంటి విసుగూ, నైరాశ్యం సహజమే! కాళీలో ఏ మాత్రం స్పందన కనిపించటంలేదు.

సౌదామాత్రం ఆందోళనలో ఉంది.

మేమంతా అలా మాట్లాడుకుంటూ వుండగా సుందర్ నుంచి కుంతలకు ఫోనొచ్చింది.

కంగారుగా లేచి నిల్చుంది కుంతల. "ఏ ఆసుపత్రీ" అనడుగుతోంది...

కథని అక్కడికక్కడ తెగేసి, ముగింపుకు తెచ్చేయటం విధికి ఇష్టం ఉండదనుకుంటాను. విధి తన విధి తను చేస్తోంది.

సుందర్ వాళ్ళ అమ్మ పొద్దున్నే నిద్రలేస్తూనే కళ్ళు తిరిగిపడిపోయింది. 108ని పిలిపించి వెంటనే నరాల డాక్టరుగారి దగ్గరకు తీసుకెళ్ళాడు సుందర్; సెరిబ్రల్ హెమరేజి అని చెప్పారు. సీరియస్ అన్నారు. 24 గంటలు గడిచాక చెప్తారు. ఇలాంటి సమయంలోవచ్చే సమాచారంఅదే!

ముసలమ్మా! ఎంతపనిచేశావు!! ఒక సమస్య కొలిక్కి వచ్చే సమయానికి ఐసీయూలో భలే ఎక్కావుగా మంచం...? ఆ రోజంతా ముసలమ్మ గారి సేవలో గడిచిపోయింది. పెళ్ళిమాటలే లేవు. దుఃఖసాగరంలో మునిగిపోయారంతా!

ఆ రాత్రి పేషెంటు దగ్గర తనే ఉంటానంది కాళీ! "మీరంతా వెళ్ళి విశ్రాంతి తీసుకోండి. అవసరం అయితే సెల్లుంది కదా. ఫోన్ చేస్తాలే!" అంది. ఈ మాటలు కుంతల అనేందుకు అవకాశం లేదు. ఎందుకంటే ఆవిడ రేపొద్దున్నే బయల్దేరకపోతే ఉద్యోగానికి నష్టం.

సుందరం పరిస్థితీ అదే! క్రమేణా సత్యవతమ్మ బాధ్యతలన్నీ కాళీమీద పడిపోయాయి.

"మళ్ళీ శని, ఆదివారాల్లో ఉండేలా వస్తామన్నారు కుంతలా సుందరాలు. అప్పటికీ అమ్మకి నయం కాకపోతే, ఎయిర్ లిఫ్ట్ చేసి ముంబై తీసుకెళ్ళి అక్కడ చేర్పిస్తాం" అన్నాడు సుందరం.

"అందాకా రాదులే! ఆమెకు తగ్గిపోతుంది. నేను ఖాళీయేగా! జాగ్రత్తగా చూసుకుంటాను... ధైర్యంగా వెళ్ళిటా!" అని కుంతలకు హామీ ఇచ్చింది కాళీ.

కుంతలా, సుందర్ ముంబై వెళ్ళిపోయారు. శుక్రవారం పొద్దున కుంతల సౌదాతో మాట్లాడింది. సత్యవతమ్మ గారికి మెరుగైందనీ రేపురూములోకి షిఫ్ట్ చేస్తారనీ చెప్పింది.

మొత్తానికి ఈ వారం, పైవారం అంటూ నెలరోజులు తోసుకుపోయయి.

సత్యవతమ్మ గారిని తన శరణాలయానికే తీసుకొచ్చింది సౌదామిని! అక్కడ ఆమెలాంటి వయోవృద్ధులు చాలామంది ఉన్నారు. ఈ సత్యవతమ్మ సౌధామినికి అదనపుభారం కాదు.

కాళీ ఆమెను మాత్రం ప్రత్యేకంగా చూసింది. ఆమెకు ధైర్యం నూరిపోసింది.

లేచి తన పనులు తాను చేసుకోవాలనే పట్టుదలను, చేసుకోగలననే ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించింది.

తను పక్క నుండి వాకరు సహాయంతో ఆమెను నడిపించింది. నెలరోజులకే ఆవిణ్ణి మామూలుమనిషిని చేసింది.

"ఏ తల్లి కన్నబిడ్డో... ఈ పిల్ల లేకపోతే నా బతుకు ఆ రోజే ముగిసిపోయేదమ్మా! ఈ బిడ్డకు ఋణపడివున్నాను. ఏమిస్తే అది తీరేనమ్మా...?" అనడిగింది సత్యవతమ్మ.

"మీ అబ్బాయి మీకేమీ చెప్పలేదా?" ఆశ్చర్యంగా అడిగింది సౌదా.

"ఎక్కడమ్మా! ఆ రాత్రి పొద్దుపోయి వచ్చాడు. బావున్నావా అమ్మా... అని పలకరించాడు. పడుకొని నిద్రపోయాడు.

తెల్లారేసరికి నేను మంచానపడ్డాను" అని చెప్పిందావిడ!

ఏమిటి సంగతి... అని అడగలేదు.

ఇదీ సంగతని చెప్పటానికి సౌదామిని తటపటాయించింది.

ఈ నెలరోజుల్లో సౌదామిని మొగుడికి ఆర్నెల్ల కఠిన కారాగార శిక్షపడింది.

ఆమె ప్రత్యర్థులందరినీ హత్యయత్నం కేసులో ఇరికించి ట్రయలు నడిపిస్తున్నారు. ఎవిడెన్సులు వాళ్ళకు వ్యతిరేకంగా ఉండటంతో బెయిలు ఇవ్వలేదు. కేసు పకడ్బందీగా నడుస్తోంది.

తీర్పు అనుకూలంగా వస్తే సౌదామిని మొగుడుకి అదనపు శిక్ష పడుతుంది.

మొత్తం మీద సాధారణస్థితి ఏర్పడింది.

సుందరం వచ్చేవరకూ అతని తల్లిని తనదగ్గరే ఉండాలని సౌదా గట్టిగా చెప్పింది. సత్యవతమ్మ అందుకు సంతోషంగానే అంగీకరించింది.

లాయరుగా నా పనుల్లో నేను మునిగి వున్నాను!

-- xxx --

# 21. డ్రైవరు శివ

ఆటో నడిపే రోజుల్లో ఆకలి తీరక చాలా అవస్థలుపడేవాణ్ణి. వచ్చే ఆదాయం ఆటో అద్దె, పెట్రోలు ఛార్జీలు, అప్పులకు వడ్డీలూ - వీటికే సరిపోయేది. మళ్ళీ నెల గడవటానికి కొత్త అప్పులు చేయాల్సివచ్చేది.

మేడమ్ గారిదగ్గర చేరాక నా కష్టాలు తీరాయి. రెండునెలల జీతాన్ని ముందుగానే ఇచ్చి అప్పులు తీర్చేయమని చెప్పింది. 'ప్రాణం పోతున్నా అప్పుజోలికి వెళ్ళకు... వడ్డీల ఊబిలో కూరుకుపోతావు...' అన్నారావిడ!

నా భార్య ఇంటరు వరకూ చదువుకుందని చెప్పాను. పిలిచి దానిక్కూడా ఉద్యోగం ఇచ్చారావిడ!

జానపద సినిమాల్లో యువరాణిగారికి చెలికత్తెలు ఉంటారుగా... సౌదామిని మేడమ్ గారికి మా ఆవిడ అట్లాంటిది. దాని పేరు సత్యభామ.

మా మావగారికా పేరంటే అంత ఇష్టం ఎందుకో తెలీదు. నిజం చెప్పొద్దూ... నా సత్యభామ పేరుకు తగ్గమనిషి!

అందుకే మేడమ్ గారికి అంత నచ్చేసింది. మేడమ్ మీద ఆవిడ భర్త దాడి చేసినప్పుడు, వీడియో తీసి, సాక్ష్యంగా చూపించింది ఎవరనుకున్నారూ... మా సత్యే!

నాకేమైనా కావాలంటే ఇప్పుడు నేను మా ఆవిడకు చెప్పుకోవాలన్నమాట...డిగ్రీ చదివినా నేనుడ్రైవరునే...! ఇంటర్మీడియట్ చదివిన మా ఆవిడ మేడమ్ గారి పర్సనల్ సెక్రటరీ...

లాయర్ సదాశివంగారు ఎప్పుడూ అంటారు... 'చదువులూ, ఉద్యోగాలు, హోదాలు కాదు వ్యక్తిత్వం ఉండాలి. దానికే గుర్తింపు' అని!

సత్యకిప్పుడు కంప్యూటర్లను, ఇంగ్లీషు స్పీకింగ్ కోర్సుల్నీ నేర్పిస్తున్నారు మేడమ్.

శరణాలయంలో మహిళలకు ఉచిత కంప్యూటర్ కోర్సులు పెడ్తున్నారట.

సత్యని దానికి ఇన్‌ఛార్జిగా చేస్తారట! అది రాత్రనకా పగలనకా నేర్చుకోవటానికి తెగ కష్టపడుతోంది.

నిన్న పొద్దున ఓ ముసలావిడ ఆరేళ్ళ పిల్లనొకదాన్ని తీసుకుని శరణాలయానికి వచ్చింది.

ఈ రోజు గాంధీనగరం యాక్సిడెంట్లో మేడమ్‌గారు గవర్నమెంటు హాస్పిటల్లో చేర్పించిన చిన్నపాప అది! ఆ పిల్లని చూస్తూనే గుర్తుపట్టారు మేడమ్.

"శ్యామలా! ఎలా ఉన్నావు...? దెబ్బలు తగ్గాయా... బడికి వెళ్తున్నావా...?" అని కుశల ప్రశ్నలు వేశారు. ఆ వచ్చినావిడ తన అమ్మమ్మ అని చెప్పింది శ్యామల.

శ్యామల తండ్రి ఆ పిల్లకి అన్యాయం చేసి వెళ్ళిపోయిన కథంతా చెప్పింది.

"నిత్యానుష్ఠానాలతో గడిచిన కుటుంబం తల్లీ మాది! మావారు మహాపండితుడుగా పేరున్నవారు.

నా అల్లుడు ఆయన పేరంతా నాశనం చేశాడు! ఉన్న ఆస్తంతా హరించేశాడు అంటూ తన గోడు చెప్పుకుంది.

'దీని తల్లి దీన్ని ప్రసవిస్తూనే చచ్చిపోయింది. ఆ రోజున మాయమైపోయిన నా అల్లుడు ఇవాళ్టిదాకా కనిపించలేదు... నా రెక్కల కష్టంతో దీన్ని పెంచి పోషించగలుగుతున్నానుగానీ, విద్యాబుద్ధులు చెప్పించగలిగే పాటి స్తోమత లేనిదాన్ని! ఆ రోజున దీనికి మీరే ప్రాణం పోశారు. ఆ ప్రాణానికో విలువనిప్పిచ్చు తల్లీ..." అని కోరింది.

మేడమ్‌గారు సత్యని పిలిచి శ్యామల వివరాలన్నీ నోట్ చేసుకోమన్నారు.

ఆ పిల్ల తండ్రి పేరడిగింది సత్య. "ఆర్భాటం వెంకట కామేశ్వరశర్మ" అని చెప్పింది అమ్మమ్మ. తల్లిపేరు ఆర్భాటం శారదట.

ఆ పేర్లు వింటూనే ఒకింత ఆశ్చర్యపడింది మేడమ్. సత్యకూడా ఆ విషయాన్ని గమనించిందిగానీ, అడిగే సాహసం చెయ్యలేదు.

"వెంటనే తేరుకుని, శ్యామలకు చదువు చెప్పించే బాధ్యత నాది. అది ఇక్కడే ఉండి చదువుకుంటుంది. దానికి కన్నతండ్రి లేనిలోటు లేకుండా నేను చూస్తాను..." అని అభయం ఇచ్చారు. మధ్యమధ్యలో వచ్చి చూసుకుంటూ ఉండమన్నారు.

"మేనేజరు కామేశంగారు ఆఫీసుకొచ్చాక దీని వివరాలన్నీ ఆయనకు అందజెయ్యి. ఈ పిల్లని తీసుకెళ్ళి ఆయనకు చూపించు.

ఇంకనుండీ ఇక్కడే ఉంటుందని చెప్పు. ఒకసారి ఎత్తుకుని ముద్దాడమన్నానని చెప్పు..." అన్నారు సత్యతో మేడమ్.

ఆమె ఎవరిగురించీ ఎప్పుడూ అలా అన్లేదు. ఈ పిల్లవిషయంలో ఎందుకింత ప్రత్యేకత చూపిస్తున్నారో అర్థం కాలేదు.

కారణం లేకుండా ఏ పనీ చెయ్యరామె! ఇవ్వాళ కాకపోయినా రేపు అయినా ఆ సంగతి తెలుస్తుంది. మేడమ్ ప్రారంభించిన ఈ సౌదామినీ శరణాలయం అనాథలతో నిండిపోయింది.

డబ్బు మంచినీళ్ళ ప్రవాహంలా ఖర్చవుతోంది.

అంతకాన్న పెద్ద ప్రవాహమే విరాళాల రూపంలో వస్తోంది.

దాతలు ముందుకొస్తున్నకొద్దీ శరణాలయం బాగి విస్తరిస్తోంది.

ఇప్పుడు ఆ పెద్దబిల్డింగ్ పైన, మేడమ్‌గారు మరో మూడు అంతస్థులు వేయిస్తున్నారు...

కాళీగారు చేసిన సేవలతో సుందరంగారి తల్లి బాగుపడింది. ఆమె ఇప్పుడు ఇతర రోగులకు సేవచేస్తోంది. అది ఈస్థలమహత్యం. మేడమ్ గారి సంకల్పబలం!

ఆ రోజంతా కామేశంగారు ముభావంగా ఉన్నారు. భోజనశాలకు భోజనానిక్కూడా రాలేదు. శరణాలయంలో అందరికీ ఒకే భోజనం. మేడమ్ గారు కూడా అక్కడికే వచ్చి భోజనం చేస్తారు.

ఆవిడకో ప్రత్యేకమైన వంట అంటూ లేదు. శరణాలయం స్టాఫందరికీ టిఫినూ, భోజనం అక్కడే! ప్రొద్దున్నే రావటం, రాత్రికి ఇంటికి వెళ్ళటం... అంతే!

కామేశంగారు చాలా పెందరాళే ఆఫీసునుండి తన గదిలోకి వెళ్ళిపోయారు. ప్రొద్దున్నే ఆయన తెల్లపంచె లుంగీలా కట్టుకుని, పైన లాల్చీ వేసుకుని, భుజం మీద తుండుతో ఒక్కరే బయల్దేరారు.

నాకెందుకో అనుమానం వచ్చి, వెనకాలే నేనూ వెళ్ళాను.

కామేశంగారు తిన్నగా కృష్ణ ఒడ్డుకు వెళ్ళారు. దుర్గాఘాట్ దగ్గర ఓపంతులుగారు ఎవరితోనో మాట్లాడారు. ఇద్దరూ కలిసి అక్కడ పెద్దచెట్టు కింద కూర్చున్నారు.

కామేశం గారు స్నానం చేసివచ్చేలోగా కావలసిన సామాను తెచ్చేశాడు పంతులుగారు.

నేను దూరంగా గట్టుమీద నిలబడి అంతా గమనిస్తున్నాను.

నేలమీద పసుపు రాసి, ఓ అరడజను రావిచితుకులు పేర్చి, పైన రెండు కర్పూరం బిళ్ళలు పెట్టి వెలిగించారు పంతులుగారు. మంత్రాలు చదువుతూ హోమం చేయించాడు.

బహుశా ఎవరికో తద్దినం పెడుతున్నాడని నాకు అర్థం అయ్యింది.

"తమరి భార్య పేరు?" అడిగాడు పంతులుగారు.

"ఆర్భాటం శారద" చెప్పారు కామేశం గారు. ఆయన తల్లిగారి పేరు, నాయనమ్మగారి పేరుకూడా అడిగాడు పంతులుగారు.

"ఆర్భాటం శారదప్ప. ఆర్భాటం సుందరప్ప... ఆర్భాటం వెంకాయప్ప" అంటూ ముగ్గురికీ మూడు పిండాలు పెట్టించి పూజ చేయించాడు.

బియ్యం కూరగాయలు ఒక విస్తట్లో పోయించి, తనకాళ్ళు కడిగి తనకు దానం ఇవ్వమన్నాడు.

పంతులుగారికి ఇవ్వాల్సిన ఫీజు ఇచ్చేసి స్నానానికి వెళ్ళాడు కామేశంగారు.

నేను ఆయన కోసం ఎదురుచూస్తూ నిలబడ్డాను. ఆయన నదిలో మునిగారు. అంతవరకూ కనిపించారు. ఆ తరువాత కనిపించలేదు. చాలాసేపు వెదికాను. ఆయన దొరకలేదు.

నాకు భయం వేసింది. మేడమ్ గారికి ఫోన్‌చేసి జరిగిందంతా చెప్పాను.

ఆమె చాలా ప్రసన్నంగా నవ్వారు. "ఏం భయపడకు... ఆయనకోసం ఇంక వెదక్కు... నువ్వు వెంటనే ఇక్కడకు వచ్చెయ్" అన్నారామె! వచ్చిన తర్వాత, "కామేశంగారు మునిగిపోయాడని నీకు భయం వేసిందా?" అనడిగింది. నేను అవునంటూ వినయంగా తలూపాను.

"ఆయన గజ ఈతగాడు. సంసారసాగరాన్ని ఈదదుగానీ, మహాసముద్రాన్ని అవలీలగా ఈదేస్తాడు. ఆ భయం నీకనవసరం. అలాంటిదేమైనా జరిగితే టీవీల్లో చెప్తారులే" అని మళ్ళీ నవ్వారామె.

మొత్తం మీద కామేశంగారు ఇవ్వాళ అదృశ్యం అవుతారని మేడమ్‌గారు ముందుగానే ఊహించారని నాకు అర్థం అయ్యింది.

సత్యని పంపించి ఆయన రూముకు వెదకమని చెప్పారు.

మేనేజరు ఉద్యోగానికీ, ట్రస్టీ పదవికీ రాజీనామా చేస్తున్నట్టు ఒక ఉత్తరం, శ్యామలపేరుతో లక్షాపాతికవేల రూపాయల చెక్కూ ఆ గదిలో కనిపించాయని తెచ్చి చూపించింది సత్య. శరణాలయం లోపల పనులు వేగంగా పూర్తిచేసినందుకు మేడమ్ గారు మెచ్చి ఇచ్చిన లక్షరూపాయలు, మేనేజరుగా ఆయన జీతంపాతికవేలూ మొత్తం శ్యామలపేరుతో చెక్క రాసిపెట్టారు.

"శ్యామలంటే నిన్న చేరిన ఆ ఆరేళ్ళపిల్లేనా అండీ" అనడిగాను. "ఆ పిల్ల తల్లిపేరు శారద అని నిన్న చెప్పారు కదా... పొద్దున కామేశం గారు ఆర్భాటం శారద పేరుతోనే తద్దినం పెట్టారు. నేను స్పష్టంగా విన్నాను..." అని చెప్పాను.

మేడమ్ ఏమీ మాట్లాడలేదు. కాసేపయ్యాక సత్య చెప్పింది.

"నీకింకా అర్థంకాలేదా...? శ్యామల ఆయన కూతురే! ఆ పిల్లతల్లికి ద్రోహం చేసి, చావుకు కారణం అయిన పాపం ఆయన్ను వెన్నాడింది. ఉన్నదంతా ఆ పిల్లకిచ్చేసి, ఈ పుణ్యక్షేత్రంలో తనలాంటివాడు ఉండకూడదని ఆయన మర్యాదగా తప్పుకున్నారు" అంది!

ఇక్కడన్నీవరుసగా వింతలూ, విశేషాలే కన్పిస్తున్నాయి. ఇన్ని దెబ్బల్ని ఆ మహాతల్లి 'సౌదామేడమ్' గారు ఎలా తట్టుకుంటున్నారో నాకు ఎప్పటికీ ఆశ్చర్యమే!

-- xxx --

## 22. కాళీ

నెలరోజులకైనా వస్తారనుకున్న కుంతల, సుందరం రానేలేదు. కనీసం ఆర్నెల్లయిపోయింది.

సత్యవతమ్మగారు మంచానపడి కోలుకుంది. ఇక్కడ కొలువు కుదుర్చుకుంది. పదిమందికి సేవలందిస్తోంది.

సత్యవతమ్మ గారు కాశీనుండి వెనక్కి వచ్చి చాలా మంచి పని చేశానను కుంటున్నారు. అక్కడ ఉంటే గంగాస్నానం గుడికెళ్ళిరావటం, కరివెళ్ళవారి సత్రంలో భోజనం చేయటం తప్ప ఇంకో పనిలేదు.

ఇక్కడ సౌదా ఆమెకు చేతినిండా పనిచ్చింది. శరణాలయంలో వృద్ధుల బాగోగులుచూసుకునే బాధ్యత ఆమెకే అప్పగించింది.

'సౌదాతల్లీ! చిన్నప్పటి నుండీ జొన్నలు దంచి, పిడకలు చేసి, బియ్యం విసిరి, కట్టెలు కొట్టి కష్టపడిన శరీరం ఇది. ఊరికే కూర్చుని తినటం నాకు ఇష్టంలేదు. మీ అందరూ నా పిల్లల్లాంటివాళ్ళే! మీతోపాటే నేనూ ఇక్కడ పనిచేస్తాను" అన్నారావిడ.

"వృద్ధుల సమస్యలు వృద్ధులకే బాగా తెలుస్తాయి... మీరు వాళ్ళని ఆదరంగా చూసే బాధ్యత తీసుకోండి!" అంది సౌదా.

శరణాలయంలో వృద్ధుల విభాగానికి ఆవిణ్ణి ఇన్‌ఛార్జిని చేసింది సౌదా!

మహిళలకు ఉపాధి, వృత్తి విద్యల విభాగాన్ని నేను చూసుకుంటున్నాను.

ఇంటింటికీ తిరిగి హౌస్‌వైఫుల్లా ఉండిపోవద్దని ప్రబోధించటం, ఆదాయం సమకూర్చుకునే ఉపాయాలు చెప్పటం, గృహహింసను ఎదుర్కోవటంలాంటి విషయాలను ప్రచారం చేయటం... ఇవన్నీ నా ద్వారా జరుగుతున్నాయి.

అనేకమంది స్వయంసేవకులు... పెద్ద పెద్ద డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లూ, వ్యాపారులూ శరణాలయానికి వచ్చి ఇక్కడ జరిగే కార్యక్రమాల్లో సహకరిస్తున్నారు.

ఆర్థికపరమైన ఇబ్బందుల్లేవు కాబట్టి. ఎంత పెద్ద ప్రాజెక్టునైనా ధైర్యంగా చేయటానికి మా శరణాలయం ముందుకొస్తోంది. కలెక్టరు, కమీషనరు మాకు గొప్ప ప్రోత్సాహం ఇస్తున్నారు.

ఈ పనుల రంధిలో పడి కుంతలా సుందర్‌ల సంగతే మర్చిపోయాం. ఆశ్చర్యం ఏమంటే వాళ్ళిద్దరూ కూడా ఆ విషయాన్ని మరిచిపోయినట్టే కనిపించారు.

ఈ మధ్య సుందరానిక్కూడా ప్రమోషన్ వచ్చిందట... ఐటీ రంగంలో ప్రమోషన్లు రావటం అంటే, ఇల్లూ సంసారాలకు దూరం కావటమేనన్నది జగన్నుడి.

"ఈ నెల్లో కూడా కుదిరేలా లేదు! పని ఒత్తిడి బాగా ఉంది. అర్ధరాత్రి దాకా పనిచేస్తున్నా టైమ్ సరిపోవట్లేదు" అంది కుంతల.

"మరి మీ ఇద్దరి పెళ్ళి సంగతేమిటి" అనడిగింది సౌదా...

"తీరిగ్గా ఉన్నప్పుడు చూద్దాంలేవే... ఇప్పుడు దానికేం తొందరొచ్చిందీ..." అని సమాధానం చెప్పింది కుంతల. ఈ మాటలో చాలా అర్థాలున్నాయని సౌదా భావించింది.

నేను సత్యవతమ్మగారి కోడలిని సంగతిని సుందర్ ఆమెకు చెప్పలేదు. నేను కూడా చెప్పలేదు. సెపరేషన్ కోసం చట్టపరమైన ఫార్మాలిటీస్‌ని సుందర్ ఈలోగా పూర్తిచేసివుంటే బావుండేది. బహుశా ఒక్కడే రావటానికి భయపడివుంటాడు.

చట్టవ్యతిరేకంగా ఆ ఇద్దరూ కలిసి జీవించటం ఇంతకు మునుపు చెల్లిందేమోగానీ ఇప్పుడు చెల్లదు. అందుకని, ఈ నెల్లో తప్పకుండా రావాలని గట్టిగా చెప్పింది సౌదా!

ఒకరోజు సాయంత్రం బెజవాడ గాంధీనగరం సబ్‌జైలు జైలరుగారట... సౌదానివచ్చి కలిశాడు. ఆయన చెప్తున్న విషయాల్లో ముఖ్యమైనది సౌదా భర్త గురించే!

"ఆరునెలల కఠినకారాగారశిక్ష అనుభవిస్తున్న ఈ వ్యక్తి మీకు భర్త అనీ, మీ పైన భౌతికదాడి చేసిన కేసులో ఇతను శిక్ష పడ్డవాడనీ తెలిసి మీతో మాట్లాడాలని వచ్చాను" అన్నాడు జైలరు.

"చెప్పండి. మా శరణాలయంనుండి మీరు ఏం కోరుతున్నారు?" అంది గంభీరంగా.

"అతనికిప్పుడు మాటా, చూపూ పూర్తిగా పడిపోయాయి. ఎడమచెయ్యి, కాలూ రెండూచచ్చుబడ్డాయి. ఇంకా ఎక్కువకాలం అతను బతకకపోవచ్చని వైద్యులు చెప్తున్నారు. ఈ దశలో అతన్ని స్వయం సేవక సంఘాలకు అప్పగించటమే పరిష్కారం అని మా పై అధికారులు భావించారు. నిజాయితీ, నిబద్ధతతో పనిచేసే శరణాలయంగా మీకు గల పేరు ప్రతిష్టలు వినివచ్చాను. ఇప్పుడతను చూడలేడు. పలకలేడు. మనం ఏవైనా చెపితే వినిపించిందో లేదో తెలియదు. న్యూరాలజిస్టు రోజూ వచ్చి చూసి వెళుతున్నారు. ఆశలేదంటున్నారు..." అన్నారు జైలరుగారు.

"అయ్యో!" అంది సానుభూతిగా సౌదా! జైలరు తన సంభాషణ కొనసాగించాడు.

"ఆ వ్యక్తి ఎలాంటివాడైనా అవసానదశలో ఉన్నవాడు కాబట్టి, మా డిపార్టుమెంటుకు సంబంధించిన పై అధికారులు అతన్ని పెరోలుపైన విడుదల చేసేందుకు అంగీకరించారు. విడుదల చేసిన తరువాత అతన్ని ఎక్కడికైనా మేము తరలించటమేగానీ, తనకు తానుగా వెళ్ళగలిగే పరిస్థితి లేదు..." అని వివరించాడు జైలరు.

"ఈ విషయంలో మీ అభిప్రాయం తెలుసుకుందామని..." అంటూ అర్థోక్తిలో ఆగారాయన. సౌదా సమాధానం ఏం చెప్తుందా అని నేను కూడా ఎదురుచూశాను.

సౌదా నన్ను పిలిచింది. "వృద్ధాశ్రమం ఇన్‌ఛార్జి సత్యవతమ్మగారిని ఒకసారి ఇక్కడకు తీసుకురా..." అని చెప్పింది.

సత్యవతమ్మ గారికి సౌదా భర్త గురించిన విషయం అంతా పూర్తిగా చెప్పి, అతని ప్రస్తుత దీనావస్థని వివరించి కూడా చెప్పాను. సౌదా దగ్గరికి ఆమెను వెంటబెట్టుకు తీసుకువెళ్ళాను.

ఆమెని చూస్తూనే గౌరవంగా కూర్చోమని చెప్పింది సౌదా.

"మన మీద హత్యాయత్నం చేసిన ఒక వ్యక్తి ఇప్పుడు దీనావస్థలో ఉన్నాడు. చివరి ఘడియలంటున్నారు. ఏం చేద్దాం...?" అని సూటిగా అడిగింది.

దానికి సత్యవతమ్మగారి సమాధానం గొప్పది. "అమ్మా! అతను నీ భర్త కాబట్టి నీకావిషయం తెలియజేయటానికి జైలరు గారువచ్చారనుకుంటాను... వృద్ధాశ్రమం నడుపుతూ ఉండకపోయినా ఆ వ్యక్తిని చేరదీయటం మనిషిగా మన బాధ్యత. అతని అమానుషీయం అయినప్పటికీ మనం మనుషులం కాకుండా ఎందుకుపోవాలీ...?

మన వృద్ధాశ్రమంలో ఎందరో వయోవృద్ధులున్నారు. వారి గతచరిత్రలు మనం అడక్కుండానే శరణు ఇస్తున్నాం. పసిపాపల్ని సాకినట్టు సాకుతున్నాం. వాళ్ళెవరూ మన చుట్టాలు కాదు. వాళ్ళ కులాలు, మతాలూ మనం తెలుసుకోవట్లేదు.

ఇప్పుడింకో జీవి మనతో కలిసి జీవించటానికి వస్తున్నాడు జీవించనిద్దాం.

ఆయన ఆయుష్షుని మనం నిర్దేశించగలమా... ఏమో ... బతకనూవచ్చు...

చావు అంచుదాకా వెళ్ళి తిరిగొచ్చినవాళ్ళెందరు లేరూ..." అన్నదావిడ!

అప్పుడు సౌదా తన సహజధోరణిలో జైలరుగారికి చెప్పింది.

"అయ్యా! మా సత్యవతమ్మగారు చెప్పిందే మా విధానం. ఆ వ్యక్తిని ఫలానా అని చెప్పకుండా నేరుగా ఇక్కడకు తీసుకొస్తే మేం ఇంకా ఎక్కువగా ఆదరించి వుండేవాళ్ళం.

మీరు అతని గురించి ముందుగా చెప్పినందువలనే నేను స్వార్థానికి లోనుకాకుండా, మా నిర్వాహకులతో చర్చించవలసివచ్చింది. మా వాళ్ళంగీకరించారు కాబట్టి, మీరు సంకోచించకుండా ఆ వ్యక్తిని ఇక్కడ చేర్చవచ్చు..." అంది.

జైలరు కృతజ్ఞతలు చెప్పి లేచాడు. వెళుతూ ఒక విషయం చెప్పాడు.

ఆ వ్యక్తిని పాపభీతి వెన్నాడిన మాట నిజం కానీ, ఈదుస్థితి మనోవేదనవలనో, పశ్చాత్తాపం వలనో అతనికి వచ్చింది కాదు. సిఫిలీస్ వ్యాధి మెదడుకు పాకినందువలన కలిగిన పరిస్థితి అది... కొన్నినిరర్థక జీవితాలంతే! బతికినంతకాలం పరాన్నజీవులుగా

బతికి ఇలా నశించిపోతారు. దేవదాసు రామాపురం వెళ్ళి పార్వతిని చేరినప్పుడు ఏ స్థితిలో ఉన్నాడో అదే స్థితిలో ఇతనూ ఉన్నాడు. మీరు గేటు మూసినా, తెరిచినా అతను జీవించేది కొన్ని ఘడియలే! మీచేతుల్లో పోతే అతనికి అదొక ఆత్మశాంతి... అంతే!" అని.

నేనూ, సత్యవతమ్మగారూ మాత్రమే కాకుండా, సౌదా కూడా ప్రత్యేక శ్రద్ధ తీసుకుంది.

మా శరణాలయానికి రెగ్యులర్‌గా వచ్చే ప్యానెల్ డాక్టర్లందరూ ఆయన్ను పరీక్షించారు. ఇన్‌ఫెక్షన్ కంట్రోల్లో కొస్తే అతను బ్రతికే అవకాశాలున్నాయన్నాడు న్యూరాలజిస్టు.

శరణాలయంలోనే ఉంచి, పెద్దస్థాయి ట్రీట్‌మెంట్ ఇచ్చారు. అందరి శ్రమా ఫలించింది.

వారం అయ్యాక కళ్ళు తెరిచి చూశాడతను. నోట్లో పాలుపోస్తే గుటక వెయ్యసాగాడు. అమ్మయ్య అనుకున్నాం. "మొత్తానికి అమ్మగారి పసుపూ కుంకుమలు గట్టివి..." అంటున్నారు అమ్మలక్కలు, సౌదామిని అది విని, నాతో అంది.

"లోకంకోసం కాదు, మనసుకోసమూ, మనకోసమూ మనం మనిషిలా ఆలోచించాలి" అని! రోజూ పనిగట్టుకొని వచ్చి చూసిపోతున్న జైలరుగారి ఆశ్చర్యానికి అంతేలేదు... మెచ్చుకోలుగా ఆయన అన్నాడు.

"ఇతను బతకటం అనేది ఒక మిరకిల్. బతికేవాడికిగానీ, బతికించినవారికిగానీ, ఎంతో గొప్ప సంకల్పబలం ఉంటేనే ఇలాంటివి సాధ్యం అవుతాయి. ఇతని విషయంలో మొదటిది శూన్యం. ఫలానా డాక్టరుగారి హస్తవాసి గొప్పది. ఫలానా డాక్టరమ్మ గారు కాన్పుచేస్తే మగపిల్లాడు పుడతాడు అంటుంటారు జనం.

మీ శరణాలయంలో చేరితే చచ్చేవాడు తప్పకుండా బ్రతుకుతాడు... ఇది నా సెంటిమెంట్...! మిగిలిన ఇతని శిక్షాకాలం మీ ఆశ్రమంలో శిక్షణాకాలంగా మారుతుంది.

నేరం చేసినవాడికి శిక్ష వేసేది కక్ష తీర్చుకోవటానికి కాదు, వాడిలో పరివర్తన తీసుకురావటానికి! మా జైళ్ళు కేవలం శిక్షాలయాలే! పవిత్రమైన మీ శరణాలయం ఒక పరివర్తనాలయం! "పరివర్తన కలిగితే దేశానికి పనికొచ్చే ఒక వ్యక్తిని తయారుచేసినట్టే" అన్నాడు.

నాక్కూడా అలానే అనిపించింది... సౌదామిని మొగుడికి ఇంకా నూకలున్నాయి. ఈ శరణాలయ బలమే అతన్ని బతికించింది. మానవత్వం మా చేత ఆయనకు సేవలు చేయించింది! బతికిన తరువాత దేశాన్ని అమ్ముతాడో, నమ్ముతాడో ఎవరికి తెలుసు...?

ఈ రోజు ఫ్లైటులో కుంతలా సుందరాలు వస్తున్నారు. కాలం మళ్ళీ ఏ మెలికలూ పెట్టకుండా ఉంటే, ఆ ఇద్దరికీ ముడిపెట్టి పంపించేయాలనేది నా తపన...!

-- XXX --

# 22. సౌదామిని

ఈ కథ నాతోనే మొదలైంది నేనే దీనికి ముగింపు పలకాలి.

నా జాతకం కూడా నాకు పనికొచ్చేది కాదు. "ఇతరులకోసమే నువ్వు..." అని రాసినట్టున్నాడు భగవంతుడు నా గురించి.

చదువుకునే రోజుల్లో కాలేజీ అమ్మాయిల్ని మగాళ్ళ బారినుండి కాపాడటానికి పనిచేసేదాన్ని. నా వరకూ వచ్చేసరికి ఒక మగాడికింద నలిగిపోయాను.

మహిళాచైతన్యం కోసం పోరాడాలనుకునేదాన్ని! బహుశా కాళీ ప్రభావం కావచ్చు! కానీ, అత్తారింట్లో సక్కుబాయిలాగా బతికినన్నాళ్ళూ ఆ చైతన్యం వీసమెత్తుకూడా కలగలేదు నాకు.

స్త్రీ పురుష సమానత్వం కావాలని ఉపన్యాసాలిచ్చేదాన్ని, అత్తారింట్లో ఉన్నన్నాళ్ళూ ఆ సంగతే గుర్తులేదన్నట్టు ఉండిపోయాను.

ఇన్నేళ్ళుగా గుండెల్లో కరడుగట్టుకుపోయింది కసి...

ఒకరోజు బాగా తాగొచ్చి "నిన్నొదిలేస్తున్నాను... నీ దిక్కున్న చోటుకు పోయి చెప్పుకో..." అన్నాడు మొగుడు.

గృహహింస చట్టం ఉందని నాకు తెలీదా...? తెలుసు. కానీ పోలీసు స్టేషనుకు వెళ్ళినందువలన ఆ పోలీసాయన నా మొగుణ్ణించి వసూళ్ళు చేసుకొని లాభపడతాడే తప్ప నాకు ఒరిగేదేమీ లేదు... "నిన్ను లేపేసి ఒక పదివేలు నావి కావనుకున్నానంటే చాలు" అని బెదిరించేవాడు.

అది బెదిరింపు కాదు, అదే జరిగిందికూడా! నా మెడకు ఉరి తగిలించినా నన్ను చంపటం అతనికి చేతకాలేదు. పాతకాలంనాటి ఫ్యాను కావటంతో అది విరిగి నా నెత్తిన పడింది. నేను ఫ్యానుతో సహా కిందపడ్డాను. బాల్చీతన్నటం కూడా చేతకానిదానిలా మిగిలిపోయాను.

లాయర్ సదాశివ నాకు పంపిన కోర్టు ఉత్తర్వులు మొగుడుగాడి చేతుల్లో పడకుండా దాయటానికి చాలా కష్టపడాల్సివచ్చింది.

అందుకని ఆ సంగతి నాకు తెలీదనుకున్నాడు. ఉరివేసి చంపేసి ఆత్మహత్యగా చిత్రించాలనుకున్నాడు. అది ఫెయిల్ కావటంతో ఇంట్లోంచి వెళ్ళగొట్టాడు.

ఇదే అదనుగా నేను బయటకు వచ్చేశాను. ఆ రోజు ఆ తెగింపు నిర్ణయం తీసుకొకపోతే నా అంతబుద్ధిమాలింది ఇంకొకటి ఉండేది కాదు. ఆసమయం వచ్చేవరకూ ఆగక తప్పలేదు. ముందే లేచి వచ్చినట్లయితే ఈ రిజల్టు ఉండేది కాదు.

ఏలూరునుండి బెజవాడ దాకా ఎలా వచ్చేశానో నాకే తెలీదు.

వరదలో కొట్టుకుపోతున్నవాడికి ఊతకర్ర దొరికినట్టు ఆ సందెచీకట్లో కామేశం నాకు దొరికాడు. నిజం చెప్పాలంటే నేను అతన్ని ఎక్స్ప్లాయిట్ చేశాను.

ఆ పరిస్థితుల్లో అలా చెయ్యక తప్పలేదు. కామేశం ఒక తోడుమాత్రమే కాదు, అనుక్షణం మనోధైర్యం అందించే టానిక్‌లాంటివాడు. ఎందుకో పరిచయం అయిన క్షణంనుండీ నేనంటే అమితభయభక్తులు ప్రదర్శించాడు.

అతని గురించి నేను గొప్పగా చెప్పుకోగలిగిందేమీలేదు... క్యారెక్టరురీత్యా చూస్తే, నా భర్తకూ అతనికీ పెద్దతేడాఏమీలేదు. నాతో వ్యవహరించిన తీరులోనే అతను భిన్నంగా ప్రవర్తించాడు. బహుశా అతని దారిద్ర్యం, దౌర్భాగ్యం అతని ఆహాన్ని చాలావరకూ చంపేశాయి.

కానీ, బేసిక్ లక్షణాలు కొన్ని ఉంటాయి కదా! అవి అతన్ని గిరీశం మాదిరి తయారుచేశాయి. గిరిశం ఒక వ్యాగబాండ్ కాపర్సుకు మాత్రమే కక్కుర్తిపడతాడు. కానీ, రామప్పంతుల్ని మించిన వాడు నా మొగుడు! గుళ్ళో లింగాన్ని కూడా కలిపి మింగేస్తాడు.

అందుకే, కామేశాన్ని నాతో ఉండనిచ్చాను. నా మానమర్యాదలకు అతనితో ఎలాంటి ఇబ్బందులూ లేకుండా చూసుకోగలిగాను. అది, కామేశం నాకు ఇచ్చిన సహకారమే!

గాడ్సేలాంటి వ్యక్తులను గాంధీజీలాంటి వ్యక్తులుగామార్చటం అసాధ్యమేమీ కాదు. కామేశానికి అర్హతకు మించిన అధికారాలిచ్చాను. అతనిలో నేనాశించిన మార్పు కొద్దికొద్దిగా వస్తోందని సంతోషించాను. మొదట్లో భయపడి చాలాసార్లు పారిపోయాడతను. మళ్ళీ బుద్ధి తెచ్చుకుని తిరిగి వచ్చేవాడు. రిజిస్ట్రేషను రోజునమాత్రం చెప్పాపెట్టకుండా మాయం కావటం నాకు బాధనిపించింది. ఒక భావదారిద్ర్యాన్ని నమ్ముకుంటే ఇలానే ఉంటుందని ఆ రోజు బాగా కోపం వచ్చింది.

అదే రోజున కుంతలావాళ్ళు కూడా రాలేకపోవటంతో ఆ రోజు ట్రస్టు రిజిస్ట్రేషన్ ఆగిపోయింది. లేకపోతే, ఎదురుగా ఉన్న డ్రైవరు శివా పేరుని అప్పటికప్పుడు చేర్చాల్సివచ్చేది.

అయినా ఆఖరు అవకాశంగా నేనే అతనింటికి వెళ్ళి అతన్ని బలవంతంగా నాతో తీసుకొచ్చాను. మనిషి ఎలా మారాలో గట్టిగా నూరిపోశాను. ఎందుకు మారాలో వివరించి చెప్పాను. మారతానన్నాడు. చాలావరకూ మారాడు కూడా!

అతనిలో మానవత్వం చిగురు వేస్తోందనిపించింది. సంతోషించాను. ఒకడి బతుకు బాగుచేసినా జన్మ ధన్యమైనట్టేకదా... అని!

ఆ తర్వాతే అసలు కథలు మొదలయ్యాయి. పూటకో మెలిక చొప్పున కాళీ, కుంతలా, సుందరం మూడుపాయల పెద్దజడలా నా చుట్టూ పేనసుకున్నారు.

కుంతల, కాళీలంటే నాకు అంత ఇష్టం కలగటానికి ఆ ఇద్దరూ తాము ఏది కావాలని కోరుకున్నారో దాన్నిసాధించటంలో గొప్ప విజయాన్ని సాధించటం ఒక కారణం.

కుంతల పెద్ద ఉద్యోగిని అయ్యింది.

కాళీ గొప్ప సామాజిక కార్యకర్త, ఉద్యమనాయకురాలూ అయ్యింది. అవకాశాలు కలిసొచ్చే వరకూ అణగిమణగివుండి, నా కలల్ని నిజం చేసుకునే దిశలో నేనూ నడిచాను.

మా ముగ్గురి దారులూ వేర్వేరు కావు. భావాలూ వేర్వేరు కావు. జీవితాలే వేరుగా నడిచాయి. 'యద్భావం తద్భవతి' అంటారు మన భావాలు ఎలా ఉన్నాయో మన జీవితాలూ కూడా అలానే నడుస్తాయట.

నేను మొదట్నుండీ, మగవాళ్ళను అల్లంతదూరాన ఉంచి వాళ్ళతో సివంగి అనిపించుకోవాలనే చూసేదాన్ని కాళీ తనకు మగపొడగిట్టనిదానిలా ఉండేది. ఈ లోకంలో మగాడే ఉండకూడదన్నంతగా దాని ఆలోచనలుండేవి. ఏ విషయం గురించి మాట్లాడినా అది చెప్పింది ఒక మగాడేగా 'అది రాసిన ఒక మగాడే"గా అనేది.

ఒకసారి మీటింగులో ఇదే ప్రశ్న ఎవరో అడిగితే, 'ఈ ప్రశ్న అడిగినవాడు మగాడేగా' అంది! అవును నేను మగాణ్ణే అన్నాడతను. అదే 'పురుషాహంకారం' అంటే అన్నది కాళీ!

"స్త్రీ అహంకారం మంచిదా!" అనడిగారెవరో... ఆ రోజు పెద్ద గొడవయ్యింది. ఆఖర్లో కుంతలకు మాట్లాడే అవకాశం వచ్చింది.

"అహంకారం స్త్రీలకి ఉన్నా, పురుషులకు ఉన్నా ఇద్దరిదీ తప్పే! సమన్వయం కావాలి. సామరస్యం కావాలి. ఒకరికోసం ఒకరుగా బతకాలి. ఎవరికోసం వాళ్ళే బతికితే స్త్రీ పురుష సమానత్వం ఎన్నటికీ రాదు..." అంది కుంతల.

"కుంతల చెప్పింది పలాయనవాదం" అంది కాళీ.

బయటకొచ్చాక వాళ్ళిద్దరికీ ఈ విషయంలో పెద్ద తగువే అయ్యింది.

"భార్యభర్తలు ఒకరినొకరు అర్థం చేసుకుని, సామరస్యంతో జీవించటం పలాయనవాదం ఎలా అవుతుందే... ఏ సూత్రం ఆధారంగా ఈ నిర్ధారణ చేశా...?" అని నేను కూడా కాళీని నిలదీశాను.

"రేపు నీకు పెళ్ళయ్యాక, నువ్వు నీ సామరస్యవాదాన్ని ఉపయోగించు, నీ మొగుడు మాత్రం తన అహంకారవాదంతో నిన్ను అణగతొక్కుతుంటాడు... అప్పుడు తెలుస్తుందే నీకు, అది చెప్పేది పలాయనవాదం అవునోకాదో..." అంది కాళీ!

నా విషయంలో దాని నోటి వాక్కు ఫలించింది. అచ్చుగుద్దినట్టు అలానే జరిగింది. ఆ మగాణ్ణి నాకు దగ్గరకాకుండా మాత్రమే నేను చెయ్యగలిగాను.

కాళీ మగాణ్ణి దూరంగా పెట్టగలిగింది. మా ఇద్దరిలో ఉన్న ఈ మౌలికమైన తేడాని నేను నాపెళ్ళైన అనతికాలంలోనే గుర్తించగలిగాను.

మా ఇద్దరికన్నా ఘనురాలు కుంతల. అది ఒక మగాణ్ణి ఇంట్లోనే అతిదగ్గరగా పెట్టుకుంది. కానీ అతన్ని ఎక్కడుంచాలో అక్కడుంచగలిగింది. గెలుపు దానిదే!

కామేశం ఇంట్లో నేను గడిపిన మూడు రాత్రుల్లోగానీ, నా గదిలో కామేశం ఉన్న మూడు రాత్రుల్లో గానీ నేను అతనికి చాలా దూరంగా ఉండగలిగాను. నా స్థానంలో కాళీ ఉంటే నాలా చేసివుండేదా?

సుందరాన్ని తనకు దూరంగా ఉంచగలిగింది కుంతల... పెళ్ళి అనుకున్న తరువాత కూడా!

నా దృష్టిలో మద్యపానానికి లొంగిపోవటం లాంటిదే సెక్సుకు లొంగిపోవటం కూడా ...

తాగని వాడి ముందు ఎన్ని సీసాలు పెట్టినా చుక్క కూడా ఎలా కదలదో, అలాగే సెక్సు కూడా అడుగు ముందుకు కదలదు. లొంగిపోయే గుణం మనసుకున్నదిగానీ, ఆల్కహాలులోనో, ఆపోజిట్ సెక్సులోనో లేదు. అదే కావాలని వెంపర్లాడే మనసుకు కుతి ఎన్నటికీ తీరదు.

మనిషిని కుడితి తొట్లో పడేస్తుంది.... కుతి!

గన్నవరం ఎయిర్‌పోర్టుకు కారిచ్చి శివానిని పంపాను. ఇంకాసేపట్లో కుంతలావాళ్ళొచ్చేస్తారు. ఈలోగా కాళీని పిలిచి మాట్లాడాను.

"కాళీ! నీ భవిష్యత్తు గురించి నువ్వేం ఆలోచిస్తున్నావు."

"నేను కాననం కాళిని! కాననం అంటే అడవి. నా మనసు అడవిలో వెలిసిన అమ్మవారు లాంటిది! ఎప్పటికైనా నా భవిష్యత్తు అడవిలోనేగానీ, ఈ మహానగరంలో ఉండదు" అంది కరాఖండిగా.

"సుందరం విషయం ఏమాలోచించావు?"

"కొత్తగా ఆలోచించేందుకు నా దగ్గర సమాచారం లేదు"

"అతను నీతోనే ఉంటానంటే...?"

"ఇదేమీ 'సుందరం గారి స్వయంవరం' కాదు కదా! నేనతనితో ఉంటానని వెంటబడ్డానా? ఆయనగారు నేనా... కుంతలా... అని తేల్చుకోలేక చీటీలు వేసి, ఓ డజనుసార్లు లాటరీ తీసి, ఎక్కువసార్లు నా పేరే వచ్చింది కాబట్టి నాతోనే ఉంటానంటాడా...?

"నువ్వు ప్రతిదీ అలా ఆషామాషీగా తీసుకోకు... ఇది జీవితసమస్య..."

"నాకైతే జీవితం సమస్యకానేకాదు! నా తుపాకీ నాకుంది. నా గుండె నిబ్బరం నాకుంది. నా పోరాట జీవితం నాకుంది. అవే నా సర్వస్వాలుగానీ, సుందరాలు కాదు!"

ఇలా సాగింది మా సంభాషణ. కాళీ ఆంతర్యం అర్థం అయ్యింది. కుంతల ఆంతర్యం కూడా అర్థం కావాలి. ఈ ఆర్నెల్ల కాలంలో అది ఏం ఆలోచించిందో తెలియాలి....

కుంతలావాళ్ళు వచ్చాక ఆ ముగ్గుర్నీ కూర్చోపెట్టాను. సుందరంగారి తల్లి సత్యవతమ్మ గారిని కూడా కూర్చోపెట్టాను.

ఇప్పటివరకూ కాళీ తన కోడలన్న సంగతి ఆమెకు తెలియదు. నేనే చెప్పాను.

"అమ్మా! నా మాటలు జాగ్రత్తగా వినండి. కాళీ అనే ఈ భద్రకాళి నీకు నీ భర్త ఇచ్చిన కోడలు. ఈ కుంతల నీకు నీ కొడుకు కోరి ఎంచుకున్న కోడలు. ఈ ఇద్దరిలో ఎవరు కావాలి...?" అనడిగాను.

సత్యవతమ్మగారు కొద్దిసేపు మౌనం వహించింది. తరువాత గట్టిగా గాలి పీల్చుకుని మాట్లాడటం మొదలెపెట్టింది.

"తల్లుల్లారా... మీరంతా బాగా చదువుకున్న ఆడపిల్లలు. నాకే ఒక కూతురుంటే మీలా చదివించి ఇంత గొప్పగా చేయగలిగేదాన్నికాదేమో...! మేం మా చిన్ననాటి నుండీ పెరిగినటువంటి పరిస్థితులు వేరు. ఇప్పటి మీ పరిస్థితులు వేరు.

నాన్న చెయ్యి గుండ్రంగా తిరిగి చూపుడువేలు ఏ మనిషి దగ్గర ఆగుతుందో వాడే మాకు మొగుడు అనుకునేవాళ్ళం మా చిన్నప్పుడు. నాన్న వేలువంకే చూస్తూ గడిపేవాళ్ళం.

మాకు ఇష్టాయిష్టాలంటే ఏమిటో తెలీవు. మొగుడుంటే దేవుడు...! తాగి ఇంటికొచ్చి తన్నాడనుకోండి... వెంటనే మా పెద్దాళ్ళు 'తంతే తన్నాడులోనే... ఇంతమాత్రానికే అంత ఏడవాలా... మేం అంతా తన్నులు తినకుండానే జీవిస్తున్నామంటావా...? అనే వాళ్ళు.

అందుకని ఏడుపుని కడుపులోనే కుక్కేసేవాళ్ళం.

మంగళసూత్రాలు కళ్ళకద్దుకొని, పతిదేవుని పాదాలకు నమస్కరించి నిద్ర లేచేవాళ్ళం.

రోడ్డు వాకిలి ఊడ్చి, పేడకళ్ళాపు చల్లి ఇంట్లోకొచ్చి, గుండిగల నిండా నీళ్ళు తోడి, బండెడు అంట్లు తోమి, మూటెడు బట్టలు ఉతికి, కట్టెలు కొట్టి మడి కట్టుకుని వంటలు చేసేవాళ్ళం.

మహానివేదన అయ్యాకే నోరు తెరిచి మాట్లాడేవాళ్ళం. అయినా మాకు అలసట అనిపించేది కాదు. నేను పదేళ్ళ వయసులో ఉన్నప్పుడు రోలుదగ్గర కూర్చుని పిండి రుబ్బుతుంటే మా ఇంటిపక్కన రామాయమ్మగారి కోడలొచ్చి "వదినా! మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందట..." అని చెప్పింది. నేను నమ్మను పొమ్మన్నాను.

అప్పట్లో స్వాతంత్ర్యం అంటే ఏమిటో అనుభవపూర్వకంగా మాకేం తెలుసు...?

'ఇంగ్లీషోడి బదులు తెలుగోడు గద్దెనెక్కటం... అని నేనంటే, "తెలుగోడు గద్దె ఎక్కితే అత్తింట్లో ఆరళ్ళను రద్దు చేస్తాడా...?' అనడిగింది మా వదిన!

నేను మడిమీద వున్నాను కాబట్టి దాని నోరు మూసేయలేక, 'ష్..' అన్నాను.

ఇంతలో మా మావగారొచ్చి "ఆడవాళ్ళు! మీకు రాజకీయాలెందుకే! మాటల్లోపడి, పచ్చట్లో ఉప్పు బదులు ఉప్పులో పచ్చడి వేసి చస్తారు. తినలేక మేం చావాలి..." అని అరిచి వెళ్ళాడు. అలా గడిచిపోయింది మా బాల్యం.

మీరేవేవో కలలంటారు. అవి మొగ్గ తొడక్కమునుపే పెళ్ళిళ్ళు అయిపోయాయి మాకు. మొగ్గలూ పూలూ లేకుండానే కడుపులో కాయలు కాచాయి. సుందరానికి పైన అరడజనుమంది ఆడపిల్లల్ని కన్నాను. సుందరం ఆఖరున పుట్టాడు. వీడొక్కడే నాకు మిగిలాడు.

వాడిపైనే ఆశలు పెట్టుకుని జీవిస్తున్నాను.

వాడేదో నన్నుద్ధరించాలని నాకు ఏ కోశానా లేదు.నన్ను తనదగ్గర పెట్టుకుని పోషించాలని కూడా కోరుకోవటంలేదు. వాడిసంసారాన్ని చక్కబెడితే నా బాధ్యత తీరుతుందంతే!

నిన్న మొన్నటిదాకా వందమందికి గుండిగడు అన్నం, కూర, పప్పు, వగైరా అవలీలగా వండి వార్చేసేదాన్ని. నాకు ఇప్పటికీ ఎవరి ఆసరా అక్కర్లేదు.

ఇప్పుడు నువ్వొచ్చి కాళీ... కుంతల ఇద్దరిలో నా ప్రాధాన్యత ఎవరికీ అనడిగావు కాబట్టి చెప్తున్నాను. పెళ్ళవ్వగానే వెళ్ళిపోయినా ఇన్నేళ్ళ ఎడబంధాన్ని మరిపిస్తూ, చచ్చిన నన్ను బతికించి మళ్ళీ నడిపించింది చూశావూ... ఆ పిల్లకన్నా దేవత ఎవరుంటారు...? వస్తే కోడలు పిల్ల అలాంటిది రావాలని కోరుకుంటాను..." అంది సత్యవతమ్మగారు.

ఆ దెబ్బతో అందరమూ అవాక్కయ్యాము.

"నా ఇష్టాన్ని నా కొడుకుపైన రుద్దటం నాకూ ఇష్టం ఉండదు. మీ భాషలో అనుకునేట్లు నేనేమీ ఛాందసవాదం బాపతు కాదు.

కాంగ్రెసుకు ఓటేయకుండా ప్రకాశంపంతులుగారి పార్టీకి వేశానని మావారు నన్ను మూడ్రోజులపాటు అన్నం తిననివ్వకుండా మాడ్చారు. అయినా గౌరవాలు తగ్గలేదు.

'పతియే ప్రత్యక్షదైవం' అనుకున్నాం కాబట్టే మా సంసారాలు నిలబడ్డాయి. ఇవ్వాళమీరంతా చదువుకొని మీకాళ్ళమీద మీరు నిలబడగలుగుతున్నారు కాబట్టి ఎదురు తిరగ్గలుగుతున్నారు. ప్రశ్నించగలుగుతున్నారు.

పెళ్ళిళ్ళంటే ఇలాగే జరగాలని నేను కోరుకుంటున్నాను.

ఆడపిల్లని మగపిల్లవాడు, మగపిల్లవాణ్ణి ఆడపిల్ల పరస్పరం అర్థం చేసుకున్నాకే

పెళ్ళిళ్ళు జరగాలి. చెప్పానుగా మా రోజుల్లో ఆడపిల్ల అభిప్రాయం అడగటం కన్నా చేతకానితనం ఇంకొకటి లేదన్నట్టుండేది పరిస్థితి.

"ఆడదాంతోనా వ్యవహారాలు..." అంటూ కేకలేసేవాళ్ళు. మిస్సమ్మ సినిమా చూసొచ్చి 'పెళ్ళాం కొంగుపట్టుకు తిరిగే వెర్రినాగన్నలకు నచ్చాలి. ఈసినిమా...' అన్నారు మా వారు. అదీ ఆనాటి పరిస్థితి ఇప్పుడలా ఉంటే చెల్లదు. ఆడపిల్లకు సమాన గౌరవం ఇవ్వాలి. లేకపోతే ఆడపిల్ల మన ముఖాన్నే తిరస్కరించేస్తోంది. ఇంకొన్నాళ్ళకు పెళ్ళికూతుళ్ళు దొరకని పరిస్థితి వస్తుంది.

పాతికేళ్ళ క్రితం లేడీ డాక్టర్లు స్కానింగులు విపరీతంగా తీయించి పుట్టబోయే బిడ్డ ఆడపిల్ల అయితే గర్భస్రావాలు చేశారు. ఇవ్వాళ పాతికేళ్ళ ఆడపిల్లల సంఖ్య తక్కువగా ఉండటానికి అది కూడా ఒక కారణం తర్వాత స్కానింగుచేసి బిడ్డ ఆడో మగో బయటకు చెప్పకూడదన్నాక ఆడపిల్లలు మళ్ళీ బతకటం మొదలయ్యింది.

అంటే రానున్న పది పదిహేనేళ్ళపాటు ఆడపిల్లల కరువు నడుస్తుందన్నమాట. అందాకానే కాదు ఆ తరువాత కూడా మగపిల్లలే అణగిమణగివుండాల్సిన రోజులు ముందున్నాయి.

ఇవ్వాళ పౌరుషాలకు పోయి, తేలిగ్గా విడాకులు ఇచ్చేస్తున్నారు కొత్త దంపతులు! మొదటి మూడేళ్ళు పొరపొచ్చాలు లేకుండా ఉంటే ఆ దాంపత్యం గట్టిగా ఉంటున్నట్టు లెక్క! విడాకుల కోసం కోర్టుకెక్కటాలు ఎక్కువగా మొదటి సంవత్సరంలోపే వస్తున్నాయి. కారణం ఆ ఇద్దరి మధ్యా అవగాహన కుదరకపోవటమే!

మా అబ్బాయి, వాడు కోరుకున్న అమ్మాయి ఒకరినొకరు ఆరేళ్ళపాటు అర్థం చేసుకున్నారు. కాబట్టి వాళ్ళిద్దరి సంసారానికీ ఢోకాలేదని గట్టిగా చెప్పగలను. అలాగని పెళ్ళికి ముందే ఇలా ఒకే ఇంట్లో కలిసి జీవించటాన్ని ఎలా ఒప్పుకుంటాము...?

ఆ సంగతి నాకు అప్పుడే తెలిసివుంటే తీవ్రంగా ఎదురుతిరిగివుండేదాన్ని.

మీరెలా ఆమోదించారో తెలీదుగానీ, అది సమాజ క్రమశిక్షణకు దెబ్బ. అలాంటివాటిని తప్పనిసరిగా ఖండించాలి..." సత్యవతమ్మ గారు అనర్గళంగా మాట్లాడుతుంటే మాకు నోటమాట రాలేదు. "ఇన్ని విషయాలు ఎలా తెలిశాయండీ మీకు..." అనడిగాను ఆశ్చర్యంగా!

తెలుసుకోవాలనే జిజ్ఞాస ఉంటే అన్నీ తెలుస్తాయమ్మా!" అని నవ్వారావిడ.

"ఈ ఇంట్లో పెళ్ళికొడుకు, ఆ ఇంట్లో పెళ్ళికూతురు ఉంటే ఒకరినొకరు అర్థం చేసుకోవటం ఎలాసాధ్యం అవుతుందీ...?" అనడిగాను.

దానికి ఆవిడ చెప్పిన సమాధానం ఇది...

ప్రేమవివాహాల్లో అయితే ఆడామగల మధ్య అవగాహన ఎక్కువగా ఉంటుందని నీ అభిప్రాయం కదా! నీ ప్రశ్ననిబట్టి అర్థం అవుతోందిలే!" అనడిగిందావిడ.

నేను అవునన్నాను.

"దేశం మొత్తం మీద సంగతి నాకు తెలీదుగానీ, నా చుట్టూ జరిగిన అనేక సంఘటనల్ని చూస్తే, ప్రేమవివాహాలలోనే విడాకుల సంఖ్య ఎక్కువగా కనిపిస్తోంది... అంటే, ప్రేమలో పడి, ఆ ఇద్దరూ పెళ్ళికి ముందే కుదుర్చుకోవలసిన అవగాహనల సంగతి మరచిపోతున్నారు. జీవితంలోకి ప్రవేశించాక ప్రేమ పంచదారచిలకలా కరిగిపోతుంది. చుట్టూ శూన్యం కనిపిస్తుంది.

ఒకటర్రా.... గుర్తుపెట్టుకోండి...! స్వంతంగా కుదుర్చుకున్నా పెద్దలు కుదిర్చినా పెళ్ళికి తొందరపడకుండా ఒకరినొకరు మాట్లాడుకొని, తమ ఆలోచనా సరళిని అర్థం చేసుకోవటం ఒక అవసరం. ఇష్టాయిష్టాలు చెప్పుకోవాలి. కలిసి ఏకాభిప్రాయానికి రాగలరా లేదా అనేది తేల్చుకోవాలి. ఇద్దరూ చెరో అడుగూ తగ్గేవారైతే దాంపత్యం సుఖవంతం అవుతుంది. కాకపోతే, ఆ సంబంధాన్ని వదులుకోవటమే మంచిది.

కాళీ విషయంలో మా అబ్బాయి చెయ్యలేకపోయిందీ, కుంతల విషయంలో చేసిందీ ఈ అవగాహననుకుదుర్చుకోవటమే! పాత తప్పును సరిచేసుకోవటానికి వాడు ఇంకో అవకాశం తీసుకునంటున్నందుకు కూడా సంతోషంగా ఉంది... మా అబ్బాయి కుంతలను కోరి, పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. ఆమె యోగ్యురాలు, మావాడికన్నా మించిన పిల్ల...

మగాడికి మించిన ఆడది భార్యగా వస్తే, మగాడి అహంకారం ఆడదాని అధిపత్యం బరాబర్ సరిపోతాయి. సంసారంలో సమతూకం వస్తుంది..." అన్నారామె.

అంతా విన్నాక నేను సూటిగా ఒకటే ప్రశ్న వేశాను.

"మీరు మీ ఇష్టానికి ఓటేస్తున్నారా... మీ అబ్బాయి ఇష్టానికి ఓటేస్తున్నారా...?"

ఆవిడ వెంటనే నవ్వి, "పెళ్ళి చేసుకునేది వాడు. వాడి ఇష్టమే ముఖ్యం. పెళ్ళి చేసుకోనాయనా... అని చెప్పగలనుగానీ, ఫలానా పిల్లను చేసుకో అని మాత్రం చెప్పలేను చెప్పనుకూడా"

సత్యవతమ్మ గారి మాటలకు ఒక విధంగా అందరమూ చలించిపోయాము.

"ఇంత మంది మీరున్నారు. అందరూ నా పిల్లలే! మీ మధ్య జీవించటంకన్నా నాకు అదృష్టం. ఏముంటుందీ...? ఇవ్వాళ ఉండి రేపు రాలిపోయేదాన్ని పుటుక్కు జరజర డుబుక్కుమే... అనేస్తానెప్పుడో" అన్నారావిడ... కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ...

మా అబ్బాయి తన జీవితానికి న్యాయం చేసుకున్నాడు. కానీ కాళీ జీవితానికి న్యాయం చేయటం మరిచిపోయాడు.

వాడు చేయకపోయానా నేనుచేయాలి. పెద్దదాన్ని... నాకా బాధ్యత ఉంది. నాకు ప్రాణం పోసి, తల్లిలా సాకింది నా బంగారుతల్లి ఈ కాళి.

మీఅందరూ అంగీకరిస్తే కాళీని నా కూతురుగా దత్తత తీసుకుంటాను.

మా వారి పెన్షను డబ్బు, నా పుట్టింటి ఆస్తిపాస్తులన్నీ నా తదనంతరం కాళీకి చెందేలా వీలునామా రాయించమ్మా సౌదామినీ... అంది సత్యవతమ్మగారు.

తన వలన జరిగిన అపకారానికి కాళీని క్షమాపణ కోరాడు సుందరం.

కుంతలా, సుందరం సత్యవతమ్మగారి దగ్గర ఆశీర్వాదాలు తీసుకున్నారు.

అప్పుడు నేను కాళీతో చెప్పాను.

నాదొక కోరిక కాళీ... నువ్వు తప్పక నెరవేర్చాలి...

విప్లవ కార్యక్రమం అయినా, అభ్యుదయ కార్యక్రమమైనా చివరికి ఒనగూర వలసింది అబలలకు న్యాయం జరగటమేకదా!

దాన్ని కేవలం ధర్నాలతో కన్నా న్యాయపోరాటాలతో ఎక్కువ సాధించవచ్చు.

న్యాయపోరాటాలు చేయాలంటే నువ్వే లాయరువైతే ఎక్కువ మేలు జరుగుతుంది.

నా మాట విని, నువ్వు లా కాలేజీలో చేరు. న్యాయశాస్త్రంలో పట్టాపుచ్చుకో! నీకు అన్ని విధాలా సాయం చేయటానికి మన లాయర్ సదా ఉన్నాడు. నీ వెనుక నేనుంటాను" అన్నాను.

సత్యవతమ్మ గారు నా మాటలతో ఏకీభవించారు.

నిజమే తల్లీ! న్యాయశాస్త్రం చదివితే బీదా బిక్కీలకు న్యాయం జరిగేలా చూడగలుగుతావు. ఇంతకన్నా మనిషిగా పుట్టినందుకు మనం చెయ్యగలిగేది ఏముందీ...?" అన్నారావిడ!

విడాకులపత్రాలపైన కాళీ, సుందరం చేత సంతకాలు చేయించాడు లాయరు సదాశివ. తరువాత అందరమూ కలిసి రిజిస్ట్రారు ఆఫీసుకు వెళ్ళాం. ముందే అపాయింట్‌మెంట్లన్నీ తీసుకోవటంతో చకచకా పనులన్నీ అయిపోయాయి.

కాళీ సాక్షి సంతకం చేసింది.

కుంతలా సుందరం ఒకింటివారు అయ్యారు. అన్ని వేడుకలూ పూర్తయ్యాయి.

"క్షేత్రయ్య అనుభవ ప్రాప్తిరస్తు" అని ఆశీర్వదించాను.

ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళారు.

కాళీ లా కాలేజీలో చేరింది.

నా భర్త కంటిచూపూ, నోటిమాట, చెవుల వినికిడీ లేకపోయినా. ప్రాణాలు ఉగ్గబట్టకుని జీవిస్తున్నాడు. వైద్యం సాగుతూనే వుంది.

మళ్ళీ నేను... నా సేవా కార్యక్రమాలూ... నా శరణాలయం, నా దగ్గరున్న పిల్లలు, అవ్వలూ, తాతయ్యలూ... నేనెప్పటికీ ఒంటరిదాన్ని అనుకోను. ఒంటరిని అవునో కాదో నాకు తెలీదు.

ఆ రోజు చాలా పెందరాళే నిద్ర వచ్చేసింది. భలే మంచి కలలొచ్చాయి.

ఒకరోజు ప్రొద్దునే సూర్యుడికన్నా ముందే ఎవరో పరిచితముఖం శరణాలయం వైపే నడిచి వస్తూ కనిపించాడు.

పొగమంచు తెరలోంచి స్పష్టాస్పష్టంగా అగుపించసాగింది అతని ముఖం, తేరిపార చూశాను... ఇంకెవరూ... కామేశం...

చకచకా కిందికి వెళ్ళి అతని కోసం గేట్లు రెండూ పూర్తిగా తెరిచాను.

"ఒకసారి నా పిల్లను చూసుకుందామనీ..." అంటూ సణిగాడు.

"పాపనే కాదు, నన్ను కూడా చూసుకోవాల్సింది నువ్వేకదా..." అన్నాను.

కాలేజీలో చదువుకునే రోజుల్లో మొగ్గలుతొడిగిన కలలు మొక్కలైనాయి. కామేశాన్ని చూడగానే మళ్ళీ చిగురులు వేశాయి.

"ఈ సారి ఇలా మిమ్మల్ని వదిలి వెళ్ళిపోకూడదని అనుకుంటున్నాను..." అంటున్నాడు కామేశం. ఇది కూడా నా కలలో ఒక సన్నివేశమేనేమో...!

నా కలలకు ఒక పేరుపెట్టుకుంటే 'చిగురులు వేసిన కలలు' అని పెట్టుకుంటాను.

❀❀❀ అయిపోయింది ❀❀❀

## డా॥ జి.వి.పూర్ణచందు, B.A.M.S., రచనలు

| | | |
|---|---|---|
| 1. | ఆహారవేదం | 400/- |
| 2. | దీర్ఘాయుష్మాన్‌భవ | 60/- |
| 3. | క్విక్‌రెమిడీస్ | 50/- |
| 4. | వంటిల్లే వైద్యశాల | 100/- |
| 5. | మీ వ్యాధులకు మీరే వైద్యులు | 190/- |
| 6. | ఆరోగ్య రహస్యాలు | 75/- |
| 7. | కీళ్ళ వ్యాధులు - సులభ నివారణ | 50/- |
| 8. | జీర్ణకోశ వ్యాధులు - సులభ నివారణ | 50/- |
| 9. | షుగర్ వ్యాధి-సులభ చికిత్స | 100/- |
| 10. | బి.పి. వ్యాధి- సులభ నివారణ | 50/- |
| 11. | చిటికలో చికిత్స | 150/- |
| 12. | భోజన భోగం | 90/- |
| 13. | ఆరు రుచులతో ఆరోగ్యం | 90/- |
| 14. | ఆయుర్వేదంలో పథ్యాలు-అ పథ్యాలు | 60/- |
| 15. | ఆడవారి కోసం ఆయుర్వేదం | 50/- |
| 16. | ఆయుర్వేదంలో సులభ చికిత్సలు | 60/- |
| 17. | ఆహారం - ఆరోగ్యం సందేహాలు - సమాధానాలు | 120/- |
| 18. | ఆరోగ్యం కోసమే... మన ఆహారం | 150/- |
| 19. | కొస మెరుపులు | 30/- |
| 20. | సభాపర్వం | 30/- |
| 21. | భారతీయ సభామర్యాదలు | 40/- |
| 22. | పద్యంలో మనం | 116/- |
| 23. | చిగురులు వేసిన కలలు (నవల) | 80/- |
| 24. | తెలుగుధీర (చారిత్రక నవల) | 150/- |

**ఆర్డరు పంపవలసిన చిరునామా :**




28-3-49, సంజీవయ్య కాలనీ,
అరండల్‌పేట, విజయవాడ - 520 002.
ఫోన్: 0866-2434320,
సెల్: 94401 72936, 90320 88555

ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యచికిత్సా నిపుణులు **డా॥ జి. వి. పూర్ణచందు** B.A.M.S. గారి **రచనలు**



Rs.400/-



Rs.100/-



Rs.190/-



Rs.50/-



Rs.60/-



Rs.90/-



Rs150/-



Rs.100/-



Rs.50/-



Rs.50/-



Rs.90/-



Rs.60/-












